పెచ్చు తీసే పనిలేదు. ముక్కలు తరగక్కర్లేదు.

శుభ్రం చేసే శ్రమలేదు. నూరుకునే భారంలేదు.

ఒక్కక్షణం కూడా వృథాకాదు!

# ఏ వేళనైనా - ఏ వంటకానికైనా మీకోసం సంసిద్ధం.

# స్వచ్ఛమైన - శుద్ధమైన ప్రియ అల్లం వెల్లుల్లి మిశ్రమం.




తిరుగులేని నాణ్యత కోసం
తాజా పరిమళపు ఘుమ ఘుమలకోసం
'ప్రియ' అల్లం వెల్లుల్లి మిశ్రమం.

దీనిలో కృత్రిమ పదార్థాలు ఏమున్నా లేవు. నూటికి నూరుపాళ్ళు ప్రకృతి సిద్ధంగా తయారైన సహజ మిశ్రమం.

**priya**

ఉషోదయా ఎంటర్‌ప్రైజస్ లిమిటెడ్,
(ప్రియాఫుడ్స్ డివిజన్), ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ. హైదరాబాదు - 500 482

Sista's-UEL-609/93 TEL

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

జనవరి చతుర నవల తృప్తి ..............................

**సమీక్షకుని పేరు :** ..............................

**చిరునామా :** ..............................

..............................

..............................

..............................

# చతుర ప్రపంచం

## కుక్క - క్రికెట్

నిత్యజీవితంలోనేకాక, సాహిత్యంతో, సైన్సుతో కూడా కుక్కకి కొన్ని లింకులు కనిపిస్తాయి. 'కుక్కపాటి విశ్వాసం మనిషికుండదనీ, 'అన్నంపెట్టిన చేతిని కుక్క కూడా కరవదనీ', ఇలా సాహితీకారులు సామెతలు, ఉపమానాల రూపంలో కుక్కకోస్థానం ఇస్తే, రేబిస్‌లాంటి భయంకర వ్యాధులు కుక్కల మూలంగానే అంటారు వైద్యశాస్త్రజ్ఞులు. పోతే నిత్యజీవితంలో పెంపుడు కుక్కలతో, ఊరకుక్కలతో రకరకాలపాట్లు పడుతూనే వున్నాడు మనిషి.

ఇంతకీ ఈ కుక్కగారు క్రికెట్ ఆటలోకూడా కొన్ని అద్భుతాలు చేసి చరిత్ర సృష్టించిన సంఘటనలున్నాయంటున్నారు ఆ ఫీల్డ్‌కి సంబంధించినవారు.

కొన్ని సంవత్సరాలక్రితం ఆస్ట్రేలియన్ క్రికెట్ టీమ్ బ్రిటన్ వెళ్ళడం జరిగింది. వాళ్ళు బ్రిటిష్ రాణిని క్రికెట్ మైదానంలోనే సందర్శించుకునే ప్రతిపాదన జరిగింది. అయితే రాణి రావడానికి ముందుగానే ఆట ముగియడం, అటుపైన ఎంతకీ ఆవిడ రాకపోవడం, అంతలోనే టీమ్‌ని బకింగ్‌హామ్ పేలస్‌కే ఆహ్వానించడం జరిగింది.

టీమ్‌ని కలుద్దామని వచ్చిన రాణీవెంట ఓ పది కుక్కలు వాటి వెనక వాటి శిక్షకుడు, అట్టహాసంగా వచ్చేసరికి, టీమ్‌లో కుక్కంటే ఎలర్జీ వున్న ఒకళ్ళిద్దరు ఆటగాళ్ళు మనసులో తిట్టుకున్నా పైకి నవ్వు పులుముకున్నారు. అంతలో రాణి వాళ్ళని పలకరించడం, కుక్కల్ని అక్కడే వదిలి మరో పనిమీద బయటకెళ్ళడం క్షణాల్లో జరిగింది. బహుశా ఆ శిక్షకుడికి కూడా ఆ కుక్కలంటే కోపమో ఏమో, వాటిని అదిలించి ఒకటి రెండు దెబ్బలెయ్యడంతో అవి భయంకరంగా మొరిగి టీమ్‌మీద పడ్డాయి. ఎలాగయితేనే వాటిని ఒదుల్చుకొని బయటపడ్డ ఆటగాళ్ళు చాలా సంవత్సరాలవరకూ ఆ సంఘటనని మరిచిపోలేకపోయారు.

క్రికెట్ ఆటలో ఒకప్పుడు 'డాగ్ స్ట్రోక్' అని ఒక విన్యాసంవుండేది. కుక్కలా కాలెత్తి స్ట్రోక్ ఇవ్వడం. అయితే ఆ తరవాత రంజిత్‌సింగ్ అనే ఆటగాడు ఆ పదాన్ని 'లెగ్ గ్లాన్స్'గా మార్చాడు. విలియం అనే ఓ బౌలర్‌గారి పెంపుడు కుక్క ఆయన ఆటకెళ్ళినప్పుడల్లా వెంటవుండి, ఫీల్డింగ్‌లో బంతి పట్టుకొచ్చి యజమానికిచ్చి సాయపడుతుండేది. ఒళ్ళు మండిన క్రికెట్ అధికారులు విలియంగారిని శాశ్వతంగా క్రికెట్‌నుంచి బహిష్కరించారు.

మరొక బౌలర్‌గారికి కూడా ఇలాగే ఫీల్డింగ్‌లో కుక్క సాయపడేదట. ఓసారి బాల్ బ్యాట్ దగ్గరకు రాగానే కొట్టబోతున్న బ్యాట్స్‌మన్ దగ్గరకెళ్ళి 'భౌ'మని భయంకరంగా మొరిగిందట. దాంతో ఆయన ఉలిక్కిపడి బాల్‌నే కాక బ్యాట్ కూడా వదిలేశాడట. ఆనక పిచ్చికోపంతో ఆ బ్యాట్ తీసుకుని కుక్కను చావబాదడం మొదలెట్టేసరికి, సదరు కుక్క యజమాని పరుగున వచ్చి ఆ బ్యాట్స్‌మాన్‌తో ముష్టియుద్ధం మొదలెట్టాడట. వీళ్లిద్దరి యుద్ధాన్ని నిర్లిప్తంగా చూస్తూ నుంచుందట కుక్క. దాంతో ఆటని కాన్సిల్ చేశారు అధికారులు. ఇంగ్లాండుకు చెందిన బ్రౌన్ అనే ఓ ప్రఖ్యాత బౌలర్ వేసిన బంతి బౌండరీ దాటి అక్కడ పడుకున్న ఓ కుక్కమీద పడటం తక్షణం అది చావడం జరిగింది.

ఆస్ట్రేలియాకి, న్యూజిలాండ్‌కి మెల్‌బోర్న్‌లో మాచ్ జరుగుతోంది. ప్రేక్షకులలో ఓ ప్రముఖ వ్యక్తిదగ్గర, ఆయనగారి పెంపుడు కుక్క కూడా కూర్చుని తదేకంగా మ్యాచ్ చూస్తోంది. 'మెయిన్' అనే బ్యాట్స్‌మాన్ కొట్టిన బంతి బౌండరీ దాటబోతుండగా సదరు కుక్క దానిని లటుక్కున పట్టి, చటుక్కున అక్కడినుంచి పారి

కవర్ ఫొటో: వి. సత్యమూర్తి



పోయి ప్లే గ్రౌండ్ చుట్టూ పరుగెత్తడం మొదలెట్టింది. ఫీల్డర్స్ అందరూ బంతికోసం దాని వెంటపడ్డారు. ఇంతలో బ్యాట్స్‌మాన్ 11 పరుగులు తీసేశాడు. మొత్తంమీద ఎలాగయితేనే ఆ కుక్కని, బంతిని పట్టుకున్నాక, నాకు 11 పరుగులూ ఇవ్వాల్సిందే అని బ్యాట్స్‌మాన్, అలా వీల్లేదని బౌలర్స్ వాదించుకోవడం ప్రారంభించారు. చివరికి దాన్ని బౌండరీగానే తేల్చి 4 పరుగులు ప్రకటించాడు అంపైర్. ఇల్లా కుక్కతో క్రికెట్ వింతలు ఎన్నో

## వింత శిక్షలు

నేరానికి తగిన శిక్షలు ఇప్పుడొకలావుంటే పూర్వం మరోరూపంలో వుండేవి. పైగా ఇప్పటి ఎన్నో మామూలు విషయాలను అప్పుడు ఘోరనేరాలుగా పరిగణించేవారు. 75 సంవత్సరాలకు పూర్వం అమెరికాలోని వెస్ట్ వర్జీనియాలో 'రైల్వేకంపార్ట్‌మెంట్‌లో తుమ్మరాదు' అని ఓ నిబంధన వుండేది. అలాగే వెర్‌మౌంట్‌లో గుర్రపుబొమ్మలను వేయడం, వాటిని పెయింట్ చెయ్యడం నిషిద్ధం. అలా చేసినవాళ్ళు కొన్ని సంవత్సరాలపాటు జైలుశిక్ష అనుభవించాల్సిందే.

జార్ చక్రవర్తి పాలనలో రష్యాలో పొగాకు పీలిస్తే తీవ్రమైన శిక్షకు గురయ్యేవారు ప్రజలు. ఇథోపియాలో ఎవరైనా సిగరెట్టు కాలుస్తూ పట్టుపడితే ముక్కు కోసేసేవారు. 17వ శతాబ్దంలో టర్కీలో ధూమపానానికి ఏకంగా ఉరిశిక్షే వేసేవారు. 1615లో పర్షియాలో ధూమపానానికి శిక్షగా గుర్రపులద్దెను తినిపించేవారు.

బాబిలన్‌లో డాక్టర్లకి కొన్ని నిబంధనలున్నాయి. పేషెంటుకి చేసిన ఆపరేషన్ విజయవంతమైతేనే ఫీజు వసూలుచెయ్యాలి. ఒకవేళ అలా కాక పేషెంటు మరణిస్తే డాక్టరుని ఉరితీసేవారు. అలాగే ఏదయినా ఇల్లుకూలి ఇంటి యజమాని మరణిస్తే ఇల్లు కట్టిన




కాంట్రాక్టరుని ఉరితీసేవారు.

ఇంక ఈజిప్టులో పూర్వం పిల్లిలా కనిపించే జంతువులనన్నిటినీ దేవుళ్ళలా పూజించేవారు. పిల్లిని చంపినవారికి ఉరిశిక్షే.

పదిహేనోశతాబ్దంలో బ్రిటన్‌లో కళాకారులకు ఎలాంటి గుర్తింపు ఉండేదికాదు సరికదా పొరపాటున ఎవరయినా తమ కళను ప్రదర్శించబోతే వాళ్ళని జైల్లోపెట్టి తన్నేవారు.

ఫ్రాన్స్‌లో ఆరోజుల్లో కళాకారులకు ఎలాంటి గౌరవం వుండేదికాదు. 17వ శతాబ్దంలో మాస్కోలో ఒక చిత్రమయిన నిబంధనుండేది. ఎవరయినా సూర్యాస్తమయం అయింతర్వాత రోడ్డుమీదకు రావాలనుకుంటే చేతుల్లో ఒక దీపం తప్పనిసరిగా ఉండాలి. ఆ దీపపు చిమ్నీ ఒకసారిగానీ, రెండుసార్లుగానీ పగలచ్చు. 3వసారి పగిలితే సదరు వ్యక్తి చేతులు రెండూ నరికేసేవారు. ఈ రూలు 1728లో ఆస్ట్రేలియాలోని సైరస్‌లో కూడా వుండేది.

## సినిమా వింతలు

సినీరంగానికున్నంత పోటీ మరి దేనికీ లేదేమో. తక్కువ సమయంలో ఎక్కువ డబ్బూ, అదనంగా పేరు ప్రఖ్యాతులూ కూడా తెచ్చిపెట్టడమే అందుక్కారణం. నటీనటులతోపాటు ఇప్పుడు జంతువులు కూడా నటించి పేరు గడిస్తున్నాయిగానీ ఆ జంతువులతో నటింపజేయడం కష్టసాధ్యమైన పని. కొన్నిసార్లు ఎంత ప్రయత్నించినా ఆశించిన ఫలితాలు రాకపోవడం కద్దు.

దర్శక నిర్మాత శ్రీ రామానందసాగర్ తీసిన 'లల్కార్' చిత్రానికి ఒక కొండచిలువ అవసరమైంది. దారాసింగ్ దానితో పోరాడవలసివుంది. విస్తృత పరిశోధనానంతరం 15 అడుగుల కొండచిలువ ఓ పాములవాని దగ్గర లభించింది. స్టూడియోలో లైట్ల కింద చితచితలాడే ప్రదేశంలో రిహార్సల్స్ ప్రారంభమయ్యాయి. యూనిట్‌లో అందరికీ నిరుత్సాహం కలిగించేవిధంగా ఆ పాము నీరసంగా వుంది గానీ రకరకాల ప్రయత్నాల తరవాత అది




ఉత్సాహాన్ని పుంజుకుంది. ఫలితంగా కెమేరా ఆన్‌చేసి షూటింగ్ ప్రారంభించారు. ఆ సర్పం దారాసింగ్ మెడని గట్టిగా నొక్కి పట్టటం అతను దానితో పోరాడటం దర్శకునికి తృప్తికలిగేలా చిత్రీకరించటంతో షాట్ పూర్తయింది. కానీ ఆ పోరాటం అంతటితో ఆగలేదు. దారాసింగ్ మెడనుండి రక్తం కారసాగింది. యూనిట్ సభ్యులందరూ భయకంపితులై తమ సహాయాన్ని అందించేలోపే దారాసింగ్ స్వయంశక్తితో దానిబారినుండి బయటపడ్డాడు. మరేనటుడైనా అయితే తప్పక ప్రాణాలు కోల్పోయేవాడు.

'హాథీ మేరీ సాథీ' చిత్రంలో రాజేష్‌ఖన్నా పులి, సింహంలాంటి క్రూరమృగాలతో నటించవలసి వుంది. షూటింగ్ ఎలాంటి ఆటంకమూ లేకుండా కొనసాగింది. 'నయీ దిన్ నయీ రాత్' చిత్రంలో సింహంతో నటించిన సంజీవ్ కుమార్ తొలుత నిర్భయంగా, నిస్సంకోచంగా నటించాడు. అందుకు కారణం ప్రతి దృశ్యానికి ముందూ సింహం మూతిని కట్టివేయడమే. ఒకరోజు మధ్యాహ్న భోజనానంతరం షూటింగ్ తిరిగి ప్రారంభమైంది. అప్పటికే సింహం నుష్టుగా తిని, మస్తుగా నిద్రించి లేచింది. రిహార్సల్స్ అనంతరం కెమేరా ఆన్‌చేశారు. సింహం మూతి కట్టి వున్నందున సంజీవ్‌కుమార్ ధైర్యంగా దగ్గరికెళ్ళి తన డైలాగులు చెప్పసాగాడు. కళ్ళు మిరమిట్లుగొలిపే లైట్లు కుట్టిన నోరు మొదలైనవన్నీ మృగరాజుని రెచ్చగొట్టాయి. అంతే తీయగా డైలాగులు చెప్తున్న సంజీవ్ ముఖాన్ని అమాంతం పంజాతో కొట్టింది. ఆ దెబ్బకి బుగ్గ వెంట రక్తం కారడమే కాదు, పాపం ఆ గాయంనుండి కోలుకోడానికి చాలాకాలం పట్టింది.

ఒంటెలాంటి జంతువుల శరీరాల నుండి భయంకరమైన దుర్వాసన వెలువడడంవల్ల వాటి పక్కన నిలబడడానికి కూడా ఎవరూ ఇష్టపడరు. 'రజియాసుల్తానా' చిత్రంలో హేమమాలిని ఒంటెతో నటించబోయేముందు సీసాలకొద్దీ సెంటు వాటిపై స్ప్రే చేయమని చిన్న కండిషన్ పెట్టింది. వారు ఇసుక తుఫాను ఘట్టంకోసం కృత్రిమ పంఖాలు ఏర్పాటు చేసి చిత్రీకరించబోతుంటే చిత్రంగా ఆ ప్రదేశంలో నిజమైన ఇసుక తుఫాను ప్రారంభమైంది. వాతావరణమంతా ఇసుక దుమ్ములతో భీభత్సంగా తయారైంది. దాంతో హేమమాలిని ఎక్కిన ఒంటె విజృంభించి పాకిస్తాన్ బోర్డర్ చేరుకుంది. సరిహద్దు దాటబోతుంటే భారత సైనికులు దానిని పట్టుకుని యూనిట్‌కి అప్పగించారు.

కుక్క, కోతి వంటి జంతువుల మూడ్స్ స్థిరంగా వుండవు. వీటితో తగువిధంగా

నటింపజేయడానికి దర్శకుడికి ఎంతో నేర్పు, ఓర్పు వుండాలి. 'రామ్ భరోసె' చిత్రంలో ఒక కుక్క నాయికని అనుసరించవలసి వుంది. కానీ చిత్రీకరణ ప్రారంభమయ్యేసరికి ఆ శునక రాజం చలనం లేని శిలలా నిలబడిపోసాగింది. అనేక పర్యాయాలు ఇలాగే జరగడంతో తెలివైన దర్శకుడు కుక్క పరుగిడవలసిన మార్గంలో వండిన చేప ముక్కలు జల్లించాడు. అంతే కుక్క అద్భుతంగా నటించింది. 'ఆఖరీ దావ్' చిత్రంలో అంజాద్‌ఖాన్ 5 కుక్కలను చంపినట్లు నటించవలసి వుండగా రెండు కుక్కలని నిజంగానే చంపడం, తర్వాత ఆత్మ రక్షణార్థం సమీపంలో వున్న చెట్టు ఎక్కడం అనుకోకుండా జరిగిపోయాయి.

'కాతిలోంకీకాతిల్' చిత్ర నిర్మాణంలో టీనా మునిం సరసన ఒక కోతి నటించింది. కేవలం ఆ దృశ్యానికే పాతికవేలు ఖర్చుపెట్టారు. ఇంకో గమ్మత్తేమిటంటే షూటింగ్ జరిగిన ఆ వారం రోజుల్లో కోతి టీనామునింతో గొప్ప స్నేహం చేసి ముద్దులివ్వడం వరకూ వచ్చింది. అంతేకాదు, ఆమె జడపిన్నుని ప్రేమగా అనేకసార్లు నాకిందట. మొత్తానికి దాని నటనకి నిర్మాతగారు పొంగిపోయారట.

జంతువుల నటన అందరికీ అబ్బురమే అన్పించినా, పిల్లలు పసితనపు అమాయకత్వంలో కేరింతలు కొడుతూ చూస్తారు. అయితే చిత్రపరిశ్రమలోని జంతువుల నటనలో భాగంగా జరిగే చిత్రవిచిత్రాలు మాత్రం అసంఖ్యాకం.

---

## యాదృచ్ఛికం

చిన్నతనంలో పిల్లలు ఇల్లువిడిచి వెళ్ళిపోవడం, కొన్ని సంవత్సరాల తరువాత యాదృచ్ఛికంగా తల్లితండ్రులకంటపడి, పుట్టుమచ్చ ద్వారానో, లేక మెడలో వున్న ఏ లాకెట్‌ద్వారానో తమ బిడ్డగా గుర్తించి తిరిగి కలుసుకోవడం సినిమాల్లో చూస్తూవుంటాము.

కానీ ఈజిప్ట్‌లో నిజంగానే అలాంటి ఓ వింతసంఘటన జరిగింది. షిడో అనే 14 ఏళ్ళ కుర్రవాడు కెయిరోలో కారుమెకానిక్‌గా పనిచేసేవాడు. ఓసారి యజమానికి కోపంవచ్చి చేతిలోవున్న ఇనపరాడ్‌తో షిడో నెత్తిమీద కొట్టాడు. దాంతో అతనికి మతిస్థిమితం తప్పి వీధుల్లో అడుక్కుతింటూ ఎన్నో ఊళ్లు తిరిగాడు. తిరిగి తిరిగి ఇరవై ఏళ్ళ తర్వాత అనుకోకుండా ఓ ఊళ్ళో స్వంత తల్లినే భిక్షమడిగాడు. అప్పటికి ధనవంతురాలైన ఆ తల్లి ఆ ముష్టిపిల్లాడిని తన కొడుకుగా గుర్తించి వెంటనే చికిత్స చే




యించింది. క్రమంగా పూర్వపు జ్ఞాపకశక్తి తిరిగి పొందిన షిడో తల్లిని గుర్తించి ఆనందంతో భోరున ఏడ్చాడు.



# 'గులాబీలు' పై సమీక్షలు

**నవంబర్ 'చతుర'లో ప్రచురితమైన ఓల్గా నవల 'గులాబీలు'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా వున్న ఐదింటిని ఈ దిగువన ప్రచురిస్తున్నాం.**

## గులాబీ 'ముల్లు'

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

ఓల్గాగారి 'గులాబీలు' మనోవైజ్ఞానిక నవలగా ప్రారంభమై సాంఘిక నవలగా ముగిసింది. కథానాయిక బాల్యజీవితంలో గులాబీపూలను దొంగతనం చేసినపుడు జరిగిన అవమానం, తండ్రి విధించిన శిక్ష ఆమె మనసులో గాఢంగా నాటుకున్నాయి. ఇక్కడే పాఠకులు గమనించవలసిన అంశం ఒకటుంది. ఎవరి మూలంగా తనకు తీరని అవమానం జరిగిందో ఆ తోట యజమానిలాగే తనూ రూపొందబోయింది. ఇది కాస్త వివాదాస్పద ధోరణే.

ఒక సర్వే చేసేందుకు పూనుకోవటంతో సుధకు సాంఘిక జీవితాన్ని, బయటి ప్రపంచాన్ని చూసే అవకాశం కలిగిన మాట నిజమే. అయితే విద్యా, వైద్య, ఆహార, ఆర్థికరంగాలూ, మద్యనిషేధం, బ్యాంకురుణాలు, నక్సలిజం, న్యాయవ్యవస్థ వంటి చాలా అంశాలను ఈ చిన్న నవలలో ఇమిడ్చే ప్రయత్నం రచయిత్రి చేయటం సాహసం. ఇందువల్ల ఇతివృత్తంలో సమైక్యత కొరవడింది. నవలలో చర్చ ఎక్కువగా చోటుచేసుకుంది. చర్చ విజ్ఞానదాయకంగా ఉండటం ఎంత ముఖ్యమో నవలలో దాన్ని కళాత్మకంగా ఇమడ్చటం కూడా అంత ముఖ్యమే.

రంగారెడ్డి జిల్లా మాండలీకం రాయటానికి రచయిత్రి పూనుకోవటం అభినందనీయమే. అయితే ఆమె ఈ విషయంలో సరైన కృషి చేసినట్లు లేదు. ఉదా: మన్కిలేకుంటే (పే72) పేనం (పే73) మునలాడు (పే75) చేలో (76) మెళ్ళో (79) గది (81)

మొదలైన రూపాలను ఆ జిల్లావాళ్ళు వాడరు.

సన్నివేశ కల్పనలో కూడా రచయిత్రి మరికా స్త శ్రద్ధ తీసుకోవాల్సి ఉంది. ఉదా: సుధకు వసువుపచ్చ గులాబీలు అందించే కుర్రవానికి బదులుగా సత్తెమ్మలాంటి అమ్మాయినే తీసుకుని ఉంటే సన్నివేశం మరింత అర్థవంతంగా ఉండేది. నవలలో బలమైన సన్నివేశాలు లేవని కాదు. మాణిక్యవల్లి తన తోటను తానే నాశనం చేసుకోవటం వంటివి సమకాలీన నవలలో అరుదైన సన్నివేశం.

మొత్తమ్మీద రచయిత్రి మానసిక బలహీనతలకు సౌందర్య దృష్టికి, మధ్యన ఉండే వైరుధ్యాన్ని సామాజిక జీవితంలో ఉన్న వర్గ సంబంధమైన, వైరుధ్యాలను తమ నవలలో విజయవంతంగా ప్రతిపాదించగలిగారు.

-ఎ. కవిత,
హైదరాబాద్

స్పష్టంగా చెప్పనేలేదు.

చిన్ననాటి స్నేహాల్లోని మాధుర్యాన్ని సుధ, జయల స్నేహంద్వారా రచయిత్రి చక్కగా వివరించారు. స్వార్థపరురాలైన సుధకు ఇతరుల మంచి గురించి ఆలోచించే భర్త, కూతురు, అత్త, ఆడపడుచు ఎందుకూ పనికిరానివారిలా కనిపించడం సహజమే.

ఖరీదైన హాస్పిటల్స్ గురించిన వాస్తవాలను చక్కగా చెప్పారు. "డబ్బుకి తప్ప మరి దేనికీ విలువలేదు. మంచీ, మానవత్వం, సేవ, మోరల్ ఎథిక్స్ ఏమీ లేవు. డబ్బు గుంజు.. ఇంకా గుంజు, ఇంకా గుంజు... ఇది ఒక్కటే సూత్రం" ఈ ఒక్క వాక్యంలో రచయిత్రి మొత్తం వైద్యవృత్తిని విశ్లేషించారు.

-జయశ్రీ,
విజయవాడ.

## స్పష్టత లేదు

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

"గులాబీలు" నవలలో రచయిత్రి చెప్పాలనుకొన్నది ఒకటి, చెప్పింది ఇంకొకటి! సుధకి చిన్నతనంలో ఎదురైన అనుభవం, ఆమెపై ఆ అనుభవం ప్రభావం, చివరిగా ఆమెలో కలిగిన మానసిక పరివర్తన నవలలో ప్రధానం. ఒక పల్లెటూరి సర్వేకి సుధ బయలుదేరిన దగ్గరనుండి తిరిగి ఇంటికి చేరేవరకు జరిగిన ప్రతి సంఘటనను, ముఖ్యంగా జీపులో జరిగిన సంభాషణలు పూసగ్రుచ్చినట్లు చేయటం కథనం పొడిగించడానికే అనిపిస్తుంది. ఆ సర్వేలో ఆమెపై ప్రభావం చూపిన ఒకే సంఘటన అక్కడి పిల్లవాడు నిస్వార్థంగా ఆమెకు ఇష్టమైన గులాబీలను ఇవ్వడమే. రచయిత్రి తనకు తెలిసిన విషయాలు అన్నీ నవలద్వారా పాఠకులకు బట్వాడా చేయాలని తాపత్రయపడినట్లు అనిపిస్తుంది. ప్రస్తుత ఆర్థిక విధానంపై రామారావు చేత చెప్పించిన అభిప్రాయాలు, పల్లెటూరి రాజకీయాలు, ఆర్థికపరిస్థితులు, సారా నిషేధ ఉద్యమం మొదలైన అంశాలు కథకు అవసరమైనంతవరకే ప్రాసినట్లయితే బావుండేది. చెప్పాలి అనుకొన్నది

## 'షాక్‌ట్రీట్‌మెంట్'

*(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

ఎంత చదువు చదువుకున్నా, ఎంత ఉన్నత పదవిలో ఉన్నా తనూ, తనజీవితం, తన ఇష్టాలే తప్ప తనచుట్టూ ఉన్న ప్రపంచం ఎలా తగలడిపోతున్నా పట్టించుకోని అనేకమంది మేధావులున్న ఈ సమాజంలోంచి ఓ 'సుధ'ను ఎన్నుకొని ఆరోగ్యకరమైన 'షాక్‌ట్రీట్‌మెంట్' ఇచ్చారు 'ఓల్గా'గారు నవంబరు 'చతుర' 'గులాబీలు'ద్వారా!

వ్యక్తి జీవితంలో బాల్యం ఎంత విలువయినదో సుధ పాత్రద్వారా తెలియచేసారు. అతిచిన్న వయసులో అనుభవించిన దరిద్రం, తీరని కోరికలు, తిన్నదెబ్బలు సుధను కర్కశురాలిగా చేసినా ఆమె మనసుమాత్రం 'గులాబీలు'లా సున్నితమైనదే. జయ ద్వారా సుధ మానసిక పరిస్థితిని తెలుసుకున్న ఆమె భర్త శ్రీకాంత్, అతని అక్క శారద సైకియాట్రిస్ట్‌వద్దకు తీసుకెళ్ళాలేమోనని ఆలోచిస్తోన్న తరుణంలో 'సర్వేలు' నిర్వహించే అవకాశం 'సుధ'కు రావ

టంతో ప్రత్యక్షానుభవం వజ్రకాఠిన్యమైన 'సుధ' మనసును 'గులాబీ'ల్లా సుకుమారంగానూ, సురభిళంగానూ మార్చగలిగింది.

నవలలో 'రామారావు'ద్వారా రచయిత్రి సామాన్యులకందని ఎన్నో విషయాలను ఐ.ఎం.ఎఫ్ నుండి రెండు రూపాయలకు కిలో బియ్యం పథకం వరకూ తెలియచేశారు. ఈనాడు గ్రామాలు సంకుచిత మనస్తత్వాల నాయకులతో, కుటిల రాజకీయాలతో, దోపిడీదార్లతో, వారి పల్లకీలు మోసే పోలీసులతో, ఓట్లకోసం గ్రామీణులను మంటల్లో శలభాల్లా మాడ్చే పనికిరాని పథకాలతో ఎలా మసైపోతున్నాయో కళ్ళకు కట్టినట్లు చిత్రీకరించారు. పెరుగుతున్న నాగరికతకు చిహ్నాలైన ప్రాజెక్టులూ, రవాణా కమ్యూనికేషన్లూ ఇవి దేశాభివృద్ధి కానేకాదని, నిజమైన జనచైతన్యమే దేశాభివృద్ధికి నిదర్శనమని రామారావు పాత్రద్వారా చెప్పించి చక్కని సందేశాన్నిచ్చారు. సమాజంలో అవినీతికి, అరాచకత్వానికీ ప్రాణాలను సైతం లెక్కచేయక ఎదురొడ్డి నిలవగలిగేది నిష్కల్మష మనస్కులైన గ్రామీణులే. అలాటి గ్రామీణులకు 'నేను సైతం ప్రపంచాగ్నికి' అన్నట్లు మేధావివర్గం, మధ్యతరగతి విద్యావంతులు ఏమాత్రం సహకరించినా అది దేశాభివృద్ధికి తమ వంతు కర్తవ్యాన్ని నిర్వహించినట్లే. ఈనాడు మేధావి వర్గంగా పరిగణించబడుతోన్న ఎంతోమందికి సామాన్య విషయాలు కూడా తెలియవనటానికి చక్కని ఉదాహరణ 'సుధ'కు ఐ.ఎం.ఎఫ్. అంటే తెలీకపోవటమే!

నవల కొన్ని పేజీలు చదివిన తరువాత అసలు కథనుండి తప్పిపోయి, దారితప్పి ఎక్కడెక్కడికో పోతున్నట్లు అనిపించినా సూత్రం తెగిపోకుండా మధ్యలో పల్లెటూరు కుర్రాడి చేత గులాబీపువ్వులు సుధకు ఇప్పించటం మానసికంగా దెబ్బతిన్న మనిషికి మరో దెబ్బ తగిల్తే కాని పూర్వస్థితి రాదన్నట్లు చివరకు సుధ మనసుమారటం ద్వారా ఓల్గాగారు సమర్థతని రుజువు చేసుకున్నారు.

-మూర్తి,
పార్వతీపురం.



## మధ్యతరగతి మనస్తత్వానికి మరో కోణం!

*(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

మధ్య తరగతి మనస్తత్వం పైతరగతులస్థాయిని చేరుకోవాలనే ఆశను 'గులాబీల'లో రచయిత్రి బాగానే చూపారు. మొదటినుంచి తననే కేంద్రబిందువుగా చేసుకొని ఆలోచించే 'సుధ'కు సైకియాట్రిస్ట్ ట్రీట్‌మెంట్‌కన్నా 'సామాజిక సమస్యల' ట్రీట్‌మెంట్ ఇవ్వడం హర్షించ తగ్గదే అయినా వాస్తవంగా "ఎంతవరకు సాధ్యమూ?" అని కాస్తంత అనుమానం. ఆదర్శ భావాలున్న భర్త, తండ్రినే ఎక్కువగా ఇష్టపడి తల్లిని అతిచిన్న ప్రాయంలోనే ప్రశ్నించే కూతురు, చిన్ననాటి స్నేహితురాలు 'జయ' చేయలేననుకున్న పని, ఓ గ్రామ సామాజిక సమస్య 'సుధ'లో మార్పు తేవడం బాగున్నా వాస్తవంలో సాధ్యం కాదేమోనని పిస్తుంది.

సుధలాంటి 'సగటు మధ్య తరగతి మనస్తత్వాన్ని' మార్చడానికి దాదాపు సగం నవలను గ్రామంలో నడవడం సరియైన కూర్పుఅనిపించలేదు. అలాగే రచయిత్రి తన స్వగతాన్ని పాత్రద్వారా కాకుండా తనే స్వయంగా చెప్పడం (82వ. పేజీలో) "వాళ్ళు లంచంగా... (83వ పేజీలో) స్థాలతో కోకోకోలాలను పీల్చినట్లుగా వ్యాసకర్త స్వభావాన్ని కనబర్చింది. సుధలాగే పెరిగిన జయ సామాజిక స్పృహ కలిగి వుండడానికి గల కారణాలను జయద్వారా గాని, జయ కుటుంబంద్వారాగాని లేదా పట్టణాల్లోనే వుండే బాధగ్రస్థులద్వారాగాని ఆ మార్పు జరిగినట్టు చూపితే బాగుండేది.

ఇక నవలలో మరో ముఖ్యాంశం- యూనివర్సిటీస్థాయి ప్రొఫెసర్, ఇతర అధ్యాపకులతో కలిసి గ్రామీణులు తీసుకునే ఆహారంలోని పోషకవిలువలను అధ్యయనం చేయడానికి పోయిన తీరు, ఆ గ్రామంలో వారు ప్రశ్నించిన తీరు కొంచెం ఎబ్బెట్టుగా అనిపించింది. ప్రతి సర్వేకు (అది ఎంత నిర్లక్ష్యంగా చేసినా) కనీసపద్ధతి వుంటుందనే విషయం నవలలో లోపించింది. అలాంటి సర్వేకు ప్రొఫెసర్‌ను పంపించడం అయన్ని పరోక్షంగా చాలా

మంచి వ్యక్తిగా చూపడం జరిగింది. సహజంగా అలాంటి వాటికి రిసెర్చిస్కాలర్స్‌లాంటి వారు పోవడం, అది కూడా నిర్దిష్టమైన ప్రశ్నావళి రూపొందించుకొని ఒక ప్రణాళిక ప్రకారం పోతారు. అదేమీ లేకుండా పిక్నిక్‌కు పోయినట్లు 'సర్వే'కు పోవడం అసహజంగా వున్నా- ఆర్థిక శాస్త్ర విభాగంలో పనిచేస్తూ కూడా సామాజిక, ఆర్థిక గ్రామీణ సమస్యలు తెలియకున్నా వాటి మీద డాక్టరేట్లు పొందుతున్న నేపథ్యంలో వారి మనస్థత్వాలను మాత్రం రచయిత్రి చూపగలిగారు.

ఎస్.ఐ.ని బెదిరించడానికి డి.జి.పి.కి ప్రొఫెసర్ని 'బావ'గా చిత్రీకరించడం ప్రొఫెసర్ మంచితనానికి, సామాజిక అవగాహనకు కొంచెం మసకలాగా వుంది. మొత్తంపై రచయిత్రి లక్ష్యం నవలలో నెరవేరింది.

**-డాక్టర్ జీయల్,**
కామారెడ్డి.

## గులాబీలు కాదేమో...

***(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)***

మామూలుగా అయితే మొక్కల్ని పెంచటాన్నీ పువ్వుల్ని ప్రేమించటాన్నీ వాటి అద్భుత సౌకుమార్యాన్ని పరిమళాన్ని సంభ్రమాశ్చర్యాలతో ఆస్వాదించడాన్ని- ఆ మనిషి యొక్క సున్నితమైన మనస్తత్వానికీ, సౌందర్యోపాసనకీ గుర్తుగా చెప్పుకోవచ్చు. భగవంతుడు ఎన్ని అద్భుతాలు చెయ్యగలడు అని సృష్టిలోని రంగురంగుల పువ్వుల్ని చూసి ఆశ్చర్యానందాల్ని పొందేవ్యక్తి ఎప్పుడూ కఠినమనస్తత్వంతో వ్యవహరించలేడు. గులాబీలు నవలలో నాయికకి పువ్వులు, వాటిని పెంచటం- పూయించటం అన్న విషయంమీద ఆసక్తి తప్ప అనురక్తి- ప్రకృతి సౌందర్యారాధనవంటి లక్షణాలేమీలేవు.

ఆమె ఒక అతిమామూలుస్త్రీ. తను, తనకోరికలు, తను అన్నమాట చెల్లించుకోవటం తప్ప మరేం తెలీదు. చిన్నప్పుడు ఆమెకి గులాబీలు దక్కలేదు కనుక వాటిని పెద్దయ్యాక తన స్వంతం చేసుకుని కఠినంగా వ్యవహరించింది. ఆమె మనస్తత్వానికి అవి గులాబీలే కానక్కర్లేదు తనకి దక్కని మరే వస్తువైనా కావచ్చు. చెట్టు నుంచి పువ్వు కొయ్య లేకపోవటం- యివ్వననడం కాఠిన్యంకాదు. కరుణశ్రీ హృదయంతో చూస్తే అది అర్థం అవుతుంది. ఈ కథలో పల్లెటూర్లో పిల్లవాడు పువ్వుల గుత్తి సుధకి యివ్వటం సుధ తన తోటలో గులాబీ ఎవరికీ యివ్వకపోవటం- ఈ రెండూ అతి మామూలు మనస్తత్వానికి చెందిన చర్యలు. యిద్దరికీ పువ్వుల సౌకుమార్యం తెలియదనే చెప్పాలి. ఒకటి అమాయకత్వం, యిచ్చే లక్షణం- రెండోది మితిమీరిన స్వార్థం, అహం. ఈ నవలకి గులాబీలు అనే పేరు కాకుండా యింకోటి పెట్టివుంటే బాగుండేదేమో.

గ్రామీణ సమస్యలగురించిన చర్చ ఈ నవలలో చాలానే సాగింది. కానీ రచయిత్రి గ్రామీణులంతా అమాయకులు- మంచివాళ్ళు- యిచ్చే స్వభావం వున్నవాళ్ళు అనటం సబబుగాలేదు. మంచి చెడులు అనేవి కాస్త తేడాలో అన్ని చోట్లా వుంటాయి.

రామారావుగారి పాత్రపోషణ కొద్దిగా దెబ్బతిన్నట్టుగా వుంది. లయ పాత్ర హృదయాన్ని కదిలించేలావుంది. సున్నిత హృదయుల జీవితాలకి అద్దం పట్టినట్లుగా వుంది. శారద పాత్ర అసంపూర్తిగా- అంతగా నవలకి అవసరం లేనట్టుగా వుంది. సుధ స్వార్థాన్ని హైలైట్ చేసేందుకే అన్నట్టుగావుంది.

మొత్తంమీద ఒక స్వార్థపరురాలైన యిల్లాలు- తన యిల్లే ప్రపంచం అనుకునే యిల్లాలు- ఆమెతో జీవితం- అనుభవాలు- సర్దుకోవడాలు చక్కగా చిత్రించారు రచయిత్రి. ఒక కుటుంబ కథా చిత్రం మనోనేత్రంముందు నిల్చింది. జయ పాత్ర బావుంది. స్త్రీ కళ్ళు తెరిచి నాలుగు పక్కలా చూడాలి అని ఈ పాత్రద్వారా చెప్పించారు రచయిత్రి. ఐ.ఎమ్.ఎఫ్ గురించిన ఇన్ఫర్మేషన్ విజ్ఞానదాయకంగా, ప్రతిమనిషి కర్తవ్యాన్ని గుర్తుచేస్తున్నట్టుగా వుంది. మొత్తంమీద చక్కగా చదివింపజేసే నవల 'గులాబీలు'

**-దర్భా లక్ష్మిఅన్నపూర్ణ,**
బెంగుళూరు.

సంపుటి: 16 సంచిక: 12

జనవరి 1994

ఉద్యోగ బాధ్యతలతో, రీసెర్చి వర్క్‌తో క్షణం తీరికలేని భార్యకు ముందుగా చెప్పకుండా ఫ్రెండ్స్‌ని డిన్నర్‌కి పిలిచే ఓ భర్త...

ప్రేమతో మనుమలకు గోరుముద్దలు తినిపిస్తూ, ఇల్లు చక్కదిద్దుతున్నా... ఉద్యోగిని అయిన కోడలిచేత తిట్లు తినే ఓ అత్త...

ఓపికగా ఇటు ఉద్యోగాన్నీ, అటు సంసారాన్ని కూడా సమర్థవంతంగా చూసుకునే ఓ గృహిణి...

కుటుంబ భవిష్యత్తుకోసం తావలచిన, తనను వలచి వచ్చిన ప్రేమికుణ్ణి వదులుకునే ఓ అమ్మాయి...

ఇలా రకరకాల వ్యక్తుల విభిన్న సంసారాల విచిత్ర కథాకథన కదంబం బి. రమణీ ప్రభాకర్ నవల

# తృప్తి

ఈ నెల చతుర సమగ్ర నవల.



ఉరుకులూ, పరుగుల్తో శక్తికొలదీ పరిగెడ్తోంది సింధు.

ఒక్కసారిగా వెనక్కి తిరిగి చూసింది.

చాలాదూరమే వచ్చేసింది కానీ, ఇంకా ఇంకా చాలాదూరం పరిగెత్తాల్సిందే.

తన తోటివారంతా చాలా దూరంగా కని పించారు, చాలా కులాసాగా, హాయిగా, నవ్వు తూ, తుళ్ళుతూ!

ఎలా? ఇదెలా సంభవం?

అలసటగా వుంది.

అయినా పరిగెడ్తోంది.

దూరంగా అరుణ్, పిల్లలూ చేతులూపుతు న్నారు. వాళ్ళని చేరుకోవాలని ప్రాణాలుగ్గబట్టి పరిగెడ్తోంది.

ఇంతలో 'అమ్మా' అన్న కేకతో ఒక్కసారిగా పడిపోయింది పెద్ద గుంటలో.

తలెత్తి చూసింది.

తను చాలా లోయగావున్న అగాధంలో పడి పోయింది.

ఎలా పైకి రావడం?

"హెల్ప్, హెల్ప్"

పిచ్చిగా కేకలు పెడ్తోంది. వెక్కి, వెక్కి ఏడుస్తోంది.

"సింధూ, సింధూ, కలొచ్చిందా? ఎందుక రుస్తున్నావ్ అర్ధరాత్రిపూటా?"

గట్టిగా జబ్బపట్టి కుదిపాడు అరుణ్.

మగతగా వున్నప్పటికీ సింధుకు అర్థమ యింది అదంతా కలని.

అయినా జవాబు చెప్పలేదు. అలాగే పడు కుంది.

"పీడకలొచ్చిందా?"

"వూఁ"

"భయపడ్డావా?"

"లేదు"

ఆ తర్వాత అటుతిరిగి పడుకున్నాడు కాబో లు, కాసేపటికే సన్నగా గురక వినిపించింది.

సింధు ఆలోచిస్తోంది.

పీడకల అంటే పీడించేకల కాబోలు. అవు ను... పీడిస్తోంది. ఎందుకొస్తోందీ కల?

నెమ్మదిగా గుండెలమీద చెయ్యేసుకుంది. తన గుండె చాలా వేగంగా కొట్టుకుంటున్నట్టు గమనించింది. నోరు తడారిపోయి, ఒళ్ళంతా చెమట్లుపట్టాయి. ఈ అనుభూతిని 'భయం' అంటారుకాబోలు.

'భయం'

ఈ మాటెవరైనా అంటే తను ఆటప ట్టించేది. చేతకానితనానికి మారుపేరు భయం అని తన ప్రగాఢ విశ్వాసం. చిన్నప్పటినుండీ సింధుకి భయం అంటే తెలీదు. ఒక్కతే చీకట్లో ఎంతెంతదూరాలైనా వెళ్ళిపోయేది. బూ చాడన్నా, పోలీసన్నా ఎవరన్నా భయపడేదికా దు.

డాక్టరుదగ్గరకెళ్ళి ధైర్యంగా 'ఇంజెక్షన్ ఇవ్వండి' అని అడిగిమరీ తీసుకునేదిట.

చిన్నపిల్లలందరూ సహజంగా టీచర్లంటే భయపడ్తారు. సింధుకి అదీలేదు.

ప్రతి క్లాసులో ఫస్ట్‌మార్కులు సింధువే కావ డంవల్ల ఎవరూ ఏమీ అనేవారు కారు. 'దె య్యాలూ, రాక్షసులూ' కథలు చెప్తే, 'చూ పించండి, చూడాలనుంది' అని మారాంచే సేది.

పరీక్షలంటే అందరూ భయపడ్తుంటే సింధు సరదాపడేది. ఇంజనీరింగులో సీటొ స్తుందా రాదా అని కానీ ఆ తర్వాత తనకు నచ్చినచోట వుద్యోగం వస్తుందా రాదా అనికానీ, ఎటువంటి భర్త లభిస్తాడో అనికానీ సింధు భయపడలేదు. చివరకు నెలలు నిండాకా ప్రసవం ఎలా జరుగుతుందో అని కూడా సింధుకి భయంవెయ్యలేదు.

మరిప్పుడు ఇలా ఎందుకు జరుగుతోంది?

జీవితంలో అతి ముఖ్య ఘట్టాలన్నీ సునా యాసంగా జరిగిపోయి, జీవితంలో స్థిరపడిపో యాకా ఇప్పుడు భయం ఎందుకు?

మెడకింద తడి తగిలింది. నెమ్మదిగా వొత్తి గిల్లి కళ్ళు తుడుచుకుంది సింధూర.

★ ★ ★

"పాలు"

తలుపుమీద టకటకా కొట్టిన చప్పుడ యింది. ఉలిక్కిపడి లేచింది సింధు.

పక్కమీంచి లేవాలంటే బద్ధకంగా వుంది. నెమ్మదిగా తడిమి గడియారం తీసుకుని కళ్ళు చికిలించి చూసింది. ఐదుంపావైంది. అమ్మో ఇప్పటికే పావుగంటాలశ్యమైపోయింది. ఐదు నిమిషాలటూ ఇటూ అయినా మొత్తం టైంటే బుల్ తల్లకిందులవుతుంది.

ఈ ఆలోచన రావడమే తరువాయి దిగ్గున లేచింది. బయటినించి పాలపాకెట్టు తెచ్చి గిన్నెలో పోసి స్టౌమీద పెట్టింది. పాచిమొహంతోటే కుక్కరు పడేసి బాత్రూంలో దూరింది.

బయటికొచ్చి పిల్లల్ని లేపుదామని వాళ్ళగదిలోకెళ్ళేటప్పటికి అమాయకమైన మొహాలతో నిద్రపోతూ కనిపించారు. నిండా ఏడేళ్ళైనా లేని రమ్యా, మొన్ననే మూడు నిండిన తేజా ఆదమరిచి నిద్రపోతున్నారు. కానీ లేవక తప్పదు. ఏడుంపావుకల్లా ఆటోవాడొస్తాడు. ఈ గంటన్నరలో కాలకృత్యాలన్నీ తీర్చుకుని, తినీ, తాగీ తయారవ్వాలి.

తల్లి మనసుని కట్టేసి, పిల్లల్ని గట్టిగా కుదిపి లేపేసింది. తేజ రాగంమొదలెట్టాడు. వాళ్ళని బలవంతంగా బాత్రూంలోకి తోసి వంటింట్లోకొచ్చి బూస్ట్ కలిపి టేబులుమీద పెట్టింది. ఫ్రిజ్‌లోంచి క్యాలీఫ్లవర్ తీసి కోస్తుండగా అరుణ్ లేచాడు. మొహం కడుక్కోకుండానే పేపరు పుచ్చుకుని "కాఫీ" అన్నాడు. సింధు టకటకా తరగడం మొదలెట్టింది.

ఇంతలో "అమ్మా, అమ్మా" అంటూ బాబు టాయిలెట్‌లోంచి అరుపులు.

"వాడిసంగతి చూడుముందు. అందుకే కూరలు రాత్రే తరిగిపెట్టుకోవాలంటాను" అన్నాడు అరుణ్.

సింధుకి చర్రున కోపమొచ్చింది. మొత్తం పనులన్నీ చేసుకుని, పిల్లల్ని చదివించుకుని, తన చదువు చూసుకుని పడుకునేటప్పటికే మామూలుగా పదకొండు అవుతుంటుంది. ఇక పొద్దుటి వంటకి కూడా రాత్రే చూసుకోవాలంటే పన్నెండవుతుంది. కానీ ఏం మాట్లాడదలుచుకోలేదు. పని పాడయిపోతుంది. మౌనంగా పని చేసుకుంటోంది.

పిల్లల్ని పంపించి 'అమ్మయ్య' అని వూపిరి తీసుకుని కాఫీగ్లాసు చేతిలోకి తీసుకుంటుండగా పనిమనిషి కొడుకొచ్చాడు. "మా యమ్మకి జొరమొచ్చింది, ఇయ్యాల రాదు" అని చావుకబురు చల్లగా చెప్పి జారుకున్నాడు.

అరుణ్ స్నానం చేసొచ్చాడు "ఏంటి?" అంటూ. చెప్పింది.

"ఏదో ఒకటి చెయ్యాలి. తప్పదు. చాలా కష్టంగావుంది" అంది.

"ఏ విషయం?" తల దువ్వుకుంటూ అడిగాడు.

"పని విషయం. నాకు యూనివర్శిటీలో పనెక్కువగా వుంటోంది. దానికితోడు డాక్టరేట్ చేతికి రావాలంటే కొంత కష్టపడాలి. ఇవతల పిల్లలింకా చిన్నవాళ్లు. ఇవన్నీ చూసుకోడానికి ఎవరన్నా వుంటే బావుంటుంది"

"నీకెవ్వరూ నచ్చరుగా! ఏదో ఒక వంకపెట్టి నాలుగురోజుల్లో పంపించేస్తావు" నిష్ఠూరంగా అన్నాడు.

సింధు ఇంక ఆగలేదు. "మీరు చెప్పేది మీ అమ్మగారు పంపిన వంటావిడ గురించేనా? ఆవిడ చెయ్యివాటుతనం అబద్ధమా? డబ్బు పోతే పోయింది, పిల్లలు చెడ్డమాటలు నేర్చుకుని చెడిపోతుంటే చూస్తూ వూర్కోవాలా? ఆవిడ మనవణ్ణీ, మేనకోడల్నీ ఎవరో ఒకళ్ళొచ్చి ఇక్కడే తిష్టవేసుకుని కూర్చుంటే కూడా వూరుకున్నాను. కానీ మన పక్కలమీద దొర్లి, నేను లేనప్పుడు నా చీరలు కట్టుకుని వూరేగితే ఎలా సహించను? కాస్త బాధ్యతగా ఆలోచించు" అని అక్కడనించి లేచెళ్ళిపోయింది.

ఇప్పటికే అత్తవారింట్లో అందరూ తను ఎక్కువ చదువులు చదివిందనీ, భయం, భక్తీ లేకుండావుంటుందనీ, అనుకూలవతి కాదనీ అనటం ఎలాగూ వుండనేవుంది. అందుకే అత్తగారు ఆడబిడ్డ దగ్గరే వుంటుందిగానీ ఇక్కడకు రాదు. తన కొడుకుతో సమానంగా, మళ్ళీ మాట్లాడితే అంతకంటే ఎక్కువ సంపాదిస్తున్నా ఇంటా బయటా చచ్చేట్లు చాకిరీ చేసుకుంటూ ఇల్లు నడుపుతున్నా ఆడది నోరు తెరిచి మాట్లాడితే అత్త హృదయం సహించదు. 'గరిండేరి దొరికింది. నా కొడుకు జీవితం నిప్పుల కొలిమైపోయింది' అని తల్లడిల్లు

తుంది. అదేపని అక్కడ కూతురుచేస్తే ఏమీ అనిపించదు. 'దాని మొగుడూ దానిష్టం' అనిపిస్తుంది.

''సాయంత్రం చారీవాళ్లని భోజనానికి పిలిచాను'' చెప్పాడు అరుణ్ భోంచేస్తూ.

''అరెరే! నాతో ముందుగా చెప్పాల్సింది. ఇవాళ కొంచెం లేటవుతుందే'' గాభరాగా అంది సింధు.

అరుణ్ మాట్లాడకుండా తింటున్నాడు. అంటే కోపమొచ్చిందన్నమాట.

ఎందుకిలా చేస్తాడు? ముందుగా తననడగొచ్చుకదా! సింధు మనసు పాడయిపోయింది. పోనీ త్వరగా వచ్చేద్దామంటే కుదరదు. సెమినార్ వుంది. పెద్దపెద్దవాళ్ళందరూ వస్తారు.

అరుణ్ కూడా ఆలోచిస్తున్నాడు. 'నేనేం చెప్పినా చటుక్కున కాదంటుంది. నా ఫీలింగ్స్ అర్థంచేసుకోదు. అందరు భార్యలూ ఇలాగే వుంటున్నారా? తన కొలీగ్ విశ్వనాథ్ భార్య ప్రతిరోజూ ఆఫీస్‌కి ఒక్కసారైనా ఫోన్‌చేసి త్వరగా వచ్చేయండి అని చెప్తుంది. మొన్న శాస్త్రీవాళ్ళింటికెళ్ళాడు. ఆవిడ కూడా వుద్యోగస్తురాలే అయినా ఎంత నమ్రతగా వుంది. వాడు 'వుట్టి కాఫీయేనా లేక అతిథికి టిఫిన్ భాగ్యమేమైనా వుందా?'' అనడగగానే విసుక్కోకుండా చిరునవ్వుతో అరిటికాయ బజ్జీలు చేసి తీసుకొచ్చింది. ఇలావుంది నా అదృష్టం అనుకుంటూ లేచి ఫోన్‌దగ్గరకు నడిచాడు.

కిచెన్‌లో గిన్నెలు సర్దుతున్న సింధుకి వినిపిస్తూనేవుంది ''ఎవరూ, మిసెస్ చారీయేనా? ఏమనుకోకండి. ఇవాళ మా బాస్ కొంచెం ఇంపార్టెంట్ ఎసైన్‌మెంట్‌మీద బయటకు పంపుతున్నాడు. కాబట్టి మనం అనుకున్నట్టు స్పెండ్ చెయ్యడానికి టైమ్ కుదరదు. వాడితో చెప్పండి. వన్స్‌ఎగైన్ సారీ'' అంటూ పెట్టేశాడు.

అబద్ధం ఎందుకు చెప్పాలి? మా ఆవిడకి చాలా అవసరమైన పనుంది అని చెప్పొచ్చుగా. అదే మేల్ ఈగో అనుకుంది సింధు. భార్య బిజీ పర్సన్ అనిగానీ, హోదాలో వుందని కానీ ఎవరితోనైనా చెప్పడానికి సంకోచిస్తారు. అదే భర్తలు పెద్దహోదాలో వుంటే భార్యలు చెప్పుకోవడానికిష్టపడ్తారు. గర్వపడ్తారు కూడా. బహుశా చిన్నప్పటినుంచీ పెరిగిన వాతావరణాన్నిబట్టి అలా ప్రవర్తిస్తారేమో. చాలామందిళ్ళల్లో తండ్రులు తల్లుల్ని చులకనచేసి మాట్లాడ్తుంటారు. ''దానికేం తెల్సు, వెర్రిపీనుగ, పిచ్చిముండ'' అనడం కూడా కద్దు. నలుగురిలో పట్టుకుని ''నోర్మూయ్ ఏడిశావ్'' అనడం వాళ్ళకో గొప్ప. భర్తలు అలా అంటుంటే మురిసిపోయే భార్యలే ఎక్కువ. ఒకవేళ ఎవరైనా ఎదిరించి ''అదేమిటలా అందరిముందూ చిన్నతనంచేసి మాట్లాడుతారు?'' అనడిగితే పెద్దవాళ్ళు, ''తప్పు, అలా భర్తనెదిరించకూడదు. మాటంటే తప్పేమిటి? పోషించేవాడూ, భరించేవాడూ అయినప్పుడు ఆమాత్రం అంటే తప్పా?'' అంటూ నీతులు చెప్పేవారేమో!

ఇంకా పాతకాలంలో భార్యని కొట్టనివాడు మగాడే కాదనుకొనేవాళ్ళుట. వాళ్ళతో పోల్చుకుని వీళ్ళు మురిసిపోతుంటారు. కొందరి సంసారాల్లో భర్తలకంటే భార్యలే తెలివిగా వుంటారు. భర్త అమాయకుడూ, అసమర్థుడు అయినప్పుడు సంసారబాధ్యత భార్య తనమీద వేసుకొని ఒక దారికి తెస్తుంటే తీరిగ్గా కూర్చుని అమ్మలక్కలు నానా పేర్లూ పెడ్తారు. 'అంతా ఆడపెత్తనం. మొగుడుకి గాజులు తొడిగి తను చక్రం తిప్పుతోంది' అంటూ ఇష్టంవచ్చినట్లు సాటి ఆడవాళ్ళే అంటుంటారు. అంటే ఆడదెప్పుడూ తెలివి విషయంలో మగాడికంటే తక్కువగానే వుండాలన్నమాట.

సింధు స్నేహితురాలు మీనా ప్రతిదానికీ 'మావారిలా అన్నారు' అనో, 'ఆయన మొదటే చెప్పారు' అనో అంటూవుంటుంది. మీనా మొదట్నుండీ చురుకైన పిల్ల. అలా అన్నింటికీ భర్తమీద ఆధారపడే అవసరం వున్న స్త్రీకాదు. ఎలక్ట్రికల్ ఇంజనీరింగ్ చదివి నెలకు నాలుగు వేలు సంపాదించుకుంటున్నా తనకేమీ తెలియదనీ, అంతా ఇంట్లో భర్తే చూసుకుంటాడనీ గర్వంగా చెప్పుకుంటుంది. నిజానికతడికి ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్. మీనా అంత తెలివైనవాడు కాదు. ఆ లోటు తీర్చుకోడంకోసం మీనా అలా నటిస్తుందని సింధుకి తెలుసు.

బస్‌లో కూర్చుందన్నమాటేకానీ సింధు ఆలోచిస్తూనేవుంది. పెళ్ళి నిశ్చయమయ్యాక

అరుణ్ మొదటిసారి తనింటికొచ్చినప్పుడు తను చామకూరతో బజ్జీలు చేసింది. అవి తనే చేశానని చెప్పినప్పుడు అతను "నేనదృష్ట వంతుడ్ని. నా మనసుకి దారి నీకు తెలుసు" అన్నాడు.

తనకర్థమయినా కానట్టే "అంటే?" అనడి గింది.

"భర్త మనసుకి దారి నోటిగుండా అని చాలామంది ఆడపిల్లలకి తెలియక వంట నేర్చుకోరు. నా శ్రీమతి వంట అద్భుతంగా చేస్తుంది. నన్నభినందించు" అన్నాడు.

ఆ మాటలకి తన మనసు రాగరంజిత మైంది. అతనెళ్ళిపోయాకా ఎన్నిసార్లో తలుచు కుని మురిసిపోయింది.

మరిప్పుడో!

అతను వంట గురించి రెండుకంటే ఎక్కు వమాటలు మాట్లాడితే విసుగ్గా వుంటోంది. చెయ్యలేకా, టైం లేకా తను చాలాసార్లు వంట తప్పించుకుంటుంది. బయట తిందామని ప్ర పోజ్ చేస్తుంది. అరుణ్‌కి అంతగా బయటతి నడం ఇష్టముండదు. అలా అని ఇంట్లో తన కేం సహాయంచెయ్యడు. ఇప్పుడు కనీసం పిల్లల వస్తువులు సర్దిపెట్టడం, అప్పుడప్పుడూ పక్కలవీ సర్ది ఇల్లు నీట్‌గా పెట్టడం, ఒక్కోసారి కాఫీ కలపడంలాంటివి చేస్తున్నాడు. కానీ అత్త గారు ఒక్కరోజుండి వెళ్ళిందంటేచాలు అన్నీ మొదటికొస్తాయి.

"మగాడు పక్కలు మార్చకూడదురా. ఇంటి కి దరిద్రం" అనో, "వంటకూడా నేర్పిందట్రా మీ ఆవిడ"అనో మాటలు వినుర్తుంటుంది.

"ఇద్దరం కష్టపడి సంపాదించి ఇళ్లనీ, వస్తు వులనీ అమర్చుకుంటున్నప్పుడు, కలిసి పని చేసుకుంటే తప్పేమిటి?" అని సింధు అంటే అదో పెద్ద నేరం. సంపాదిస్తోందని గర్వం అంటారు మొహంమీదే.

"ఏమిటంత ఆలోచన?" అంటూ మొ హంముందు చిటికెలేసి పిలిచింది కావేరి.

ఉలిక్కిపడి, అంతలోనే సర్దుకుని "మీరా? ఈమధ్య కనిపించటంలేదు. బస్‌లో రావ డంలేదా?" అడిగింది నవ్వుతూ సింధు.

"లేదు. పెద్దాడికి జ్వరమొస్తే లీవ్‌పెట్టాను. బస్‌లో రాకపోతే ఇంకెలా వస్తాను? కనీసం లూనా కూడా కొనుక్కొనే స్థితిలో లేను. మీరుమా త్రం ఇంత ఇబ్బందిపడి ఈ బస్‌లో రావడ మెందుకండీ. ఓ కారు కొనుక్కోవచ్చుగదా?" నవ్వుతూ చనువుగా అంది కావేరి.

"ఎంత చెట్టుకంతగాలి. అంటే ఎంత ఉద్యోగానికి అంత అప్పు అన్నమాట" అంటూ నవ్వింది సింధు.

కావేరి కూడా జతకలిపింది. కావేరి ఓ మందుల ఫాక్టరీలో సూపర్‌వైజరుద్యోగం చే స్తోంది. భర్త రైల్వేలో గుమస్తా. ఇంట్లో అత్తగా రుంటుంది పిల్లల్ని చూసుకోడానికి. అయినా పిల్లలకే జ్వరమో, విరేచనాలో అయితే కావేరి సెలవుపెట్టాల్సిందే.

"బాగాలేని పిల్లాడ్ని ఆవిడమీద ఎలా వది లివస్తాను చెప్పండీ" అంటుంది.

బస్సులు దొరక్క ఆలస్యమయినరోజు తనే దో తప్పుచేసేస్తున్నట్లు బాధపడిపోతుంటుంది. "ఈపాటికావిడ వంటకూడా చేసేస్తుంటారు. పిల్లలకు అన్నాలు కూడా పెట్టేస్తుంటారు. ఛీ, ఛీ వెళ్ళి తిని పడుకోడం! ఏమనుకుంటారు? ఎంత అసహ్యంగా వుంటుంది?" అంటూ తెగ బాధపడిపోతుంటుంది.

కావేరి మాటల్నిబట్టి చూస్తే వాళ్ళత్తగారు చాలా మంచావిడ. దేనికీ ఏమీ అనుకోదు. కానీ కావేరికో తంటా వచ్చిపడింది. ఆమె ఆడపడు చూవాళ్ళు అక్కడికి దగ్గర్లోనే ఇల్లు తీసుకుని వుంటున్నారు. ఆమె భర్తకి వ్యాపారం, బానే సంపాదిస్తాడు. వదినగారు ఉద్యోగం చే స్తోందని తనూ ఓ చిన్న స్కూల్లో చేరింది. పెద్దగా జీతమేం ఇవ్వరు. ఇచ్చినా అదీవిడ చీర్లకే సరిపోదు. అన్నమానం తల్లిమీదొచ్చిప డ్తుంది. "వాడి పిల్లల్ని చూస్తున్నావు. నా పిల్లల్నెందుకు చూడవు?" అని అవసరం లేకపోయినా పిల్లల్నిక్కడే వదిలేస్తుంది. సాయంత్రంపూట ఇక్కడేంవండినా, కూరల్తో సహా పట్టుకుపోతుంది. ఆదివారం కూడా పిల్ల ల్ని తల్లిమీద వదిలేసి భార్యా భర్తా సినిమాల కో, షికార్లకో వెళ్ళిపోతారు.

"ఆవిడటూ ఇటూ చెయ్యలేక నలిగిపోతు న్నారు. అప్పుడప్పుడు వెధవ వుద్యోగం వదిలి

పారేద్దామనిపిస్తుంది. కానీ ఇద్దరాడపిల్లల పెళ్ళిళ్ళు చేశాము. ఆయన జీతం అటేపోతుంది. నా జీతంతో ఇల్లు నెట్టుకురావాలి. పిల్లలు రెండేళ్ళుపోతే కాస్త గడికత్తారని ఓర్చుకుంటున్నాను'' అని ఓసారి చెప్పింది కావేరి.

వాళ్ళవాళ్ళ స్టేజీలొచ్చేంతవరకూ పిల్లల గురించీ, వాళ్ళ సమస్యల గురించీ పిచ్చాపాటీ మాట్లాడుకుంటూనే ఉంటారిద్దరూ.



చాటలో బియ్యంపోసి ఏరుతోంది తులశమ్మ. కళ్ళు సరిగ్గా ఆనటంలేదు. 'జోడు పాతదయిపోయింది. ఓసారి పరీక్ష చేయించుకోవాలి' అనుకుంది పైకితోసుకుంటూ.

''బామ్మా! ఆకలి'' అంటూ వచ్చాడు గోపి.

''అయిపోయింది నాన్నా. ఒక్క ఐదునిమిషాలు'' అంటూ అతి కష్టంమీద లేచి వంటింట్లోకి నడిచింది తులశమ్మ.

''అన్నం పెట్టకపోతే బిస్కట్లన్నీ తినేస్తా''నని బెదిరించాడు వాడు బిస్కెట్ల డబ్బా పుచ్చుకొని.

''ఒరేయ్ నాన్నా! తప్పమ్మా. అమ్మ తిడ్తుంది. రెండు తీసుకో మిగతావి పెట్టెయ్'' అని ఆవిడ అరుస్తున్నా వినిపించుకోకుండా డబ్బాతో వీధిలోకి పరుగుపెట్టాడు.

''ఒసేయ్, సీతా, వల్లీ చూడండే వాడ్ని అమ్మొచ్చిందంటే అందర్నీ కలిపి తిడుతుంది'' అంటూ కంగారుపడిపోయిందావిడ.

ఆవిడ కంగారుకి అర్థంవుంది. సీతా, వల్లీల తర్వాత చాలారోజులకి ఎన్నో పూజలూ, వ్రతాలూ చేస్తే గోపీ పుట్టాడు నర్మదకి. వాడంటే తల్లికీ తండ్రికీ కూడా గారం. వాడు చేసే ప్రతి అల్లరిపనికీ తిట్లూ దెబ్బలూ ఆడపిల్లలకే తగుల్తుంటాయి.

''మీరున్నదెందుకు? చూసుకోవచ్చుగా'' అంటుంది నర్మద.

''చిన్నపిల్లాడిమీద నేరాలు చెప్తావేమిటమ్మా?'' అంటాడు శంకర్.

అందుకే తులశమ్మ కొడుక్కికానీ, కోడలికికానీ వాడిమీద ఏమీ చెప్పదు. అది వాడికలుసయిపోయింది. అస్తమానం అక్కల్ని కొట్టడం. వాళ్ళ వస్తువులు లాక్కోవడం, వాళ్లేమైనా అంటే కాళ్ళు బాదుతూ ప్రాణాలుపోయినట్లు శోకాలుపెట్టడంలాంటి అఘాయిత్యాలు చేస్తాడు. వాడేడిస్తే నర్మద సహించదు. అత్తగార్నెంతమాటైనా అనేస్తుంది. అసలు నర్మద మొదట్నించీ అహంభావపురాలు. తను చాలా తెలివిగలదాన్ననీ, అందుకే బ్యాంక్ ఉద్యోగమొచ్చిందనీ అందర్తో చెబుతుంటుంది. అటు పుట్టింట్లోగానీ ఇటు అత్తవారింట్లోగానీ ఎవరూ ఉద్యోగస్తురాళ్ళు లేకపోవడంతో ఆమె గర్వం మరింతపెరిగింది.

కానీ ఈమధ్యనే పక్కవాటాలోకి కావేరీవాళ్ళూ దిగారు. కావేరి అందరితో మంచి కలుపుగోలుగా వుంటుంది. ఇంట్లో వున్నంతసేపూ ఏదో ఓపని చేస్తూ కనిపిస్తుంది. ఆదివారమొస్తే అత్తగార్ని కూర్చోబెట్టి మొత్తం పనంతా తనే చేస్తుంది.

వాళ్లత్తగారు వర్ధనమ్మగారూ, తులశమ్మగారూ త్వరలోనే స్నేహితులయిపోయారు. మాటల్లో ఎప్పుడో తులిశమ్మ ''కావేరి చాలా మంచి పిల్ల, నిదానస్తురాలు'' అంది.

అంతే! ఆరోజు ఇంట్లో జరిగిన గొడవ అంతా ఇంతా కాదు. ''మీ కళ్ళకి నేను రాక్షసినీ, పూళ్ళోవాళ్ళు దేవతలూ అన్నమాట. నాలా వేలకివేలు సంపాదించేవాళ్ళు ఇంట్లో పనిమనుమల్లా చాకిరీ చెయ్యనవసంలేదు. మీరు నన్నెవ్వరితో పోల్చనవసరంలేదు. మీ కొడుక్కంటే నా జీతమెక్కువ తెలుసా? నా సొమ్ము తింటూ నన్నంటే పడేదిలేదు. మీకు మధ్యాహ్నంపూట అమ్మలక్కలతో చేరి నాగురించి చెప్పడం తప్ప వేరే పనిలేదని నాకు తెలుసు.

ఇంకోసారి ఇలాంటిదేదైనా జరిగితే సహించను'' అంటూ వార్నింగిచ్చేసింది.

అప్పటినుండీ తులశమ్మ పక్కింటివాళ్ళతో మాట్లాడటం తగ్గించేసింది.

గట్టిగా అరుస్తూ లోపలికొచ్చింది నర్మద ''ఆ ముసలావిడేది? పిల్లాడిలా బురద కొట్టుకుపోతుంటే చూడకుండా ఏంచేస్తోంది? ఒసే వల్లి ముండా! ఎక్కడచచ్చావ్?'' అంటూ.

తులిశమ్మగారు కూర తరుగుతున్నదల్లా గబుక్కున లేచి ''ఏమైందమ్మా?'' అంది భయంగా.

''ఏమీ కాలేదండీ, నేనూ నా పిల్లలూ ఇంకా బతికేవున్నాము. హాయిగా మీవని మీరు చూసుకోండి. ఇంకో జన్మంటూ వుంటే నేను కూడా ఈ ఉద్యోగాలవీ చెయ్యకుండా హాయిగా నీడపట్టున కూర్చుని తిని బలుస్తాను'' అంటూ వాడ్ని రెక్కుచ్చుకుని బాత్రూంలోకీడ్చుకెళ్ళి ఒళ్ళంతా కడిగింది. కడుగుతున్నంతసేపూ గొణుగుతూనేవుంది.

తులిశమ్మకి కళ్ళనీళ్ళు తిరిగాయి. 'ఛీ పాడుజన్మ, ఇంకోచోటన్నా లేకపోయింది వెళ్ళడానికి' అనుకుంటూ వంటింట్లోకి నడిచింది కోడలుకి కాఫీ కలపడానికి.



"చూడా పిల్లనోరు! పెద్దావిడ చచ్చేంత చాకిరీ చేస్తుందికదా! ఎన్నిమాటలంటోందో విన్నావా?" అంది గొంతు తగ్గించి వర్ధనమ్మ.

చపాతీకి పిండి కలుపుతున్న కావేరి పక్కింటి భాగోతమంతా వింటూనేవుంది. "మనకెందుకులెండి. విందంటే మళ్ళీ ఆ మునలావిడ్ని వుతికిపారేస్తుంది. అయినా ఆ గోపీగాడి అల్లరి ఇంతా అంతాకాదు. మధుని వాడితో ఆడనియ్యకండి" అంది.

"మధుకి వాడితో పడదులే. 'ఎప్పుడూ కొట్తాడు నానమ్మా. నేను వాడితో ఆడను' అంటాడు. అయినా ఆ పెడసరమెందుకో వాళ్ళమ్మకి. చాలా పెద్ద ఉద్యోగమటగా"

నవ్వింది కావేరి. "నాకో బస్‌మేట్ వుంది సింధు అని. ఆవిడ ఇంజనీరింగ్ కాలేజీలో లెక్చరర్. జీతమెంతో తెల్సా? దగ్గరదగ్గర ఏడువేలు. అస్సలు గర్వంలేదు. ఎప్పుడూ చిరునవ్వుతో మాట్లాడుతుంది. మనకులాగే కష్టంసుఖం చెప్పుకుంటుంది. మిమ్మల్ని చూడాలని చాలాసార్లంది. ఓసారి తీసుకొస్తాను. కానీ పాపం టైముండదావిడకి" అంది.

"అలాగా? తప్పకుండా తీసుకురా. నేనూ చూస్తాను. అంత చదువుకుని, అంత పెద్ద వుద్యోగంచేస్తూ కూడా గర్వం లేకుండా వుండే వాళ్ళుంటారని మన పక్కింటావిడకీ చూపిద్దాము" అంది కోపంగా.

"అమ్మా, అమ్మా" అంటూ ప్రభ లోపలికొచ్చేసింది. "చపాతీలు చేస్తున్నావా వొదినా? పిండెక్కువ కలపకపోయావా, మావారికి ఇవాళ వారం. టిఫిన్ చెయ్యాలంటే బోరుగావుంది. ఒక్కమనిషికోసం ఏం చేస్తాం చెప్పు?" అంది పిండి కాస్త తీసి నోట్లో వేసుకుంటూ.

ఇంకొంచెం పిండి కలపడానికి లేచి డబ్బా దగ్గరకెళ్ళింది వర్ధనమ్మగారు.

★ ★ ★

సింధు టైం చూసుకుంది. ఆరున్నర దాటిపోయింది. పిల్లల్ని క్రష్‌నుండి అరుణ్ తెచ్చాడోలేదో? పొద్దుట రమ్యకి కొంచెం వొళ్ళు వేడిగా అనిపించింది. అయినా ఇంట్లో అట్టిపెట్టడానికి లేదు. మందేసి స్కూల్లో దిగబెట్టి ఫీవర్ ఎక్కువైతే తనకు ఫోన్‌చెయ్యమని చెప్పింది. కానీ తను పొద్దుటినుండీ డిపార్ట్‌మెంట్‌లో లేదు. కాన్ఫరెన్స్‌లో వుంది. ఫోన్ వచ్చిందో ఏమో! ఆటోవాడు స్కూల్‌నుంచి తీసుకెళ్ళి క్రష్‌లో దిగబెట్టేసుంటాడు. వాళ్ళు ఆరుదాటితే మొహం ముడుస్తారు. అరుణ్‌కి ఫోన్‌లో చెప్దామని తెగ ట్రైచేసింది. లైను కలవలేదు. ప్రతి ఆటోలో ఎవరో ఒకరుంటున్నారు. తనని దాటి వెళ్ళిపోతోంది. వెహికిల్‌మీదొద్దామంటే డ్రైవింగ్‌కిభయపడ్తోందీమధ్య. కాస్త లోబి.పి. ఐందేమో ట్రాఫిక్‌లోంచెళ్లేటప్పుడు కళ్ళు చీకట్లవుతున్నాయి. కడుపులో అదోమాదిరిగా వికారంగా వుంది. లంచ్‌టైంలో స్నాక్స్ కాఫీ తప్ప కడుపులో ఏంలేదు.

సింధు పెదవులమీద ఓరకమైన నవ్వొచ్చింది. పర్స్‌లో వెయ్యికి తక్కువకాకుండా డబ్బుంది. కానీ తినడానికి వ్యవధిలేదు. ఇంటికి టైంకి చేరే శక్తిలేదు. తన పిల్లలు దిక్కులేని వాళ్ళల్లా ఎవరిమీదో ఆధారపడి తనకోసం ఏడుస్తూ!

ఇంకా పైన ఊహించలేకపోయింది.

ఈ టెన్షనంతా తనకేనా లేక అరుణ్‌కి కూడానా? దూరంగా ఆటో ఆగివుంది. ఒక్కబిగిన పరుగుపెట్టింది సింధు. సింధు ఏరియా పేరు చెప్పగానే వాడో నిమిషం ఆలోచించాడు. ఆ నిమిషం ఓ గంటలా అనిపించింది సింధుకి. చివరకు వాడు వరమిచ్చే దేవుడి పోజులో ఎక్కమన్నట్టు తలూపాడు. సింధు గబుక్కు నెక్కికూర్చుంది. పాన్‌షాప్‌లోని ట్రాన్సిస్టర్ లోంచి పాట వినిపించింది...

ఎందాకా? ఎందాకా? ఎందాకా పరుగులు.

ఎందాకా? ఎందాకా? ఎందాకా?

ఈ పరుగేమిటి? ఈ ఉలుకేమిటి?

సందర్భం తప్పుకాని తన పరిస్థితికి సరిగ్గా వర్తించే పల్లవి అనుకుంది సింధు. ఆటో ప్రయాణిస్తున్నంతసేపూ ఆమె మనసు అంతకంటే వేగంగా ప్రయాణిస్తూ పిల్లలకోసం ఆరాటపడింది. ఆగీఆగగానే వాడికి డబ్బులిచ్చి పరిగెత్తుకుంటూ లోపలికెళ్లింది. ఆయా వొక్కత్తే వుంది.

పాపకి జ్వరమెక్కువైతే ఫోన్ చేశామమ్మా. మీరు కలవలేదు. వాళ్ల నాన్నగారికి ఫోన్ చేస్తే ఇందాకొచ్చి తీసుకెళ్లారు. ఇప్పుడే మళ్ళీ ఫోన్

చేశారు. స్నేహ నర్సింగ్‌హోమ్‌కి మీరొస్తే పంపించమని'' అంటూనే వెళ్ళిపోవడానికి తాళం తీసుకుని బయల్దేరింది.

ఉసూరుమంటూ బయటకొచ్చి నడిచే ఓపిక లేక మళ్ళీ ఆటో పట్టుకుని పక్కసందు లోనే వున్న నర్సింగ్‌హోమ్‌కి చేరింది. తల తిరిగిపోతోంది. కళ్ళల్లోంచి నీళ్ళు కూడా వచ్చేస్తు న్నాయి. అలాగే గబగబా పరుగులాంటి నడ కతో లోపలికెళ్ళింది.

నర్సింగ్‌హోమ్ చిన్నదే కావడంతో త్వర గానే కనిపించారు అరుణ్, తేజా. వాడు సింధుని చూడగానే 'అమ్మా' అంటూ వచ్చి కాళ్ళకి చుట్టేసుకున్నాడు.

అరుణ్ నిష్ఠూరంగా అన్నాడు. "నీకు ప్రొద్దుటే తెలుసుగా జ్వరమొచ్చిందనీ, త్వరగా వస్తావనుకున్నాను. డీహైడ్రేషన్ అయింది. లోపల సెలైన్ పెట్టారు. అమ్మకు కూడా కబురు చేశాను''

సింధు జవాబివ్వలేదు. లోపలకు నడి చింది. తోటకూర కాడలా వాడిపోయిన మొ హంతో పడుకునుంది రమ్య. చేతికి సెలైన్ పెట్టారు. దగ్గరకెళ్ళి నుదుటిమీద చెయ్యేసింది. కాలిపోతోంది.

తల్లి స్పర్శకి కళ్ళు తెరిచింది. బలహీనమైన స్వరంతో "మమ్మీ, ఫోన్ చేస్తే ఎందుకు రాలే దు?'' అంది.

సింధుకి దుఃఖం ఉబికి ఉబికి వచ్చింది. వంగి నుదుటిమీద ముద్దు పెట్టుకుంది. "చెడ్డ మమ్మీ'' అంది రమ్య. అంతలోనే మగతలోకి జారిపోయింది.

తేజా లోపలికొచ్చాడు. "మమ్మీ ఇంటికె ళ్దాం, ఆకలి'' అన్నాడు. కళ్ళు తుడుచుకుని "డాడీని పిలు'' అంది. అరుణ్ రాగానే చె ప్పింది. "మీరు తేజాకేదైనా తినడానికి పె ట్టించి, మీరు కూడా తిని ఇంటికెళ్ళిపోండి. నేనిక్కడుంటాను''

"నువ్వుండక్కర్లేదు. అమ్మ వస్తూనే వుంటుందీపాటికి'' అతని గొంతులో కోపం తెలుస్తూనేవుంది. "నేను రమ్య దగ్గరే వుంటా ను'' స్థిరంగా చెప్పింది సింధు. అరుణ్ వెళ్ళిపోయాడు తేజని తీసుకుని. సింధు మంచినీళ్ళు తాగొచ్చి రమ్యమీద చెయ్యేసుకుని కూర్చుంది. ఖాళీ కడుపులో నీళ్ళు పడేసరికీ నొప్పిగా అనిపించింది. అలాగే కళ్ళు మూసు కుని గోడకి తల ఆనించి కూర్చుంది. మాగ న్నుగా నిద్రపట్టేసింది.

పెద్ద పెద్ద గొంతులతో ఎవరో మాట్లాడ్తుండ డంతో మెలకువొచ్చింది. ఎదురుగా అత్తగా రూ, ఆడబిడ్డ కనిపించారు.

"తల్లీ, ఎలా అయిపోయావమ్మా! నా తల్లిక దూ కళ్ళుతెరు'' అంటోంది అత్తగారు.

సింధు కళ్ళు తెరవడంతో చెప్పింది వసుధ. "ఫోన్ రాగానే అమ్మకి కాళ్ళూ చేతులూ ఆడలే దనుకో. ఎలా వున్నవాళ్ళం అలా బయల్దేరి వెళ్ళిపోదామంది. ఆవిడ పంచప్రాణాలూ పిల్ల లమీదే అనుకో. అప్పటికీ నేనంటూనే వున్నాను, సింధూ లీవ్ పెట్టి వుంటుందిలే. పిల్లలకంటే ఎక్కువా ఏమిటి! నువ్వనవసరంగా ఖంగారు పడకు. అంత ప్రమాదమయితే వాడివాళ ఆఫీస్ కెళ్ళేవాడా? అని''

సింధుకి ఏం చెప్పాలో తెలీలేదు. "పొద్దు న్న అంతగా జ్వరంలేదు'' అంది తప్పు చేసిన ట్టు తల దించుకుంటూ.

రమ్య కళ్ళు తెరిచి వాళ్ళ బామ్మ చేయిపట్టు కుని "బామ్మా నువ్వు మా ఇంట్లో వుండిపో'' అంటోంది. దానికావిడ "వుండాలనే వుందే తల్లీ. మీ కోసమే బతుకుతున్నాను. మీకేమైనా వొస్తే ఈ ముసలిగుండె ఓర్చుకోగలదుటే'' అంటూ కొంగుతో ముక్కూ, కళ్ళూ అద్దుకుని దాని తల నిమిరింది. అది ఆవిడ చెయ్యి పట్టుకునే నిద్రలోకి జారిపోయింది.

"సింధూ నువ్విటే వచ్చినట్టున్నావ్. ఇంటికె ళ్ళి స్నానం అదీ చేసి రెస్ట్ తీసుకో, అమ్మిక్క డుంటుందిలే'' అంది వసుధ.

అత్తగారు సింధువైపు చూడలేదు. మాట కూడా మాట్లాడలేదు.

"ఫరవాలేదు. నేనిక్కడుంటాను. మీరింటికె ళ్ళండి'' అంది సింధు.

దానికావిడ "నేనింటి దగ్గరేం చేస్తాను? నా బంగారు తల్లిక్కడిలా వుంటే'' అంటూ మళ్ళీ కొంగు నోట్లో కుక్కుకుంది.

వసుధ మరీ బలవంతం చెయ్యడంతో సింధూ లేచి "మీ కోసం ఆయనతో భోజనం పంపిస్తా

ను'' అంది.

''నేనేం తినను ఇవాళ గురువారం'' అని ముక్తసరిగా జవాబిచ్చిందావిడ.

వసుధ ఆవిడతో ''నువ్వు నాలుగు రోజులుండే మాటయితే నాకు ఫోన్ చేయించు. నేను కూడా బయల్దేరి ఇంటికెళ్లిపోతా. ఆయనొచ్చే వేళయింది'' అంటూ లేచింది.

''మీరు కూడా ఇంటికి రండి'' అని పిలిచింది సింధు. తనకి కష్టమనీ, చాలా పన్లున్నాయనీ అవసరమైతే ఫోన్ చెయ్యమని చెప్పి ఆటో చేయించుకుని వెళ్లిపోయింది వసుధ.

సింధు, రమ్యతో చెప్పి ఇంటికి బయల్దేరింది. తనింటి కొచ్చేస్తుంటే రమ్య వుండమన లేదు. వాళ్ల బామ్మ చెయ్యిపట్టుకొనే తలూపింది. సింధుకి కలుక్కుమంది. కానీ చిన్న పిల్ల దానికేం తెలుసు. అన్నింటికి నేనిలా ఆలోచిస్తూన్నానేంటి?'' అనుకుంటూ ఇంటి దారి పట్టింది.

★ ★ ★

మర్నాడు రమ్యనింటికి తీసుకొచ్చేశారు. సింధు లీవ్ పెట్టి ఇంట్లోనే వుంది. అమ్మ దగ్గర అత్తగారే వుంది. అది అన్నింటికీ ''బామ్మా బామ్మా'' అని ఆవిడ్నే పిలుస్తోంది.

''సింధు అన్నిపన్లూ చేసి తన గదిలోకొచ్చి తన చదువు సంగతి చూసుకోసాగింది. అరుణ్ ఆఫీస్‌నించి రెండుసార్లు ఫోన్ చేసి రమ్యకెలా వుందో తెలుసుకున్నాడు. రెండుసార్లూ అత్తగారే ఫోన్ అందుకుంది. తనని పిలిస్తే మాట్లాడదామని సింధు అనుకుని పిలవకపోయేసరికి వూర్కుంది. వసుధ ఒక పనిమనిషిని వెంట పెట్టుకుని వచ్చింది. చిట్టెమ్మని అన్నిపన్లూ చేస్తూ పెట్టిందితిని వుండమని తీసుకొచ్చాను. జీతం రెండొందలయాభై అడుగుతోంది. ముఖ్యంగా పొద్దుటిపూట నీకు హడావిడిగా వున్నప్పుడు పిల్లల సంగతి చూస్తుంది'' అని చెప్పింది.

''పెళ్లయిందా?'' అని అత్తగారడిగితే కాలేదన్నట్లు తలూపింది. వయసు నలభైకి దగ్గరగా వుంటుంది. నల్లగా, బక్కపలచగా వుంది మనిషి. అభ్యంతర పెట్టాల్సిందేమీలేదు అనుకుంది సింధు.

సాయంత్రం అరుణ్ వచ్చేదాకా వుండి వెళ్ళిపోయింది వసుధ. చిట్టెమ్మకి చిన్న చిన్నపనులు చెప్పిందత్తగారు. సింధు వంటచేసి రమ్య గదిలోకొచ్చి ''బ్రెడ్ తింటావా?'' అడిగింది.

''బామ్మ పెడ్తేనే...''

సింధుకి చిర్రెత్తుకొచ్చింది. అయినా మాట్లాడకుండా గదిలోంచొచ్చేసింది. తేజా అప్పుడే చిట్టెమ్మకి బోలెడు కబుర్లు చెప్పేస్తున్నాడు. రాత్రి అరుణ్ అడిగాడు. ''రేపు కాలేజ్‌కెళ్తున్నావా?''

''వెళ్తాను.''

''అమ్మ ఇంకో రెండు రోజులుంటుందిట. ఆవిడున్నప్పుడు నువ్వింట్లో వుండకూడదూ''

''ఎందుకండీ అనవసరంగా. ఆవిడా నేనూ వుండి చేసేదేముంది? అది అన్నింటికీ ఆవిడ్నే పిలుస్తోంది కూడా. పిల్ల కులాసాగా వుంది కదా'' అంది.

'నువ్వున్నా నీ గది దాటి బయటకొచ్చి ఫోన్ రిసీవ్ చేసుకునే తీరిక కూడాలేకుండా నీ పనిలో మునిగిపోతావు కాబట్టి వున్నా వెళ్లినా ఒకటేలే'' అన్నాడు.

ఛళ్లుమని తగిలినట్టయింది సింధుకి.

''ఎందుకస్తమానం నన్నేదో అనాలని చూస్తావు? నీ ఒక్కడివే కాదు నేనూ బాధ్యతకల ఉద్యోగం చేస్తున్నాను. నేను తల్లిని కాబట్టి లీవ్‌పెట్టి ఇంట్లో వుండాలి. నువ్వు తండ్రివి కాబట్టి అఖ్ఖర్లేదు అనుకుంటున్నావేమో. పిల్లల విషయంలో ఇద్దరిదీ సమానమైన బాధ్యత. మీరుండండి, తల్లీ కొడుకులిద్దరూ, తప్పేంలేదు'' అని విసురుగానే చెప్పింది.

''తల్లీ అనగానే సరిపోదు. తల్లిగా బాధ్యతలు కూడా నిర్వర్తించాలి. అది అన్నింటికీ ఆవిడ్నే పిలుస్తోందంటే ఎందుకో ఆలోచించుకో. ఎప్పుడూ నీ చదువూ, నీ ఉద్యోగం, నీ హోదా తప్ప ఇంటి గురించి నీకు పట్టదు. నా సంగతొదిలెయ్, నువ్వెప్పుడూ భార్యగా నీ విధులు పాటించవు. పిల్లల విషయంలో కూడా ఇలా ప్రవర్తిస్తే వాళ్లు నీకు దూరమైపోవడం తప్పదు'' చూపుడువేలితో బెదిరించినట్టుగా అన్నాడు.

''ఏవిధంగా ప్రవర్తిస్తున్నాను? నీకు భార్యగా

ఏం చెయ్యడం లేదు? ఉద్యోగంచేసి నెలకిన్ని వేలు తెస్తుంటేకదా ఇబ్బంది పడకుండా సంసారమెళ్తోంది. ఒక్కడి జీతంమీద ఇల్లు కట్టుకొనే వాళ్ళమా? పిల్లలకింతింత డొనేషన్లు కట్టి మంచి స్కూళ్లల్లో వెయ్యగలుగుదుమా? వాళ్ళ భవిష్యత్తు కోసంకదా నేనింటా బయటా కష్టపడ్తుంట. నేను తిన్నా తినకున్నా మీ అందరికీ అన్నీ చేస్తూనేవున్నాను. మీ వాళ్ళెవరొచ్చినా వుండమనే అంటాను. వాళ్లే వెళ్లిపోతారు''

''ఎందుకెళ్లిపోతారో కూడా నువ్వే ఆలోచించుకో. అమ్మొచ్చి రెండురోజులయింది. నువ్వావిడతో ఎన్ని మాటలు మాట్లాడావు? ఆవిడ ఆరోగ్యం విషయం ఎప్పుడైనా కనుక్కున్నావా? ఆవిడకి స్వతంత్రమిచ్చి వంటింట్లో ఏ పనైనా చెయ్యనిచ్చావా? మా అక్కింటికి ఎప్పుడేనా నీ అంతట నువ్వు ఏ అవసరం, అకేషన్ లేకుండా వెళ్ళావా? వాళ్ళుండరూ అంటే ఎందుకుంటారు? అన్నం కోసమొస్తారా వాళ్లు? ఆప్యాయత, అనుబంధం కోసమొస్తారు. అదిక్కడ దొరకదు'' కుండబద్దలు కొట్టినట్లు చెప్పాడు.

''నీ మనసులో అసంతృప్తుందని తెలును గానీ, ఇంతుందనుకోలేదు. నువ్వూ బయటపడ్డావు గనుక నేనూ చెప్తున్నాను విను. ఆవిడా నాతో ముక్తసరిగా మాట్లాడ్తుంది. నేనూ అంతే. ఇంక వదినగారి విషయంలో నేనేం తక్కువ చెయ్యడంలేదు. వాళ్ల పిల్లలకి ఏ వేడుకలైనా వచ్చినప్పుడు అన్నీ కొని నీతోగూడా వచ్చి ఇస్తూనే వున్నాను. మాటిమాటికీ వెళ్లడానికి నాకు తీరికలేదు. మా వాళ్ళింటికెళ్తున్నానా పోనీ అంటే అదీలేదు. అయినా ఇదేప్రశ్న నేను వేస్తున్నాను చెప్పు! మా వాళ్ళింటికి ఎప్పుడైనా ఒక్కడివీ పనిలేకుండా వెళ్తావా?''

''నువ్వే ప్రశ్న వెయ్యడానికీ వెనుకాడవు. నీకన్నీ నాతో వంతులే అని తెలును. అందుకే మా అమ్మ మన దగ్గర వుండకుండా, కొడుకున్నా లేనివాడిలా జమకట్టి అల్లుడిపంచన చేరింది. ఆవిడే వుంటే ఈ పనిమనుషులతో తంటావుండదు. పిల్లలు అనాధల్లా పడివుండాల్సిన ఖర్మా వుండదు! అంతా మేం చేసుకున్న ఖర్మ, ఒకళ్లననాల్సిన పనిలేదు'' విసురుగా వెళ్ళిపోయాడు గదిలోంచి.

సింధుకి చాలా కోపమొచ్చింది. ఎన్ని నిందలు తనమీద మోపి వెళ్లిపోయాడు? తన కష్టాన్ని ఆవగింజంత కూడా అర్థం చేసుకోని భర్తా, అపార్థాలతో, అనుమానాలతో మనసువిప్పి మాట్లాడని అత్తా, అర్థం చేసుకునే వయసురాని పిల్లలూ ఎవరికోసం తనింత కష్టపడడం? ఎంతకాలమీ ఎదురీత? ఆ రాత్రి ఆలోచనలతో శివరాత్రే అయింది సింధుకి.



''అమ్మా వాళ్ళ గోపీకున్నలాంటి సైకిల్ కొనవా?'' అది నూరోసారేమో మధు అడగడం.

''కొంటానన్నాగా, వూర్కో ఇంక, అడగ్గానే వచ్చేస్తుందా?'' ఓపిగ్గానే సమాధానం చెప్పింది కావేరి.

''ఎప్పుడు కొంటావు? వాళ్లమ్మ అడగ్గానే కొంది. మీ అమ్మ ఎప్పుడూ ఏదీ కొనదు అని వాడు ఏడిపిస్తున్నాడు?'' ఏడుపొస్తుంటే దిగమింగుకుంటూ చెప్పాడు.

''ఇప్పుడే ఏం తొందర నాన్నా? అంత చిన్న సైకిల్ కొంటే రెండేళ్లకే నువ్వు పొడుగయిపోతావు. అది పొట్టిదయిపోతుంది. కాబట్టి రెండేళ్ళాగి పెద్దదే కొనుక్కుందాము'' వాడ్నిదగ్గరికి తీసుకుంటూ చెప్పింది.

''నువ్వెప్పుడూ ఇంతే'' వాడు గింజుకుంటూ అన్నాడు.

''ఏమిట్రా గొడవ? అమ్మ చెప్తుంటే వినవేం? ఇందాకట్నించీ చూస్తున్నాను'' గదిమాడు సుధాకర్.

తండ్రి కోపంగా అనేప్పటికి చరచరా వెళ్లిపోయాడక్కడ్నించి మధు.

''అదేమాట నెమ్మదిగా చెప్పొచ్చుగా మీరు'' భర్తతో అంది కావేరి.

''ఏం చెప్పినా వినకుండా ఆ మొండి పట్టుదలేంటి? అన్నింటికీ గోపీగాడితో వంతుకొస్తాడు. వాళ్ళకి వాడు ఆడిందాట. పాడింది పాట. వీడికలా సాగుతుందా?''

''చిన్న పిల్లలకవన్నీ ఏం తెలుస్తాయి? వాడికుంది కాబట్టి తనకీ కావాలనుకుంటాడు. అదే మొన్న నర్మదగారు వెయ్యి రూపాయలు పెట్టి వెంకటగిరీ చీరకొన్నారు. చాలా బావుంది అని ఒకటికి పదిసార్లు అనుకున్నాను. అంతే కానీ కొనుక్కోవాలని పట్టు బట్టానా? ఒకవేళ మీరు కొనుక్కోమన్నా ఒక నెలంతా కష్టపడ్తే వచ్చేదాంట్లో సగం పెట్టి కొనేనుకుంటానా? ఆ వితరణ వాళ్ళకిప్పుడే రమ్మంటే వస్తుందా చెప్పండి. మనలాగా బాధ్యతలూ బరువులూ మీద పడినప్పుడు వాటంతటవే తెలుస్తాయి'' నవ్వుతూ చెప్పింది.

సుధాకర్ ప్రేమగా చూశాడు కావేరివైపు ''నీకు నిజంగా ఆ చీర కొనుక్కోవాలనిపించిందా?''

''అనిపించింది. కానీ అది క్షణికమే. వెయ్యి రూపాయలంటే మనకి మామూలు కాదు. అవే వుంటే రేపు జయ శ్రీమంతానికి తడుముకోనఖ్ఖర్లేదు. మళ్ళీ స్కూళ్ళు తెరిచినప్పుడు పుస్తకాలకీ, డ్రస్సులకీ అప్పు చెయ్యానవసరంలేదు. ప్రభకీ, మీ బావగారికీ పండక్కి బట్టలు పెట్టి పంపొచ్చు. ఇలాంటి ముఖ్యమైన పనులన్నీ వొదిలిపెట్టి ఆ చీర కొనుక్కుని కట్టుకుంటే మనసుకి తృప్తా పాడా?''

''పిచ్చీ! ఎప్పుడూ ఇతర్ల కోసమేనా? నీ కోసమాలోచించుకోవా?'' గడ్డం పట్టి తనవైపు తిప్పుకున్నాడు సుధాకర్.

''నా కోసమాలోచించడానికి మీరున్నారుగా, అయినా అడిగారు కాబట్టి చెప్తున్నాను. పూజకి జ్వరమొచ్చి ఖంగారుపడినప్పుడు బెజవాడ కనకదుర్గకి చీర పెడ్తానని మొక్కుకున్నాను. ఆ వొక్కటీ తీర్చుకుందామండీ ఈ సంవత్సరం''

''అది కూడా నీ కోసం కాదే పిచ్చిమొద్దూ! నీలాంటి తెలివిలేనిదాన్ని నేను కాబట్టి భరిస్తున్నాను'' తన తలతో ఆమె తలను ఢీకొట్టి చెప్పాడు సుధాకర్.

''అవున్లెండి నేను మొద్దునీ. మీరు తెలివయినవారూ'' దీర్ఘం తీసింది కినుకగా కావేరి. ''అవునో కాదో ఇప్పుడే తేల్చేసుకుందామా! పూజా అమ్మ తెలివైందా? నాన్న తెలివైనవాడా?'' అడిగాడు అప్పుడే అటుగా వచ్చిన పూజని సుధాకర్.

''చెప్పమ్మా రేపు నీకు వచ్చేటప్పుడే క్యాడ్‌బరీస్ తెచ్చిస్తాను'' దాన్ని ఒళ్ళోకి తీసుకుంటూ చెప్పింది కావేరి.

''రేపు ఐస్‌క్రీమ్ తెద్దామనుకుంటున్నానే,'' కావేరి దగ్గరనించి తన వళ్ళోకి తీసుకుంటూ చెప్పాడు.

వాళ్ళిద్దర్నీ మార్చి, మార్చి చూసింది పూజ. క్యాడ్‌బరీస్ ఐస్‌క్రీం ఏది వదులుకోడం? అన్నయ్య కూడా లేడు సలహా చెప్పడానికి.

''ఇప్పుడే వస్తా'' ఒక్క గెంతులో దిగి బామ్మ దగ్గరకి పరిగెత్తింది. ''బామ్మా ఒక్కమాట ఇలారా'' అంటూ టి.వి. చూస్తున్నావిడ్ని చెయ్యిపట్టి గుంజుకొచ్చింది.

''ఏమిటే'' అంటూ దానివెంట పడుతూ లేస్తూ వచ్చింది వర్ధనమ్మగారు.

''అమ్మ తెలివైందా? నాన్న తెలివయినవారా?'' నడుంమీద చేతులు పెట్టుకొని ఆరిందాలా అడుగుతున్న కూతుర్ని చూస్తే నవ్వాగలేదా తల్లిదండ్రులకి.

వర్ధనమ్మగారు కూడా నవ్వుతూ ''వాళ్ళ ముందే అడుగుతే ఎట్లా చెప్పేదే?'' అంది.

పక్కగదిలోంచి అన్ని మాటలూ వింటున్న మధుగాడు తల లోపలికి పెట్టి ''అమ్మే తెలివైంది. ఏదడిగినా కొనకపోయినా కోప్పడదు. నాన్న గట్టిగా అరిచీ, కోప్పడీ చివరకు అమ్మకు తెలీకుండా రహస్యంగా కొనిపెడతారు'' అన్నాడు.

వాడి మాటలకి పకపకా నవ్వేరు అత్తాకోడళ్ళు.

బుంగమూతి పెట్టి కొడుకువైపు చూస్తున్న సుధాకర్‌ని ప్రేమగా చూస్తూ ''నా కొడుకెంత తెలివైనవాడు కాకపోతే ఆరోజు పెళ్ళిచూపులవగానే ''అమ్మా నాకా అమ్మాయి నచ్చింది, వాళ్ళ స్థితిగతులూ అవీ మనతో సమానంగా

వున్నాయి కాబట్టీ ఆ అమ్మాయికి మనలాగే ఆలోచించే మనస్తత్వముంటుంది. అదే లేనినాడు ఎన్ని కట్నాలూ కానుకలూ ఇచ్చినా అర్థంలేదు, అని తక్కున చెప్పాడు'' అన్నారు.

అవునా అన్నట్టు కళ్లతోటే అడిగింది కావేరి.

అంతేకాదు ఇంకా చాలా అన్నట్టు కనుబొమ్మలెగరేసి చెప్పాడు.

''అయితే, క్యాడ్‌బరీస్, ఐస్‌క్రీం'' చప్పట్లు కొట్టింది పూజ.

''రేపు తెచ్చిస్తారు కానీ ముందన్నాలు పెట్టాను పదండి''

వంటింట్లోకెళ్తున్న వర్ధనమ్మగారికి ఎదురు పడింది ప్రభ ''అమ్మా, పచ్చడేమయినా వుందా? మేమివాళ దోసెలేసుకుంటున్నాము''

''ఆ దోశలపిండేదో ఇక్కడికే తీసుకొచ్చి వేసుకుని అందరం తినొచ్చుగదే'' నవ్వుతూ ఆటపట్టించాడు సుధాకర్.

''వూర్కోండీ, పొద్దుట చేసిన అల్లం పచ్చడి వ్వుండి అత్తయ్యా'' అంటూ వంటింట్లోకి తనూ నడిచింది కావేరి.

''ఇలారా నాన్నా, సైకిల్ బర్త్‌డేకి కొంటానులే నరేనా!'' కొడుకుని దగ్గరకి తీసుకుంటూ చెప్పాడు సుధాకర్.

★ ★ ★

''ఛీ, ఛీ ఒక్క వస్తువు పెట్టిన చోటుండదు. ఏమిటే ఇల్లంతా ఇంత చిరాగ్గా పెట్టారు. వల్లీ ఈ ప్లాస్టిక్ బొమ్మలు కాళ్లల్లో గుచ్చుకుంటాయి. ఇంట్లో ఇలా ఇష్టం వచ్చినట్లు పారేయద్దని చెప్పానా? ఆ దిండ్లు కిందకెందుకు పారేసారు? మాసిపోవూ, ముసలావిడేదీ? ఇల్లంత అంగడంగడి చేసేస్తుంటే వద్దని కూడా చెప్పకుండా పడుకుని నిద్రపోయిందా? అబ్బా, అన్నం మెతుకులు, గోపీ ఏడి? సీతా ఇల్లూడ్చి, కుర్చీలు సరిగ్గా పెట్టు'' అంటూ ధుమధుమలాడ్తూ లోపలికొచ్చింది నర్మద.

నిజంగానే దొడ్లో మంచం వాల్చుకుని పడుకుని కనిపించింది తులిశమ్మ. దాంతో అరికాలి మంట నెత్తికెక్కినట్లయింది. ''ఎంత రాజభోగం, ఎంత దర్జా, చచ్చిచెడీ కొంపచేరితే, ఇల్లంతా ఇలా వదిలేసిందిగాక నిద్రపోతోంది చూడు...''

ఇంకా ఏదో అనబోతుండగా ''అమ్మా, మామ్మనేమీ అనకు. పొద్దుటినుండీ ఒకటే జ్వరం. అలాగే పనంతా చేసింది. సాయంత్రంనుండీ ఎక్కువయిపోయింది. ఒకటే మూలుగు. నాకు భయమేసి పక్క మామ్మగారిని తీసుకొచ్చాను. ఆవిడేదో మాత్ర, కాఫీ కలిపి తీసుకొచ్చి వేశారు. ఇప్పుడే నిద్రపట్టినట్లుంది'' అంటూ భయం భయంగానే చెప్పింది పెద్దకూతురు.

''పక్కింటివాళ్ళకీ, ఎదురింటివాళ్ళకీ తెలిసిందా? అమ్మయ్యా! ముసలావిడ్ని నానాకష్టాలూ పెట్టేస్తున్నారు. లేవలేకపోయినా చూసే దిక్కులేదు. అని అందరికీ ప్రచారమైపోవాలి. అంతేగా ఆవిడకి కావలసింది. ఇంకాసేపుంటే మా కోడలొస్తుంది. ఏ మందో మాకో ఇప్పిస్తుంది. అని వాళ్ళతో చెప్పిందా? చెప్పదు. ఎందుకు చెప్తుందీ ఈవిడకి సానుభూతి కావాలి. అందుకే ఈ వేషాలు'' అంటూ ఇంకా అక్కను తీరక వంగి నోట్సు రాసుకుంటున్న వల్లిని గుభీ, గుభీ రెండు గుద్ది ''ఫో తమ్ముణ్ణి తీసుకొచ్చి హోంవర్కు చేయించు'' అంటూ గదిమింది. అది ఏడుస్తూ వీధిలోకి పరిగెత్తింది.

తులిశమ్మగారికి అంతా తెలుస్తూనే వున్నా లేవడానికోపిక లేక కళ్లు మూసుకుని అలాగే పడుకుండిపోయింది.

ఆ రోజంతా ఆ ఇంట్లోనుండి నానా రాద్ధాంతం వినిపిస్తూనే వుంది. వర్ధనమ్మగారు మనసు కొట్టుకుపోయి అటూ ఇటూ తారట్లాడ్తోంది. మధ్య మధ్యలో కోడలితో... ఒక్కసారి ముసలావిడ్ని చూసిరానులే? కాస్త హార్లిక్స్ తాగుతుందేమో అడగనా?'' అని రెండు మూడు సార్లడిగింది. కావేరి తల అడ్డంగా వూపింది. దాంతో ఆవిడింక ధైర్యం చెయ్యలేదు. ''కొడుకొచ్చినట్టున్నాడు. డాక్టరు దగ్గరకి తీసుకెళ్తాడేమో'' అంటూ కాసేపు కిటికీ దగ్గర నిలబడింది.

''అత్తయ్యా, టీ.వి.లో మీ కిష్టమైన సీరియలొస్తోంది ఇలా రండి'' పిలిచింది కావేరి.

''బామ్మ రాదమ్మా, అక్కడింతకంటే మంచి నాటకమవుతోంది'' అన్నాడు మధు నవ్వుతూ.

''తప్పు అలా అనకూడదు'' చిన్న గొంతు

కతో కొడుకుని కసిరింది కావేరి.

ఆ రాత్రి వర్ధనమ్మగారు అన్నంముందు కూర్చుందేగానీ అన్నం సహించలేదు. అటూ ఇటూ కెలికి మజ్జిగ పోసుకుని పిడిచి తాగి లేచెళ్ళిపోయింది. కావేరికి అలాగే వుంది కానీ బయట పడలేదు. అందరూ పడుకున్నాక భర్తతో అంది.

"ఆ కొడుకసలు పట్టించుకోడెందుకండీ?"

"ఏ కొడుకూ?" సుధాకర్ ఎవరి గురించీ పట్టించుకోడు. ఎన్నిసార్లు చెప్పినా పక్కింటా యన పేరు కూడా గుర్తుంచుకోలేకపోయా



డింతవరకూ.

కావేరి పొద్దుటినుండీ వర్ధనమ్మగారు పడ్తున్న ఆరాటం, ఆ కోడలి రుద్రతాండవం, కొడుకు అసమర్థతా వివరించి చెప్పింది.

"భార్యకి భయపడని భర్తెవరోయ్ లోకంలో. నువ్వు సహకరిస్తున్నావు కాబట్టి ఇద్దరి చెల్లెళ్ల పెళ్లిళ్లు చేశాను. వాళ్లెప్పుడొచ్చినా ఆదరిస్తున్నాను. లేకపోయినా చేసేవాడ్నేమో, కానీ ఇంటి దాని పోరు ఇంతింత కాదనీ, మన శ్శాంతుంటుందా? ఇద్దరం రోజూ పోట్లాడుకుంటుంటే మధ్యలో పిల్లల భవిష్యత్తు పాడయిపోతుంది. అందుకని మాట్లాడకుండా వూరుకునేవాడ్నేమో ఎవరు చెప్పగలరు?"



"ఏమో నాకు మటుక్కు తల్లిని పలకరించడానికీ, మందిప్పించడానికీ కూడా ధైర్యంలేని బ్రతుకు ఒక బ్రతుకేనా అనిపిస్తోంది. అటువంటి వాడంటే భార్యకూ విలువుండదు. ఒకటి రెండుసార్లు ఎదిరించి మాట్లాడి 'నా తల్లికి మందిప్పించుకుంటాను. నువ్వెవరివి కాదనడానికి?' అనడిగితే తను తెలుసుకుని అతనికి స్వతంత్రభావాలున్నాయని జాగ్రత్తగా వుంటుంది. అంతేకానీ తానా అంటే తందానా అంటుంటే ఆ భర్తంటే లోకువేగాక కొన్నాళ్ళకి వాజమ్మని చేసుకున్నానని అసహ్యం కలుగుతుంది" తన మనోభావాలు వెల్లడించింది కావేరి.

"అందరూ మనలాగే ఆలోచిస్తారనుకోకు! లోకో భిన్నరుచి. అనవసరంగా ఎవళ్ల గురించో ఆలోచిస్తూ టైమ్ వేస్ట్ చెయ్యకు" అంటూ లైటార్పేశాడు సుధాకర్.

★ ★ ★

"ఆడది కాదూ, ఆమాత్రం అన్నం వండిపెట్టలేదూ! ఒకపూట చెయ్యలేక హోటల్ నుండి తెప్పించింది చూడు" అంటూనే కూర తరుగుతోంది వర్ధనమ్మ.

కావేరి పిల్లల్ని తయారు చెయ్యడంలో హడావిడిగా వుంది. "ఆవిడ్ని పట్టించుకునేందుకొక్కళ్లూ లేరు. టిఫిన్ తినేసి ఆ కొడుకెళ్లిపోయాడు. టక్కు టక్కుమని ఈవిడా వెళ్లిపోతోంది. పిల్లలు చిన్నవాళ్లు. కాస్త గంజికాచి పోసే దిక్కులేకుండా వదిలి వెళ్లిపోతున్నారు. మనమేవన్నా సహాయం చేద్దామా అంటే అదో పెద్దనేరం"

ఉల్లిపాయలు తరుగుతున్నందుకో లేక నిజంగానేనో కళ్లనుండి నీళ్లు కారిపోతున్నాయి. మధ్య మధ్యలో కొంగుతో తుడుచుకుంటోంది.

పూజకి జడేస్తున్న కావేరి "ఆవిడ వెళ్లిపోయాకా ఒక్కసారి చూసిరండి. అవసరమైతే ఏదైనా చేసి తీసికెళ్లి తాగించండి" అంది. దాంతో బోలెడుత్సాహం వచ్చేసిందావిడకి. గబగబా పని పూర్తిచేసి, జావ కాచింది. అది పుచ్చుకుని వెళ్ళడానికి గడియారంకేసి చూస్తూ కూర్చుంది. తొమ్మిదింటికి సుధాకర్, పిల్లల్నీ భార్యనీ టి.వి.యస్. మీదెక్కించుకుని, వాళ్లని స్కూల్లో భార్యని బస్‌స్టాప్‌లో దింపడానికి తీసుకెళ్లిపోయాడు. పదవుతుండగా నర్మద ఆఫీసుకి బయల్దేరింది. సందుచివర వరకూ వెళ్లిపోయేంతదాకా ఆగి అప్పుడు బయల్దేరింది వర్ధనమ్మ జావ గిన్నెతో తులశమ్మ దగ్గరకు.

★ ★ ★

"ఎందుకలా అన్నింటికీ జవాబివ్వకుండా నవ్వుతావు? నీ నవ్వుకోసం పడిచస్తాను అన్నంతమాత్రాన అలా చచ్చేదాకా నవ్వుతావా?"

వుడుకుమోత్తనంగా అడుగుతున్న శేఖర్‌ని చూసి మళ్ళీ నవ్వింది యమున. యమున నిజంగానే చాలా అందంగా నవ్వుతుంది. నవ్వగానే ఆమె మూతితోపాటు ముక్కు కూడా నవ్వుతుంది. ఆపైన తళుక్కుమనే పలువరుస. చామనఛాయలో చాలామంది దృష్టిలో నలుపు అనిపించే యమునకి వుండే నిడుపాటి కురులు పెట్టని ఆభరణాలు. ఆ కళ్ళు ఎవరో కవి వర్ణించినట్లు పండు వెన్నెల గనులే.

"మాట్లాడ్తావా లేక ఈ నీళ్ళల్లోకి దూకేయమంటావా?" సీరియస్‌గా అడిగాడు శేఖర్.

యమున మళ్ళీ నవ్వింది.

గబగబా షర్ట్‌పైన వేసుకున్న జర్కిని విప్పి "ఇది పట్టుకో" అంటూ యమున చేతికిచ్చి వంగి షూస్ లేస్ తియ్యసాగాడు. "ఎలాగో దూకేస్తున్నావు. ఇవన్నీ తీసి జాగ్రత్త చెయ్యడం ఎవరికోసం?" అల్లరిగా అడిగింది.

"అదే చెప్పబోతున్నాను. నీకు పిల్లలు పుట్టాకా అందులో మగ పిల్లాడికి ఇచ్చి 'నాకోసం ప్రాణ త్యాగం చేసుకున్న ఓ అమాయకుడివి, ఇవి నీకిమ్మన్నాడు' అని చెప్పు"

"వుహూ" చెప్పనన్నట్లుగా తల అడ్డంగా వూపింది.

"ఏం ఎందుకు చెప్పవూ? అందుకు కూడా నేను తగనా?" మరింత వుక్రోషంగా అడిగాడు.

"ఛీ ఏం బావుంటుంది చెప్పూ? అప్పుడివి వోల్డు ఫ్యాషన్ అయిపోతాయి" గంభీరంగా చెప్పింది.

"ఏయ్" అంటూ కొట్టడానికన్నట్లు చెయ్యెత్తాడు. తప్పించుకుంటూ గలగలా నవ్వింది.

"బీ సీరియస్, ముందు నేనడిగినదానికి జవాబు చెప్పు, ఎన్నాళ్ళీ బ్రహ్మచర్యం నాకు. పెళ్ళికి ఎందుకీ వాయిదాలు?" దీనంగా అడిగాడు.

"నాకు వాయిదాల పద్ధతంటే చాలా ఇష్టం. వాయిదాల పద్ధతిమీదే ఇంట్లోకి అన్నీ కొంటుంటాను. చివరకి ఇప్పుడు కట్టుకున్న ఈ చీర కూడా వాయిదాల పద్ధతిలోనే కొన్నాను. అలాగే వాయిదాల పద్ధతిలో నిన్ను పెళ్ళి చేసుకుందామనుకుంటున్నాను"

ఆమె మాటకడ్డొస్తూ "అంటే ఈ సంవత్సరం స్నాతకం, వచ్చే సంవత్సరం పెళ్ళి, ఆపై సంవత్సరం అదీ అన్నమాట" అంటూ కన్నుకొట్టాడు.

మూతి బిగించి కళ్ళతో, ముక్కుతో నవ్వింది యమున. "పోనీ ఆ లాస్ట్ ఇన్‌స్టాల్‌మెంటు ఫస్ట్ కట్టేసెయ్యి రాదూ?" ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుంటూ నెమ్మదిగా అడిగాడు.

కెవ్వుమంది.

కొంతమంది గిరుక్కున తలలు తిప్పి వీళ్ళ వైపు చూశారు.

"ఎందుకలా అరుస్తావు? మెత్తగా అడిగితే కాదనవనుకున్నాను" కొంటెగా చూశాడు

"ఇదిగో ఇలా మాట్లాడ్తే ఇంకెప్పుడూ నీతో రాను" చూపుడు వేలితో బెదిరించింది.

"మరేం మాట్లాడమంటావు?"

"ఏమైనా నాకిష్టమైన సంగతులు మాట్లాడొచ్చుగా" అంది టాంక్‌బండ్‌మీదనుంచి నీళ్ళ మధ్య నిశ్చలంగా వున్న బుద్ధుణ్ణి చూస్తూ.

"మీ అమ్మగారు అనంతుడి వ్రతం చేసినప్పుడు సొజ్జప్పాలు చేస్తారా?"

"వ్వాట్" అంది ఆశ్చర్యంగా.

"మీ నాన్నగారు చుట్ట తాగుతూ వాలు కుర్చీలో పడుకునుంటే చాలా అందంగా వుంటారు"

"నీకేమయిందసలు" ఇంకా ఆశ్చర్యంగా అడిగింది.

"మీ తమ్ముడికి చేగోడీలు చేసేటప్పుడు ఆ పిండితో పామూ, తేలూ లాంటివి చేసి వేయించు సరదాపడ్తాడు"

"నీకు నిజంగా పిచ్చెక్కింది" నుదురు కొట్టుకుంది.

"మీ అక్కయ్య కడుపుతోటుంటే చెప్పు, ఇప్పటినుండే పైసలు కూడేసి మొలతాడు చేయిస్తాను. బుజ్జిగాడు ముద్దొస్తాడు"

"నే వెళ్తాను" కోపంగా లేచి నిలబడింది

"మీ ఎదురింటి బామ్మగార్నడిగానని చెప్పు. వడియాలవీ డాబామీదెండపెట్టినప్పుడు వూరికే ప్రయాసపడక అక్కడ ఓ నల్లగుడ్డ పెట్టమని చెప్పు కాకులవీ రావు"

అతనివైపు చూడకుండా విసవిసా నాలుగడులేసింది. వెనకనించి అతను మాట్లాడ్తూనే వున్నాడు. "మీ పక్కింటావిడెప్పుడూ తెల్లచీరలో నీలం లంగా వేసుకుంటుందెందుకు?"

గిరుక్కున వెనక్కి తిరిగి చేతులు జోడించి "నన్నొదిలిపెట్టు" అంది

"అయితే మరి నాకిష్టమైన సంగతులు మాట్లాడనిస్తావా?" చిన్నపిల్లాడిలా మారాం చేశాడు.

"నీకిష్టమైన సంగతల్లా ఒకటేగా పెళ్ళి..." అంది నవ్వాపుకుంటూ.

"కాదు ముందు యమున, తర్వాత పెళ్ళి, తర్వాత పిల్లలు" చెప్పాడు ఆమె జడ చేతికి చుట్టు చుట్టుకుంటూ.

"చాలా ఆలశ్యమయిపోయింది. ఇంక బయల్దేరదాం" జడ అతని చేతినుండి విడిపించుకుంటూ అంది.

"అప్పుడేనా?"

"శేఖర్ నీ జీవితంలోంచి నేనెప్పుడెళ్ళిపోతానన్నా నువ్విదే ప్రశ్న వెయ్యాలి. అదే నా కోరిక" ఆమె కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లాయి.

"యమునా" అతను చలించిపోయాడనటానికి నిదర్శనంగా అతని చేతిలో యమున భుజం బిగుసుకుంది. "ఎప్పుడూ మనం బయల్దేరేటప్పుడిలా మాట్లాడకు. మళ్ళీ నిన్ను చూసేదాకా నాకు మతి మతిలో వుండదు" సీరియస్‌గా చెప్పాడు.

"నువ్విలా నా గురించి బెంగపడ్తుంటే ఎంత బావుందో తెలుసా?" నవ్వింది యమున.

నెత్తిమీద మొట్టికాయేసి భుజం వదిలిపె

# ఏరిన ముత్యాలు

★ అపజయాలు వాస్తవాలను వెల్లడిచేస్తాయి. విజయాలు వాటిని దాచి ఉంచు తాయి.

— హొరేస్

★ విప్లవాన్ని నిషేధించబోవడం భేరిని జోకొట్టడంలాంటిదే.

—శ్రీశ్రీ

★ ఏదైనా పనిలో లీనమై వున్నప్పుడు ప్రపంచంలోని ఏ విషయమూ నీలో చొరబడకూడదు. ఇది ఉత్తముడుగా మారటానికి తాళంచెవి లాంటిది. కాని చాలామంది వినోదసమయాలలో కూడా దీనిని పాటించలేరు.

--చార్ల్స్ కింగ్స్లే

★ ప్రతి విప్లవం ఆదిలో ఒకవ్యక్తి బుర్రలో తోచే ఆలోచనగానే ఆరంభం అవుతుంది.

—ఎమర్సన్

★ ఆదరణ లేకుండా విమర్శిస్తే బాణ, మయూర, కాళిదాసులకైనా తప్పు లుంటాయి. ఇక మిగిలినవారిమాట ఏం చెప్పను?

—కొరవి గోపరాజు

★ సమూహంలో సైతం ఏకాంతం ఆనందాన్ని అనుభవించేవాడు గొప్పవాడు.

—ఎమర్సన్

★ వివాహం పురుషుణ్ణి రాక్షసుడిగానూ, స్త్రీని బానిసగానూ చేస్తుంది.

—ఎడ్వర్ట్ కార్పెంటర్

★ జీవితంలో విజయం సాధించడానికి మనిషికి తెలివితేటలు వుండి అవకాశాలు వచ్చినంతమాత్రాన చాలదు. ఏకాగ్రత, లక్ష్యశుద్ధి అవసరం.

--సి.డబ్ల్యు. వెండైట్

★ విరుద్ధాచారాలను సవరించేది సంస్కరణ. అధికారాన్ని మార్చడమే విప్లవం.

— బుల్వార్

★ ఐక్యమత్యం ద్వారా చిన్న చిన్న రాజ్యాలు అభివృద్ధిచెందుతాయి. కాని విభేదాలు జనిస్తే పెద్దపెద్ద దేశాలే సర్వనాశనమైపోతాయి.

--సాలస్ట్

○ సేకరణ: నలబెల్లి శ్రీమన్నారాయణ ○

ట్టాడు. ''నన్నేడిపిస్తున్నదానికంతా వడ్డీతోసహా తీర్చుకుంటాను'' మోటర్‌సైకిల్ స్టార్టు చేసి చెప్పాడు ''ఎక్కు, బస్‌స్టాప్‌లో దింపుతాను''

''మాట్లాడకుండా ఎక్కి కూర్చుంది యమున. బస్‌స్టాప్ త్వరగా రాకపోతే బావుణ్ణనుకుంది. కానీ వచ్చేసింది. దిగాకాకూడా ఇద్దరూ ఒక్కమాట కూడా మాట్లాడుకోలేదు. ఎప్పుడూ ఇంతే. వెళ్ళిపోయేటప్పుడు చాలా దిగులుగా వుంటుంది. యమున బస్ ఎక్కి చెయ్యూపుతుంటే, బస్ అనే రాక్షసుడు తన రాజకుమార్తెని ఎత్తుకుపోతున్నట్లుగా వుంటుంది శేఖర్‌కి.

ఆ రాత్రి యమునకి శేఖర్‌తో పెళ్ళయినట్లూ తామిద్దరూ ఎక్కడెక్కడో సినిమాలోలా చేతిలో చెయ్యేసుకుని తిరిగేస్తున్నట్లూ కలొచ్చింది. మెలకువ రాగానే చాలా కోపమొచ్చింది. ''ఛీ, అలా ఆ కల కంటిన్యూ అయిపోతే ఎంత బావుణ్ను?'' అనుకుంది. శేఖర్ మనసంతా నిండిపోయాడు. తన వైపునించేమీ అడ్డులేదు. చాలా తొందరపడ్తున్నాడు. కానీ తనే ఆపుతోంది. అవును! చూస్తూచూస్తూ పెళ్ళిచేసుకుని ఎలా వెళ్ళిపోతుంది? తమ్ముడీ సంవత్సరమే డిగ్రీలో చేరాడు. టైపూ, షార్టుహ్యాండూ నేర్చుకుంటున్నాడు. మూడేళ్ళల్లో ఎక్కడో అక్కడ ఓ వుద్యోగం దొరక్కపోదు. తండ్రి రిటైరయిపోయాడు. తల్లికెప్పుడూ ఒంట్లో బావుండదు. ఈ పరిస్థితుల్లో తను పెళ్ళి చేసుకుని వెళ్ళిపోతే ఇల్లెలా గడుస్తుంది? టెన్త్ పాసవగానే మెరిట్‌నిబట్టి 'టెలిఫోన్స్'లో వుద్యోగమొచ్చింది. ''చదువాపేస్తావుటే'' అని అందరూ అంటున్నా వినకుండా ఉద్యోగంలో చేరి, ఆపైన ప్రైవేట్‌గా చదువుకుంటూ డిగ్రీ పూర్తి చేసింది. ఆ ఉద్యోగమే ఇప్పుడిల్లు నడవడానికాధారమైంది. నాన్నగారికొచ్చే పెన్షన్, ఆయన స్వంతఖర్చులకీ, అమ్మ మందులకీ కటాకటీ సరిపోతుంది.

''పెళ్ళైతే మీవాళ్ళకి సహాయం చెయ్యొద్దంటానా? నేనంత కర్కోటకుడ్నా?'' అని శేఖర్ చాలాసార్లన్నాడు. కానీ తన మనసుకి తెలుసు పెళ్ళయ్యాకా పుట్టింటికి సహాయం చెయ్యడం జరగనివని. ఒకవేళ చేసినా అది అందరి దృష్టిలో మహాపరాధం. 'పుట్టింటికి దోచిపెడ్తుంది' 'ఆ మొగుడు ఏమీ అనలేడు పాపం' అంటూ చెవులు కొరుక్కుంటుందీలోకం. అక్క కూడా పెళ్ళికి ముందెంతో ఆలోచించింది. బావగారు చాలా మంచివారు 'నా వాళ్ళకీ, నీ వాళ్ళకీ కూడా సహాయం చేద్దాం' అన్నారు. అలా పెళ్ళవగానే ఇలా కూరుకుపోయింది సంసారకూపంలో. ''కావేరి చాలా మంచిది'' అనే పేరు తెచ్చుకోడానికి ఎన్ని కోరికల్నీ, ఎన్ని సుఖాల్నీ త్యాగంచేసిందో ఎవరికి తెలుసు? నాన్నగారు అత్తారింటికి పంపించేటప్పుడు చెప్పారు. ''ఇప్పటినుండీ నీకదే స్వంతిల్లు. వాళ్ళే అయినవాళ్ళు. వాళ్ళ బాగే నీ బాగు. మా గురించి బాధపడకు. నువ్వు మాకు చేసే సహాయమల్లా పుట్టింటికి మంచి పెంపకం అన్న పేరు తీసుకురావడమే'' అని. అవి తూ.చా. తప్పకుండా పాటించింది కావేరి. మంచి పేరు తెచ్చింది పుట్టింటికి. కానీ తన విషయంలో అలా జరగదు. పెళ్ళయ్యాకా తను పుట్టింటికి సహాయం చెయ్యక తప్పదు. శేఖర్ తనని ప్రేమిస్తున్నాడు కాబట్టి ఏమీ అనుకోక పోవచ్చు. కానీ శేఖర్‌వైపు వాళ్ళందరూ తనని ప్రేమించి అర్థంచేసుకోవాలనేముంది? ఈ విధంగా ఆలోచించి తను శేఖర్ని ఆపుతోంది. ఆర్నెల్లుగా అతనితో పరిచయం. రమేషన్నయ్య పెళ్ళిలో చూశాడు తనని. వివరాలు సేకరించి ఓ రోజు డైరెక్టుగా ఆఫీస్ గేటు దగ్గర కాపేసాడు. ''మీరు రమేష్ చెల్లెలు కదా!'' అడిగాడు. తనవునంది.

''నా పేరు శేఖర్ ఇంజనీరింగ్ డిగ్రీవుంది. ఈమధ్యే ఉద్యోగం కూడా వచ్చింది. మిమ్మల్ని ష్టపడ్తున్నాను. పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను. నేనెలాంటి వాడ్నో నా పుట్టుపూర్వోత్తరాలేమిటో రమేష్‌ద్వారా తెలుసుకోండి'' అని భయం, బెరుకూ లేకుండా చెప్పేశాడు.

తను షాకయిపోయింది. ఆ షాక్‌లోంచి తేరుకునేలోపే రమేషన్నయ్యద్వారా సిఫార్సు చేయించుకున్నాడు. ''వాడు నా ప్రాణస్నేహితుడమ్మా, చాలా మంచివాడు. ఒక్కడే కొడుకు. బాధ్యతలేమీ లేవు. ఒప్పుకో! బాబాయ్‌కింతకంటే మంచల్లుడు ఎక్కడ దొరుకుతాడు?'' అన్నాడు.

''అది కాదన్నయ్యా, పరిస్థితులు తెలిసీ...''

''అవన్నీ వాడితో మాట్లాడు వాడొప్పుకుంటే ఆగమనుకొన్నాళ్ళు.'' అంటూ ఓ ఆదివారం వాళ్ళింట్లో మీటింగ్ కూడా ఏర్పాటు చేసేడు.

అందగాడూ, తెలివైనవాడూ, ముఖ్యంగా మంచివాడూ అయిన శేఖర్ అలా తన ప్రమేయమేమీ లేకుండానే తన జీవితంలోకి చొరబడ్డాడు. ఆ బంధం చాలా బలమయినదిగా మారి తనకి వూపిరి ఆడనివ్వటంలేదు. మొదట ఏముందీ మూడేళ్ళు ఎంతలోకి గడుస్తాయి? అనుకున్నా రానురాను ఒకరోజు ఒక యుగంలా గడవసాగింది. మనసులు కలిసిపోయాకా మనుషులు విడివిడిగా వుండడమెంత దుర్భరమో ఒక్క ప్రేమికులకే తెలుస్తుంది! తన ఇల్లూ, బాధ్యతల విషయంలో తలమునకలుగా వుండి కొంతవరకూ దృష్టిమరలుస్తుంటుంది. కానీ శేఖర్ వాళ్ళింట్లో సంబంధాలు చూస్తామంటూ తొందర చెయ్యడంతో తను చెప్పేద్దామంటున్నాడు. ఈ విషయం బయటపడితే అభిమానంగల అమ్మా, నాన్నలూ, తమ్ముడూ చాలా బాధపడ్తారు. అంతేకాక ఇబ్బందో సబ్బందో పడి తన పెళ్ళి చేసేస్తారు. అందుకే శేఖర్‌ని బయటపడొద్దని బతిమాలుకుంటోంది. కానీ ఎన్నాళ్ళు? ఆర్నెల్లు ఆపేటప్పటికే తన తలప్రాణం తోకకొచ్చింది.

''ఈవేళ ఆఫీస్ కెళ్ళవటే?'' అంటూ అమ్మ లేపుతుంటే బద్ధకంగా లేచింది యమున.



''ఏమిటీమధ్య చిక్కిపోతున్నారు? ఒంట్లో బావుండటంలేదా?'' అడిగింది కావేరి.

''లేదు. బాగానే వుంది కానీ పనెక్కువయిపోయింది. నిద్రలేమివల్ల అలసటగా వుంటోంది'' చెప్పింది సింధు.

''పనిమనిషెలా వుంది?''

''చిట్టెమ్మా! బానే వుంది. వంట కూడా బాగానే చేస్తుంది. పిల్లలు బాగా మాలిమి అయిపోయారు. మా అత్తగారెళ్ళిపోతుంటే ప్రతిసారీ పెద్ద గొడవ చేసేవారు. ఈసారి చిట్టెమ్మ పుణ్యమా అని పెద్దగా ఏడవలేదు''

''అదృష్టవంతులు, మా పనిమనిషి వారానికి మూడు అర్ధపూటలు మానేస్తుంది. ఇంక ఆదివారమొస్తే సాధారణంగా ఫుల్ డే లీవ్'' నవ్వుతూ చెప్పింది కావేరి.

''చిట్టెమ్మ వచ్చాకా నాకా బాధ తప్పింది. ఇన్నాళ్ళూ ఎలా గడిపానా? అని నాకే అనుమానమొస్తోంది. అంటే అంతలా ఆధారపడిపోయామన్నమాట!'' తనూ నవ్వేస్తూ చెప్పింది.

''ఇంతకీ మా ఇంటికెప్పుడొస్తారు? మా అత్తగారిప్పటికి చాలా సార్లడిగారు తీసుకురమ్మని''

''మీ అత్తగారికి నా సంగతెలా తెలుసు?''

''నేను బయటికొచ్చాకా జరిగేవన్నీ ఇంటికెళ్ళాకా పూస గుచ్చినట్లు చెబుతానావిడకి''

''మీ ఇద్దరూ అంత చనువుగా మాట్లాడుకుంటారా?'' ఆశ్చర్యంగా అడిగింది సింధు.

''ఒకింట్లో వున్నాకా చనువు రాదా! మాట్లాడుకోమా! అంతలా ఆశ్చర్యపోతున్నారు, మీరు మీ అత్తగారితో చనువుగా వుండరా?''

''ఆవిడదంతగా మాట్లాడే స్వభావం కాదు. నేను కూడా ఆవిడతో అలాగే వుంటాను. అయినా నా దగ్గరుండేది చాలా తక్కువ కదా!''

''నేనివాళ మీ స్టాప్‌లోనే దిగిపోతున్నాను. అమ్మా వాళ్ళింటికెళ్తున్నాను'' చెప్పింది కావేరి.

''అయితే మా ఇంటికి కూడా రావాలి''

''ఇంకోసారి ప్రత్యేకం మీ ఇంటికే వస్తాను అడ్రెస్ ఇవ్వండి. ఇవాళ మాత్రం వదిలెయ్యండి ప్లీజ్''

సింధు సరేనని కాయితంమీద ఎడ్రెస్ రాసిచ్చింది. మరోసారి తప్పకుండా రావాలని మరీమరీ చెప్పింది.

"నేనొస్తాను, వచ్చి మిమ్మల్ని మా ఇంటికి తీసుకెళ్తాను కూడా!" చెప్పింది కావేరి.

"తప్పకుండా వస్తాను. నాకూ మీ ఇంటినీ ముఖ్యంగా మీ అత్తగార్నీ చూడాలనుంది" అంది సింధు.

బస్ దిగి ఎవరిదార్న వాళ్ళెళ్ళిపోయారు.

కావేరిని చూడగానే చాటంతయింది కాత్యాయిని మొహం "ఎంత చిక్కిపోయావే! వంట్లో బావుంటోందా? పిల్లలెలా వున్నారు?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించింది. అన్నింటికీ ఓపిగ్గా సమాధానమిచ్చి "యమునేదీ?" అనడిగింది.

"ఇంకా రాలేదమ్మా, ఈపాటికొస్తూనే వుండాలి" చెప్పారు రామారావుగారు.

"దాన్ని చూడాలనే వచ్చానమ్మా. ఈమధ్య కల్లోకొచ్చింది రెండుమూడుసార్లు" అంటూ బ్యాగ్‌లోంచి పొట్లంతీసి "దానికిష్టమని ఆకుపకోడీ తెచ్చాను" అంది.

ఇంతలో శరత్ వచ్చాడు. "హాయ్! అక్కా ఒక్కదానివే ఇలా వచ్చావేమిటి? ఏమన్నా ముఖ్యమైన పనా?" అడిగాడు చనువుగా వచ్చి పక్కనే కూర్చుని.

"మీ అందర్నీ చూడాలనిపించి వచ్చానురా. నీ సంగతేమిటి? టైపూ, షార్టుహ్యాండ్ ఎంతవరకొచ్చింది?"

"పీకదాకా వచ్చింది. ఇంక పరీక్షలే మిగిలాయి" నవ్వుతూ చెప్పాడు.

ఈలోగా ప్లేట్లో పకోడీలూ, పల్లీ పాకం సర్ది పట్టుకొచ్చింది కాత్యాయిని. తల్లీ తండ్రీతో ఆ కబురూ, ఈ కబురూ చెప్తూ ఓ గంట కూర్చుంది కావేరి. మధ్యమధ్య గడియారంకేసి చూడసాగింది "రోజూ ఇలాగే ఆలశ్యమవుతుందా దీనికి. లేక ఇవాళేనా?" అడిగింది తల్లిని.

"దాదాపుగా అవుతుంది. బస్సులవీ దొరకవుట. ఏమిటో ఆడపిల్లలు కష్టపడ్తుంటే కూర్చుని తింటున్నాము" బాధగా అన్నారు రామారావుగారు.

"అమ్మా నీ ఒంట్లో ఎలా వుంది? ఆయాసం రావడం లేదు కదా! చలికాలం... ఎక్కువగా నీళ్ళల్లో తిరక్కు" అంటూ జాగ్రత్తలు చెప్పింది.

"నీళ్ళల్లో తిరక్కుండా నాకు పనెలాగవుతుందే" నవ్వింది కాత్యాయని.

"అక్కా, టైపుకి టైమయింది. వెళ్ళొస్తా" తయారయి బయటకొచ్చి చెప్పాడు శరత్.

"ఆగరా, నన్నూ బస్‌స్టాప్‌లో దింపేద్దువుగాని, చీకటిపడిపోయింది" లేస్తూ చెప్పింది.

"యమునని చూడకుండానే వెళ్ళిపోతావుటే" అడిగింది తల్లి.

"దాన్నే ఆదివారం రమ్మనమ్మా, పిల్లలు కూడా పిన్ని రావట్లేదంటున్నారు"

"ఆగయితే కాఫీ తీసుకొస్తాను. అదొచ్చాక ఇద్దరికీ ఇద్దామని వూరుకున్నాను" అంటూ "ఒద్దమ్మా" అంటున్నా వినిపించుకోకుండా వంటింట్లోకి నడిచిందావిడ.

కాఫీ తాగి యమునని ఆదివారం పంపించమని మళ్ళీ చెప్పి శరత్‌తో కలిసి బయల్దేరింది కావేరి. బస్‌స్టాప్ కొస్తూ కూడా యమున ఎదురుపడ్తుందేమోనని చూస్తూనే వుంది. కానీ యమున జాడలేదు.

★ ★ ★

"ఏయ్ ఇవాళ శనివారం కదా, నైట్ షో కెళ్దాం. త్వరగా పనులన్నీ పూర్తిచేసుకో" బస్‌స్టాప్‌లో దింపేటప్పుడు చెప్పాడు సుధాకర్.

"రేపైతే మ్యాటనీకి అత్తయ్యగారినీ, పిల్లలనీ కూడా తీసుకెళ్ళచ్చు గదండీ!"

"నాకు తెలుసు! తోకలాగా ఏదో ఒకటి అంటావనీ" కోపమభినయించాడు.

"సరే... సరే!" నవ్వింది కావేరి. ఇంతలో బస్ రావడంతో ఎక్కేసింది. ఏ సినిమాకెళ్తే బావుంటుంది? ఆలోచిస్తూ బస్‌లోంచి ప్రతి బోర్డునీ చూడసాగింది. 'గజదొంగ', 'ఖూనీ', 'కిలాడీ', 'దగాకోరు', 'కర్కోటకుడు' అన్నీ ఇలాంటి పేర్లే కనిపించాయి. వాటిల్లో హీరో ఎన్ని చెడ్డ పనులు చేసినా చివరికి గొప్పవాడని అందరూ మెచ్చుకోవడం, వీలైతే ప్రభుత్వం కూడా సత్కరించడం చూపిస్తారు. ఏమీ తెలియని బుల్లి మెదళ్ళలో ఇవన్నీ దూరి వాళ్ళని నానా గజిబిజి చేస్తాయి. అమ్మాయిల్ని ఏడిపించడం, సరదాగా దొంగతనాలు చెయ్యడం, తాగి తందనాలాడ్తూ పాటలు పాడడం, నభ్యత

లేని పదాలు మాట్లాడటం ఇవన్నీ హీరోయిజం అని చూపించే చిత్రాలు. వాళ్ళని అనుకరిస్తూ పిల్లలు 'రప్ఫాడించేస్తాను', 'ఒడువు చూసి పొడుస్తా', 'రేగిపోతే అణగ్గొట్టేస్తా' అంటూ చిన్నా పెద్దా లేకుండా వాడేస్తున్నారు. "త ప్పురా!" అంటే "మరి హీరో అంటే అందరూ చప్పట్లు కొడ్తూ చూస్తారు కదా!" అని ఎదురు ప్రశ్న వేస్తారు. ఎప్పుడైనా ఆదివారం టి.వి.లో సినిమా అత్తగారూ, భర్తా, పిల్లలూతో కలిసి చూడాలంటేనే ఇబ్బందిగా వుంటుంది కావేరి కి. పెళ్ళి సీనవగానే "ఇప్పుడు పాలగ్లాసుతో ఆ అమ్మాయి గదిలోకెళ్ళలేదేమిటి?" అని అడిగే స్తారు పిల్లలు. ఇక రేప్ సీను విషయానికొస్తే అదేమిటో అర్థంకాక వాళ్ళు చాలా కకావికలైపో తుంటారు. ఇప్పుడా అమ్మాయిని అబ్బాయి కొడ్తాడా? చంపేస్తాడా? ఏం చేస్తాడు? పాడయి పోవటం అంటే ఏమిటి? లాంటి ప్రశ్నలు మధు ఎన్నిసార్లో వేశాడు. తనేదో నర్ది చెప్తుంది. ఇంక ఎడ్వర్‌టైజ్‌మెంట్లు సరేసరి! స్త్రీలకు మాత్రమే పనికొచ్చేవి. గుప్తమైనవీ అయిన విషయాలని విపులంగా విప్పి చెప్తూ చూపిస్తా రు. భర్తతో కలిసి చూడడానికే లజ్జాకరమైన విషయాలను అన్నదమ్ములతో, తండ్రితో, మావగారూ, బావగారూ లాంటి బంధువులతో, చివరకి ఇంటికొచ్చిన ఏ భర్త స్నేహితుడితో కూడా కలిసి చూడాల్సొస్తోంది. ఇంక విదేశా లలో చాలా లో స్టాండర్డ్‌గా తీసిన చెత్త చిత్రాలు కూడా ఈ మధ్యనొచ్చిన 'నక్షత్రం'లో చలామణీ అయిపోతున్నాయి. ప్రతివారికీ ఓ గదీ, గదికొక టీవీ పెట్టుకునే స్తోమత లేని మధ్యతరగతీ, క్రింది తరగతీ కుటుంబాలలో వీటిల్లో వచ్చే కార్యక్రమాలు కొన్ని బాధాకరమనే చెప్పుకోవ చ్చు.

నవ్వొచ్చింది కావేరికి. తనిలా మాట్లాడితే 'పాత చింతకాయపచ్చడి' అని వెక్కిరిస్తాడు సుధాకర్. తనకు మాత్రం ఆ పాత చింతకాయ పచ్చడే బాగుంటాయి. చిన్నప్పుడు శలవులకి పెద్దనాన్నగారి పిల్లలూ, అత్తయ్య పిల్లలూ వాళ్ళూ వచ్చినప్పుడు నాన్నగారు సినిమాలకి తీసి కెళ్ళేవారు. అప్పుడు చూసిన "చక్రపా ణి", "మాయాబజార్", "పెళ్ళి చేసి చూడు" లాంటి సినిమాలు ఎన్నిసార్లు చూసినా, ఎవ రితో చూసినా బావుంటాయి. అందరూ కలిసి మళ్ళీ మళ్ళీ ఆ డైలాగ్స్ చెప్పుకుని కడుపుబ్బ నవ్వుకునేవారు. ఇప్పటి సినిమాలు అప్పటిక ప్పుడు నవ్వించినా, ఎవరితో పంచుకోలేనివి. మరోసారి అనుకుంటే మనకే సిగ్గేసేవి.

ఇంటికొచ్చేటప్పటికి పిల్లలు బయట ఆడ్తూ కనిపించారు. "స్కూల్ డ్రెస్ కూడా మార్చుకో లేదేమిటి? లోపలికి పదండి" అంటూ లోపలికి తీసుకొచ్చింది.

"బాబిగాడు నా నోట్సు చింపేసాడు" ఏడు స్తూ చెప్పాడు మధు. బాబిగాడు ఆడబడుచు కొడుకు. వాడికి తొందరతనం ఎక్కువ. ఎప్పు డూ ఒక్కక్షణం ఒక్కచోట కుదురుగా వుండ డు. ఏ వస్తువైనా కొత్తగా కనిపిస్తే పాడుచేసేదా కా నిద్రపట్టదు వాడికి.

"నువ్వెందుకు జాగ్రత్తగా పెట్టుకోలేదు?" కొడుకునే కోప్పడింది.

లోపలికడుగుపెట్టగానే పెద్ద కత్తెరొకటి తీసు కొని టేబుల్ క్లాత్ కత్తిరిస్తూ కనపడింది అపర్ణ, అది ఆడబడుచు కూతురు. దాన్ని కోప్పడి కత్తెర లాక్కుని దాచి "బామ్మ ఏదర్రా?" అడిగింది.

"తల నొప్పిగా వుందని పడుకుంది" చె ప్పింది అపర్ణ.

కాళ్ళు కడుక్కుని గదిలోకెళ్ళి "అత్తయ్యా తలనొప్పా?" అడిగింది.

"వూ" అని భారంగా మూలిగి కళ్ళు మూ సుకుని పడుకుంది వర్ధనమ్మ. నుదుటిమీద చెయ్యేసి చూస్తే ఒళ్ళు కాలిపోతూంది. వంటింట్లోకెళ్ళి కాఫీ కలిపి, పిల్లలకి పాలు కలిపి అందరికీ ఇచ్చి, అత్తగారికి కాఫీ తీసుకె ళ్ళి ఇచ్చింది.

"వద్దమ్మా" అని మూలిగిందావిడ. "ప్రభ స్కూల్‌నించి ఇంకా రాలేదా? తను రాగానే పిల్లల్ని అప్పచెప్పి డాక్టర్ దగ్గరకెళ్దాం" అంది.

"అది స్కూల్‌నించొచ్చి పక్కింటావిడతో ఎక్కడో చీరలు సగం ధరకే ఇస్తున్నారని వెళ్ళిందమ్మా?" నీరసంగా చెప్పిందావిడ.

"మరి మీకప్పుడు నలతగా లేదా?" అను మానంగా అడిగింది.

"వుంది, అప్పటికీ రేపెళ్ళకూడదుటే? అన్నాను. వింటేనా!" బాధపడిందావిడ.

గబగబా వంట పూర్తిచేసి సుధాకర్ కోసం ఎదురుచూస్తూ కూర్చుంది కావేరి. కాస్త ఆలశ్యంగానే వచ్చాడు. హుషారుగా అడిగాడు. "వనంతా అయిపోయిందా? రెడీనా!" అని.

"ముందు అత్తయ్యగార్ని డాక్టర్ దగ్గరకి తీసుకెళ్ళండి" చెప్పింది.

"ఏమయిందమ్మకూ" అంటూ ఖంగారుగా లోపలికెళ్ళాడు. మూలుగుతూ కనిపించింది వర్ధనమ్మ. "ఇంతసేపు ఏం చేసావు? రాగానే డాక్టరు దగ్గరకి తీసుకెళ్ళద్దూ" కోప్పడ్డాడు కావేరిని.

'పిల్లల్నెక్కడ పెట్టి వెళ్ళను? మీ చెల్లెలి పిల్లలనలే తుందురు' అని అనలేదు కావేరి. మౌనంగా బాబీ, అపర్ణా, మధూ, పూజాలకి అన్నం కలిపి పెట్టడంలో నిమగ్నమయింది. తల్లిని డాక్టరుకి చూపించి మందులు కొని ఇంటికొచ్చేటప్పటికి ఎనిమిదిన్నరయింది. ప్రభా ఆమె భర్త ఫల్గుణరావు కూడా వచ్చారు. అందరికీ కంచాలు పెట్టింది కావేరి.

"వద్దండీ వెళ్ళిపోతాము" మొహమాటపడ్డాడు ఫల్గుణరావు.

"ఇంట్లో నేనేం చెయ్యలేదీపూట, ఇక్కడ మీరు మొహమాటపడ్తే పస్తే" చెప్పేసింది ప్రభ.

"ఫరవాలేదు... వంట చేసేసానుగా" చెప్పింది కావేరి. అత్తగారికి బ్రెడ్ కాల్చి, పాలతో పెట్టింది. ఆవిడేముక్క కొరికి ఇక సహించక అలాగే పడుకుంది. "నేనీపూట అత్తయ్యగారి పక్కనే వేసుకుంటాను పక్క. లేవలేకపోతే పిలవడానికావిడ మొహమాటపడ్తారు. చెప్పింది. పిల్లల్ని టి.వీ. పెట్టనివ్వలేదు రొదగా వుంటుందని.

మర్నాడు ఆదివారం. ఆదివారమనగానే కావేరికి కడుపులో పెద్ద బెంగ. ఆరోజు తన చీరలన్నీ వుతికి, గంజిపెట్టడమనే డ్యూటీ వుంటుంది. ఇంక మిగతా రోజుల్లో ఎలాగూ కుదరదని ఇల్లు సర్దడం సరేసరి! పులుసు పొడీ, కూరపొడీ, చారుపొడీ, కందిపొడీ అని అవీ ఇవీ చేసి పెట్టుకుంటేనేగానీ మిగతా రోజుల్లో ఇబ్బంది లేకుండా వుండదు. ఇక ఆదివారమని ఎవరో ఒకరు. ఆయన స్నేహితులో, అత్తగారివైపు బంధువులో లేక తనవైపువారో చూడ్డానికొస్తారు. "ఉట్టిరోజుల్లో మీరు దొరకరనీ ఇవేళ వచ్చాము అంటారు కొందరు" ఏదో ఉద్ధరించేసినట్టు. వాళ్ళవైపునించి వాళ్ళొక్కరోజే వచ్చారు కాబట్టి ఏమీ అనిపించదు. కానీ ఒక్కోళ్ళు ప్రతి ఆదివారం చొప్పున వస్తుంటే ఉద్యోగస్తులైన భార్యాభర్తలకి ఎంత ఇబ్బందో ఆలోచించరు! మగవాళ్ళు ఎలాగో అలా తప్పించుకుని బయటపడ్తారు. కానీ ఆడవాళ్ళకి వంటింటి ఖైదు తప్పదు. సుధాకర్ ఆదివారమొస్తుందీ అంటే రకరకాల ప్లాన్లేస్తాడు. "మధుకి చెస్ నేర్పిస్తానీ ఆదివారం" అనో లేక "పిల్లల్ని ప్లానిటోరియం తీసుకెళ్తాను" అనో "వీడు మేత్స్‌లో వీక్, వీడితో ఓ రెండు గంటలు కూర్చుని వీడికి లెఖ్ఖలంటే ఇంట్రెస్ట్ పుట్టిస్తాను" అనో చెప్తుంటాడు. కానీ అలా అనుకున్నదనుకున్నట్టు జరిగితే మధ్యతరగతి కుటుంబాలన్నీ బాగుపడిపోవూ? కావేరి "అత్తయ్యా రేపాదివారం పిల్లలకి కాస్త కారప్పూస దూస్తాను. నాల్గురోజులు తింటారు" అంటే వర్ధనమ్మగారు సాయంత్రం వచ్చేటప్పటికి చేసి తయ్యారుగా వుంచుతారు. "ఎందుకత్తయ్యా?" అంటే "ఆదివారం అనేది అలసట తీర్చుకోడానికి గానీ అవిధిపడడానికి కాదే" అంటారు. "మా కోడలు రోజంతా నిలబడి పనిచేస్తుందా మందుల కంపెనీలో. మళ్ళీ ఇంటికొచ్చాక ఒక్కమాట వినుక్కోదు" అంటూ అందరితో చెప్పుకుంటుంది గర్వంగా ఆవిడ.

ఉదయం పిల్లలకి తలంటుపోసి, తను పోసుకుని దేముడికి దీపం పెట్టుకువచ్చేటప్పటికి పదయిపోయింది కావేరికి. వర్ధనమ్మగారికి జ్వరం కాస్త తగ్గింది కానీ నీరసంగా వుంది. ప్రొద్దుటే ఇడ్లీ వేసి అత్తగారికి బలవంతాన రెండు తినిపించి మందేసింది.

వంట చేస్తుండగా ప్రభ వచ్చింది. "వదినా గోంగూర తెచ్చాను నీకిష్టమని, పచ్చడి చేసి నాక్కాస్త పంపించు" అంటూ గోంగూర అక్కడ పెట్టి "టిఫినేం చేసావు' నేనేం చెయ్యలేదు" అంది. మళ్ళీ నాలుగు ప్లేట్లు ఇడ్లీ వేసింది కావేరి.

ఇంతలో "పిన్నొచ్చింది. పిన్నొచ్చింది"

అంటూ కేరింతాలు కొడ్తూ వచ్చారు పిల్లలు. యమునని చూడగానే కావేరికి కూడా చాలా సంతోషమేసింది. "సారీ! అక్కా నువ్వొచ్చినప్పుడు నేను లేను... అంటుంటే "ఫరవాలేదులే, రా కూర్చో" అంటూ ఆప్యాయత తొణికిసలాడ్తుండగా ఆహ్వానించింది.

"పిన్నీ ఏం తెచ్చావు?" అంటూ పూజ అడుగుతుంటే, "తప్పు అలా అడొగొచ్చా?" అని కోప్పడితే, "అయినవాళ్ళు దగ్గరేమిటే బాబూ ఈ ఆంక్షలు?" అంటూ అడ్డుపడింది యమున. పిల్లలకి క్యాడ్‌బరీస్‌లూ, బిస్కట్లూ, ఇచ్చి పంపించి, అక్కగారి చేతికో సంచీయిచ్చి "అమ్మ చేగోడీలూ, బిళ్ళకాజాలూ పంపింది" అంది.

"మీ అమ్మగారే నయం! ఏదో ఒకటి పంపుతుంటారు" అంది ప్రభ వెంటనే. కావేరి నగం చేసి డబ్బాలో పోసి "పిల్లలకి పెట్టు" అని ప్రభకందించింది.

"మరదలు మాణిక్యమొచ్చినట్టుంది" అంటూ బయట్నించి కూరల సంచీతో వచ్చాడు సుధాకర్.

"మరే! బావగారు మరీ బంగారప్పూసైపోయారు" అంటూ నవ్వింది యమున.

"చూశావా! అందర్నీ నల్లపూసైపోయావు అంటారు. కానీ నన్ను చూస్తే ఆ మాట ఎవరికీ అనబుద్ధికాదు" అన్నాడు గర్వంగా.

సుధాకర్ కావేరి కంటే రంగు. అందుకే ఎప్పుడూ ఏడిపిస్తుంటాడు. "నల్లపూసైపోయారు అంటే మళ్ళీ మీ రంగు గురించి ఉపన్యానం వినాల్సొస్తుందని అలా అన్నాను. అయినా తప్పలేదు నాకు" అంది యమున.

వర్ధనమ్మగారికి జ్వరమని తెలిసి ఆవిడ గదిలోకెళ్ళి పలకరించివచ్చింది. కావేరితో కబుర్లు చెప్తూ గోంగూరొల్చి పెట్టింది. ఆ తర్వాత అక్కగారికి వంటలోనూ, బట్టలుతుకడంలోనూ ఆ తర్వాత ఇల్లు సర్దడంలోనూ సహాయం చేసింది. ప్రభ పచ్చడి తీసుకుని "మార్నింగ్‌షో కెళ్ళాలి" అంటూ వెళ్ళిపోయింది.

భోజనాలయ్యాక "వెళ్ళొస్తానక్కా కాసేపు నిద్రపోకపోతే హాలిడే వేస్ట్ అయిపోయిందనిపిస్తుంది" అంది. "అప్పుడే వెళ్ళిపోతావా? సాయంత్రం బావగారు దింపుతార్లే" అంది కావేరి.

"నిన్నైతే ఒక్కపూట కూడా పంపరుగానీ గొప్ప బావగారే" అంది కినుకగా యమున.

"నే వెళ్ళమనే అంటానోయ్, మీ అక్కే రాదు. అయినా నీ కిప్పుడే తెలీదులే! రేపు పెళ్ళయ్యాకా 'మా ఆయన ఒక్కపూట కూడా పంపరక్కా, నే లేకపోతే ఆయనుండలేరు' అంటూ కబుర్లు చెప్తావు" అన్నాడు.

"ముందు నువ్వో పెళ్ళి కొడుకుని చూడ్రా! తరువాత చూద్దాం ఎన్ని కబుర్లు చెప్తుందో" అన్నారు వర్ధనమ్మగారు.

"అమ్మో ఈ నల్లబంగారంకి సంబంధాలు చూడ్డమంటే మాటలా! ఎన్ని చెప్పుల జతలు అరగిపోవాలో" అంటూ వుడికించాడు మరదల్ని.

"మా చెల్లెలికేమయిందీ కుందనపుబొమ్మ" అంటూ వెనకేసుకొచ్చింది కావేరి.

"చిన్న నవరణ, కుందనపు కాదు చందనపు" అంటూ పక్కనే పూజ ఆడుకునే సామాన్లలోంచి నల్లచందనపు బొమ్మని తీసి చూపించాడు.

"అక్కా చూడూ" అంది రోషంగా యమున.

"అవును మరదలా! ఈ మధ్య ట్యాంక్ బండ్‌మీద ఎందుకు కూర్చుంటున్నావు? అటునించి వచ్చేటప్పుడల్లా అడుగుదామనుకుని మళ్ళీ ఎవరికోసమో ఏమోలే అని వచ్చేస్తున్నాను" అన్నాడు.

బావగారి ప్రశ్నకి గుండె గుభేలుమంది యమునకి. మొహం వివర్ణమయిపోయింది. "ఒళ్ళో ఏదో పుస్తకం పెట్టుకుని ఘంటంతో రాస్తున్నావు కూడా" అన్నాడు నవ్వుతూ.

"పోదురూ బడాయి! మీ బావగారు చెప్తున్నదీ నల్లరాయి మొల్లవిగ్రహం గురించే" అంది కావేరి కూడా నవ్వుతూ. బావగారంటున్నది అర్థమయ్యాక "అమ్మయ్యా!" అనుకుని గుండె కుదుట పరుచుకుని తనూ నవ్వేసింది యమున.

"ఆ విగ్రహమంత అందంగా వుంటే అంత కన్నా కావాల్సిందేముంది బావగారూ" అంటూ

ఇంకో అరగంట కూర్చుని ఇంటికి బయల్దేరింది యమున.



గులాబీరంగులో వుండే పెదవులకి ఎర్రని లిప్‌స్టిక్ వేసింది సింధు. జుట్టంతా పైకి దువ్వి ఫ్రెంచ్ స్టైల్‌లో ముడిపెట్టింది. పచ్చని ఆమె శరీరచ్ఛాయకి ఆమె వేసుకున్న ఎర్రటి జాకెట్టూ, ఎర్రంచు తెల్లపట్టుచీర మరింత అందాన్నిస్తోంది.

"అమ్మా! ఈ ఎర్రగులాబీ పక్కకి పెట్టుకోండి" అంటూ తెచ్చిచ్చింది చిట్టెమ్మ.

"ఓ, థాంక్యూ" అంటూ అందుకుంది సింధు.

"కనకాంబరాలు సిగ చుట్టూ పెట్టుకో!" చెప్పాడు అరుణ్.

"నో! మోటుగా వుంటుంది. ఈ ఒక్క గులాబీ పెట్టుకుంటాను" అంది. అరుణ్ లేచి బైటికొచ్చాడు. దూరంగా ఒక పెంకుటిల్లుందా సందులో ఆ ఇంటిముందో అమ్మాయి సందె గొబ్బెమ్మలు పెడ్తోంది. ప్రతిరోజు ఆఫీస్‌నుండొచ్చేటప్పుడు చూస్తాడా అమ్మాయిని. పొడుగాటి జడ వీపు మీంచి ముందుకు పడ్తుండగా లంగా ఓణీలో ముందుకు వంగి ముగ్గు పెడ్తుంటుంది. ఆ జడలో అప్పుడే విచ్చుకుంటున్న చమేలీ పువ్వులు కిలకిలా నవ్వుతుంటాయి. ఆ అమ్మాయి మొహమెలా వుంటుందో తనకి తెలియదు. కానీ ఆ అమ్మాయిని చూడగానే "కృష్ణశాస్త్రి ఊర్వశి," "విశ్వనాథవారి కిన్నెరసాని", "బాపు సీత", "నండూరివారి ఎంకి" గుర్తుకొస్తారు. మనసంతా ఆహ్లాదంగా మారిపోతుంది.

అసలు పెళ్ళి చూపుల్లో సింధూరని చూడగానే తన హృదయం లయతప్పి వేగంగా కొట్టుకోడానికి కారణం ఆమె ముక్కున 'తళుక్కుమని' మెరసిన ఒంటిరాయి ముక్కుపుడక, ఆర్గండీ చీరలో తలలో మల్లెపూలతో అరవిచ్చిన మొగ్గలా వుంది. అక్కా, అమ్మా, బావగారూ ఆమె ఉద్యోగం, చదువూ, తెలివితేటలూ, తండ్రి హోదా మెచ్చుకున్నారు. కానీ తను మాత్రం ఆమెనే ఇష్టపడ్డాడు. ఆమె అందం, ఆమె కంఠం, ఆమె నడక, ఆమె నవ్వు అన్నీ ఇష్టపడ్డాడు. అభిరుచులు కూడా కలిస్తే తమ దాంపత్యమంత మధురమైనది మరొకటుండదనుకున్నాడు. తాంబూలాలు పుచ్చుకున్నాక ఇద్దరూ కలిసి సినిమాకెళ్ళారు. తను "దో ఆంఖే బారా హాత్" కెళ్దాం అన్నాడు. సింధు "స్టార్ వార్స్"కెళ్దాం అంది. ఆమె ఇష్టానికే ప్రాముఖ్యతనిచ్చాడు.

"గోపీ హోటల్లో ఇడ్లీ కారప్పొడి ఫేమస్" అన్నాడు. "షాన్‌బాగ్‌లో పావుబాజీ" తిందామంది, సరేనన్నాడు.

రవీంద్రభారతిలో "రక్తకన్నీరు" నాటకం చూద్దామన్నాడు. "నయం! చింతామణి నాటకానికెళ్దామన్నావు కాదు" అంటూ నవ్వింది.

అందులో నవ్వడానికేముందో తనకి అర్థంకాలేదు. కానీ ఆ నవ్వులో వెన్నెలంత సుఖముందని మాత్రం తెలుసుకున్నాడు. ఆ నవ్వు జీవితాంతం తన స్వంతం అని మురిసిపోయాడు. "తుషార శీతల సరోవరానా... అంటూ పాడితే ఇంక భోజనం లేకపోయినా ఆ పాట వింటూ బ్రతికేయొచ్చు అనుకున్నాడు.

పెళ్ళయ్యాక 'భీమ్లీ' వెళ్దామన్నాడు. "చలం హంపీ కన్యలు" గుర్తుకు తెచ్చుకుని, లేదు గోవా వెళ్దాం అంది.

పెళ్ళయిన తర్వాత మొదటిసారడిగాడు, 'సాగర సంగమం' సినిమా కెళ్దామని. "ప్లీజ్ అరుణ్ సినిమాకెళ్దామని మాత్రం అడక్కు! మూడు గంటలు కుర్చీ కతుక్కుపోయి కూర్చుని టైమ్ వేస్ట్ చేసుకోడం నాకో పెద్ద పనిష్మెంట్‌లా వుంటుంది" అని తప్పించుకుంది. తను మళ్ళీ సినిమాకెళ్దామని ఎప్పుడూ ప్రపోజ్ చెయ్యలేదు. పెళ్ళికాకముందు ఒక్క

డూ పెళ్ళినాటి ప్రమాణాలూ, మరో చరిత్ర, అభిమాన్, దేవదాసులాంటి మంచి సినిమాలు చూసినప్పుడూ, 'అదరక్ కే పంజే'లాంటి నాటకాలు చూసినప్పుడూ పెళ్ళయ్యాక భార్యకివన్నీ చూపించాలి. ఆమెతో కలిసి ఈ ఆనందాన్ని పంచుకోవాలి అనుకునేవాడు. 'బారిష్టరు పార్వతీశాన్నీ', 'గణపతినీ', 'కంఠాభరణాన్నీ', 'జ్ఞానదనీ' భార్యతో కలిసి చదివి చర్చించాలి అనుకునేవాడు. వెన్నెల డాబా మీద కురుస్తుండగా అర్ధాంగి ఒళ్ళో తల పెట్టుకుని పడుకుని, "కొండగాలి తిరిగిందీ... గుండె ఊసులాడిందీ" అని పాడ్తూ మైమరచిపోవాలని కలలు కన్నాడు. ఆమె పుట్టింటికెళ్తే "తలగడతో చెప్పుకునే కబురులే మిగిలినవీ" అంటూ జాబులు రాయాలనుకున్నాడు.

"నాకు డాక్టరేట్ రావాలంటే మీ సహకారం కావాలి! అందిస్తారు కదూ!" అంటూ తియ్యగా తన చుట్టూ గిరి గీసుకుంది సింధు. విశ్వనాథ వారి 'వేయిపడగలు' చూసి మొదటి పేజీ చదివి "తల తిరిగిపోతోంది బాబోయ్ నీకెంత ఓపిక" అంటూ పెట్టేసింది. "కృష్ణ పాండవీయం" సినిమా కేసెట్లో చూసి "శకునెవరు? ఇంతమంది కొడుకులుంటారా ఎక్కడైనా? ఒక్క మెతుకుతో బతకడం, నూరుగుర్ని కనడం అంతా ట్రాష్, ఇలాంటి పుక్కిటి పురాణాలు అంతలా ఎలా ఎంజాయ్ చేస్తారు?" అంటూ నవ్వింది. తన జీవితంలో చాలా చిన్నకోరిక బహుశా! ఇప్పటి తన పరిస్థితులకు తలకు మించిన కోరికొకటుంది. అది తిరుపతి మెట్లు ఎక్కడం. ఏ మొక్కజొన్న పొత్తులో వొలుచుకుని తింటూ మధ్యమధ్యలో సేదతీర్తూ, "తిరుపతి వెంకటేశ్వరా దొరా నీకూ నిలుబడి మొక్కుతామయా"అనే పాటలు వింటూ, చేయీ చేయీ కలుపుకుని ప్రయాణించి స్వామి సన్నిధి చేరుకోవడం, ఓహ్! ఎంత తియ్యని అనుభూతి.

దేవుడంటేనే సింధుకంతంతమాత్రం. ఇంక నడిచి కొండెక్కుతుందా?

సాయంత్రంపూట అన్నంలోకి అప్పడాల పిండీ, వూరుపిండితో చేసిన పచ్చివడియాలూ, పెసరట్టూలాంటివి నంచుకుని తినడం తనకెంతో ఇష్టం. "కడుపునెప్పొస్తుంది, ఇదేం తిండి?" అంటూ కొట్టిపారేస్తుంది సింధు. కానీ తనకిష్టంలేకపోయినా మసాలా కూరలూ, సలాడ్లూ చేసి తినిపిస్తుంది. పొద్దుటే "సుప్రభాతం" వింటూ లేస్తే ఎంతబావుంటుంది? రాత్రిపూట 'భగవద్గీత' వింటూ పడుకుంటే ఎంత ఆనందంగా వుంటుందీ? ఇవన్నీ సింధుకి వినుగు.

"ఏమండోయ్, నేను రెడీ, మీరేమిటలా లాల్చీ, పైజామాలో 'వికటకవిలా'" అంది నవ్వుతూ.

"నాకిలాగే ఇష్టం" చెప్పాడు అరుణ్.

"సూట్ వేసుకుంటారనుకున్నాను" అంది.

"సూట్‌లో మీరంటే ఇష్టం. ప్లీజ్ వేసుకోండి" అంటే వేసేసుకుందామనుకున్నాడు కానీ ఆమె ఇంక మళ్ళీ అడగలేదు. సింధువాళ్ళ కజిన్ పెళ్ళికెళ్తున్నారు. రాత్రి ముహూర్తం, పిల్లల్ని చిట్టెమ్మ దగ్గరొదిలేశారు. సింధుకిద్దరన్నయ్యలు, ఇద్దరూ ఫారెన్‌లో సెటిలయ్యారు. సింధుకి కూడా 'స్టేట్స్'లో సెటిలవ్వాలని ఇష్టమే. "అక్కడయితే ఇలా కరెంట్‌కీ, పాలకీ, పేపర్‌కీ, గ్యాస్‌కీ ఇబ్బందిపడి తన్నుకులాడక్కరలేదు. నాలా వర్క్ చేసేవాళ్ళకి బోలెడంత సుఖం. బయటికెళ్తే ఇంటి గురించీ, ఇంటి కొస్తే బయట పని గురించీ మరిచిపోయి హాయిగా వుండొచ్చు. ఎంత పని చేసుకున్నా కష్టమనిపించదుట. ఎంతో సౌకర్యంగా వుంటుందిట. ఇలా దోమలూ, మురికీ, గతుకుల రోడ్లూ, పవర్ కట్లూ వుండవుట" అని స్వర్గం గురించి పురాణాల్లో వివరించినట్లు వివరించి చెప్తుంది.

"ఛీ, మళ్ళీ జన్మంటూ వుంటే ఈ పాడు కంట్రీలో పుట్టకూడదు! నా పిల్లల్ని ఇక్కడ సెటిలవనివ్వను" అన్నప్పుడల్లా "వివేకానంద" ఉపన్యాసాలు చదివి వినిపిద్దామనిపిస్తుంది. కానీ తను మౌనంగానే వింటాడు. రమ్య పుట్టినప్పుడు తను ఆడపిల్ల పుట్టిందని చాలా సంతోషించాడు. 'మరుద్వతి' అనే పేరంటే తనకి చాలా ఇష్టం. "అబ్బా! సింపుల్‌గా రెండక్షరాల పేరు పెడ్దాం అరుణ్!" అంది. తను కాదనలేకపోయాడు. 'తేజ' పుట్టినప్పుడు అమ్మ నాన్నగారి పేరు కలిసొచ్చేటట్లు పెడ్దాం

అన్నాడు.ఆయన పేరు విశ్వనాథం. తను విశ్వ నాథ్ తేజస్వి అని పెట్టాడు. సింధు స్కూల్లో 'తేజ' అని రాయించింది. సహజంగా తల్లి పిల్చే పేరే చలామణీ అవుతుంది. అమ్మకీ విషయంలో బాధ కలిగింది. మొదట్నుండీ ఆవిడ అసంతృప్తిగానే వుంది సింధు విష యంలో. మొదటిసారి శ్రావణమాసంలో నోము లు నోపిస్తానంటే, మిన్ను విరిగి మీద పడినట్టు చూసింది సింధు "నాకెక్కడ టైముంది? ఈ నోములూ, వ్రతాలూ, వాయినాలు ఇవ్వడాని కీ?" అంది. ఆషాఢం వంకతో అమ్మ వసుధ దగ్గరకెళ్ళి మళ్ళీ రాలేదు. ఆవిడకిక్కడ మడి సాగదు. మాట్లాడడానికి బెరుకుగా ఫీలవు తుంది. అన్నీ తనకు తెలును. కానీ ఏం చెయ్యలేకపోతున్నాడు. ఈ మధ్య సింధుతో ప్రతిదానికీ గొడవ పడ్తున్నాడు. తను కూడా అటు కాలేజ్‌లో ఇటు ఇంట్లో పనిచేసుకుని నతమతమయిపోతూ కనిపిస్తోంది. తనకే మళ్ళీ జాలేస్తుంది. మళ్ళీ అంతలోనే కోపమొ స్తుంది. అందరూ ఇలాగే చేస్తున్నారా? అప్పుడ ప్పుడూ శలవు పెట్టుకోరా? రెస్ట్ తీసుకోరా? తనెందుకిలా అతిగా చేస్తుంది. ఏదో సాధించా లనీ పాడుచెయ్యాలనీ తన జీవితం దుర్భరం చేసుకుంటోంది. పిల్లలకి తల్లి ప్రేమ కరువు చేస్తోంది. సంపాదించిందంతా ఇంట్లోకి ఖర్చు పెడ్తుంది. తన ఎంటర్‌టైన్‌మెంట్ కూడా చూ సుకోదు. చీరలకీ నగలకీ వ్యామోహపడదు కూడా!

రమ్యకి చక్కగా జడగంటలతో జడేసి, చెవు లకి జూకాలు పెట్టి, పట్టు లంగా వేస్తే ఎంత బావుంటుంది! దానికి జడెయ్యడం ఓ పెద్ద పనని చెప్పి బాబ్ చేయించేసింది. ఆమధ్య "పొద్దుటిపూట జడేసుకోవడం పెద్ద పనిగా వుంటోంది. హేర్‌కట్ చేయించుకుంటాను" అంది. తను ఖచ్చితంగా చెప్పేశాడు. "నేను నిన్ను అలా చూడలేను, నాకిష్టముండదు" అని. ఏమనుకుందో ఏమో మళ్ళీ ఆ విషయ మెత్తలేదు. ఇంటిముందు పొగడచెట్టు, వెనక సన్నజాజీ, సంపెంగ, పారిజాతంలాంటి చెట్లు వేసుకుందామన్నాడు. సింధు వెగటుగా మొహం పెట్టింది. నర్సరీకెళ్ళి రకరకాల 'క్రీ పర్స్', పువ్వూ, కాయా ఇవ్వని, ఎటువంటి సుగంధం లేని 'క్రోటన్స్' కొనుక్కొచ్చింది. వీధిలో 'బలురక్కసి' పెద్ద కుండీలో పెట్టింది. ఆమధ్య తేజా వెళ్ళి దానిమీదపడి ఒళ్ళంతా ముళ్ళు గుచ్చుకుపోయి ఏడుస్తుంటే తనే తీసేసి పైన బాల్కనీలో పెట్టాడు. సింధు వంట చాలా బాగా చేస్తుంది. గుత్తి వంకాయ కూర చాలా బావుంటుంది. కానీ ఈమధ్య చిట్టెమ్మ వచ్చాక సింధు వంటింట్లోకి రావడం తగ్గించేసింది. చిట్టెమ్మ బాగా చేస్తుంది, అయినా సింధు చేసినట్టుండదు. పిల్లల్ని తయ్యారు చెయ్యడం, వంటపనీ, ఇల్లు శుభ్రం చెయ్యడం, లాంటివే కాకుండా "చిట్టెమ్మా అయ్యగారికి కాఫీ ఇయ్యి", "చిట్టెమ్మా ఆయన కి బీరువాలోంచి బట్టలు తీసిపెట్టు", "చిట్టె మ్మా ఏం వండాలో అడిగి చెయ్యి" అంటూ ప్రతి పనీ చిట్టెమ్మ కప్పగించేస్తోంది. పోనీ దాని వారా పని తగ్గించుకుంటోందా అంటే అదీ లేదు. రాత్రి పగలూ చదవడం, ఇంటికి స్టూ డెంట్స్ వస్తే వాళ్ళతో డిస్కషన్స్. ఆదివారం పండగరోజూ అని కూడా లేకుండా ఎక్కడో కాన్ఫరెన్స్‌లూ అవీ. పిల్లలు చిట్టెమ్మ పెడ్తే తిని, చిట్టెమ్మతో ఆడుకుని, చిట్టెమ్మ పక్కనే పడు కుంటున్నారు. సింధుకి ఇంటికి రాగానే విసు గ్గా, చిరాగ్గా వుంటుంది. అందుకే తనూ పె ద్దగా మాట్లాడడానికి ట్రై చెయ్యట్లేదు.

"ఏమిటి? మీ వారు మితభాషులా?" ఎవరో అడుగుతున్నారు.

"కాదు భావుకులు. ఏదో ఆలోచిస్తూ వుంటా రు" అంటూ నవ్వింది సింధు.

"సర్వ్ యువర్ సెల్ఫ్" అంటూ ప్లేటిచ్చా డు పెళ్ళికూతురి తండ్రి.

"నీకేం కావాలో వొడ్డించుకు తినిపో" అంటే ఇదివరకు తినేవారా? పూర్వకాలం వాళ్ళెవరైనా వింటే బుగ్గలు నొక్కుకుంటారు. ప్లేట్లో బగరా బైగన్, ఫ్రైడ్‌రైస్, కోఫ్తా, టైర్‌చట్నీ స్వీటూ అన్నీ ఒకదాని మీదొకటిపడి వాటి సహజ రుచులు కోల్పోయాయి. చక్కగా అరిటాకులు వేసి 'కందాబచ్చలికూర , పనసపొట్టు పులి హోర తిరగమోత వేసిన కూర', ఇంక వంకాయ సంతర్పణ కూర మామూలే. ఇవి కాక కందిపొడి, అప్పడాలు, వొడియాలూ, దోస కాయ పప్పూ ముక్కల పులుసూ, లడ్డులతో

విస్తరినిండా వడ్డించి అతిథిలకు హాయిగా విందుచేసే రోజులు పోయాయి గదా! బరువైన ప్లేట్లూ, వాటిల్లో పారల్లాంటి చెమ్చాలూ వేసుకుని నిలబడి చేతులూ, కాళ్ళూ లాగుతున్నా హి, హి, హీ'' అంటూ నవ్వుతూ కలగాపులగంగా కలుపుకు తినడం, ఈలోపు ఎవరో పెరుగన్నం చెయ్యో లేక స్వీటో మనకి పూసేసి ''సారీ!'' అనడం.

అరుణ్‌కి సన్నగా చిరునవ్వు పెదవులమీద మెరిసింది.

పెళ్ళినించొచ్చాకా సింధు నైటీలోకి మారి ముడివిప్పేసి జుట్టుకి రబ్బర్ బ్యాండ్ బిగించింది. ''పట్టుచీర చాలా బరువు, ఎక్కువసేపు భరించలేము'' అంది.

''నన్నుకూడా ఈమధ్య భరించలేకపోతున్నావు!'' అర్ధయుక్తంగా చూసేడు అరుణ్.

వెనక్కి తిరిగి కోపంగా చూసింది, అంతలోనే నవ్వేసి, ''ఇంకొక్క ఆర్నెల్లు ఓపికపట్టు అప్పుడీ సింధు ఎటువంటి బరువులూ, బాధ్యతలూ ఐనా అలవోకగా భరించేస్తుంది'' అంటూ పుస్తకాలు తీసుకుని పక్కగదిలోకెళ్ళిపోయింది. బరువుగా నిట్టూర్చి లైటార్పేసాడు అరుణ్.

★ ★ ★

సినిమా చాలా బోరుగా సాగుతోంది. ఉద్యోగం సద్యోగంలేకుండా వీధుల్లో తిరిగే పోరంబోకులాంటి హీరో, చాలా డబ్బున్న అమ్మాయి వెంటపడి ఏడిపిస్తూ పాట పాడ్తున్నాడు.

''వీడికి మింగ మెతుకులేదు మీసాలకి నంపెంగనూనె అన్నట్టు వెనకాల ఒకేరకం బట్టలేసుకుని స్టెప్పులేస్తూ ఇంతమంది అనుచరులా?'' అడిగాడు శేఖర్ యమున చెవిలో గుసగుసగా.

''హుష్'' అంది.

చివరకి ఆ అమ్మాయి చెప్పుదెబ్బ కొట్టింది, వెంటనే ఆ అమ్మాయిని గట్టిగా పట్టుకుని ముద్దుపెట్టుకున్నాడు.

''కుక్కకాటు తర్వాత గదా చెప్పుదెబ్బ తినాలి?'' మళ్ళీ అడిగాడు.

''మళ్ళీ హుష్'' అంది.

ముద్దుసీన్ పదేపదే ఓ పదిసార్లు రివైండ్ చేసి చూపించి, చివరకు ఆ అమ్మాయి ఘాటైన ప్రేమలో పడిందని తేల్చేసాడు డైరెక్టర్.

''ఆహా! ఎంత నీతి! బలవంతంగా ముద్దుపెట్టుకుంటే అమ్మాయిలు ప్రేమలో పడుదురు'' అన్నాడు.

కోపంగా చూసి నోటిమీద వేలేసుకుని చూపించింది యమున.

మళ్ళీ పాట, ఈసారి ఓ వందమంది అమ్మాయిలూ, అబ్బాయిలూ వీళ్ళని ఫాలో అవుతూ స్టెప్పులేసారు.

''ఈ పాటలో పదాలెవరైనా చెప్పగలిగితే వంద రూపాయిలు వందెం అని ప్రకటిస్తే, ఒక్కడు వందసార్లు విన్నా చెప్పలేడు. కావలిస్తే వందెం'' అన్నాడు క్షాస్త గట్టిగానే.

''వెళ్ళిపోదామా?'' అడిగింది.

''అవునన్నట్టు తలూపేడు. ఇద్దరూ బయటికొచ్చేసారు. రయ్యిమని చలిగాలి వీచింది, యమున కొంగు నిండా ముసుగుదీసుకుని కప్పుకుంది.

''ఇంకా ఎన్ని చలికాలాలు ఒంటరిగా వెళ్ళదీయాలి?'' అడిగేసేడు డైరెక్టుగా.

''శేఖర్'', చిరుకోపంగా అంది.

''నువ్విలా నన్ను ఆపుతూ వుండు ఈలోగా మా అమ్మ ఏ నరసమాంబనో లేక వెంకటవీర వరాహ లక్ష్మీశ్యామల అచ్యుత నాగవల్లీ కనక దుర్గ సాయి ప్రసన్న జయదుర్గ హరివీర సత్యసుబ్బలక్ష్మినో తెచ్చి కట్టబెట్టేస్తుంది'' అని వూపిరి తీసుకున్నాడు.

నవ్వేసింది యమున.

''హాస్యానికికాదు నిజంగా అమ్మ తొందరపడ్తోంది'' చెప్పాడు.

''నీకు నా పరిస్థితి తెలును'' తల క్రిందకు వాల్చి సమాధానం చెప్పింది.

''నీకూ నా పరిస్థితి తెలును'' ఆమె నడుంచుట్టూ చెయ్యేసాడు.

''ప్లీజ్'' అంటూ సున్నితంగా వదిలించుకుంది.

ఆట నడుస్తోంది. థియేటర్ నిశబ్దంగా

వుంది. "బయట లాన్‌లో కూర్చుందామా" అడిగాడు. తలూపి కూర్చుంది యమున. తనూ కూర్చున్నాడు.

"అసలోసారి 'ధనంపేట' పెళ్ళి చూపులకె ళ్ళినవ్పటి విశేషాలు నీకు చెప్పలేదు కదూ!" అడిగాడు.

"ఎప్పుడెళ్ళావు?" ఆతృతగా అడిగింది.

"నీతో పరిచయం కానప్పుడులే! అసలప్పుడు వాళ్ళు పెట్టిన జంతికలు ఇప్పటికీ మర్చిపోలేకపోతున్నాననుకో"

"ఏ అంత బావున్నాయా?" యమున ముక్కు చివర ఎర్రబడింది రోషంతో.

"బహుశా! పెళ్ళికొడుకు దంతాలూ, వాటి నిర్మాణమూ పటిష్ఠంగా వుందా లేదా? అని తెలుసుకోడం కోసం పెట్టినట్టున్నారు. నెల తక్కువ కుంక మా పేరయ్య తొందరపడి తిన్నాడు. అంతే పటుకూ, పటుకూ విరిగిపోయాయి"

"ఏమిటి జంతికలా?"

"అయితే బానే వుండేది, అవి ఆయన దంతాలు"

చిన్నగా నవ్వి,

"అయితే నువ్వు వరపరీక్షలో నెగ్గలేదన్న మాట" అంది.

"అలా జరిగినా బానే వుండేది. కానీ నేను నెగ్గానే!"



"ఎలా? అంత గట్టివి నువ్వు మాత్రం ఎలా తిన్నావు? నీవేమన్నా ఇనప దంతాలా?"

"నేనేం తక్కువవాడినా! నానపెట్టుకుని రో జున్నర కూర్చుని మరీ తిన్నాను"

"గొప్పేలే!" మూతి తిప్పింది నవ్వాపు కుంటూ.

"అసలు విషయం చెప్పనీ! ఇంతలో పెళ్ళి కూతుర్ని తీసుకొచ్చారు"

"బావుందా?"

"మళ్ళీ అడ్డొస్తున్నావు. అయినా అడిగావు కాబట్టి చెప్తున్నాను. ఊరేగింపుకలంకరించిన పెళ్ళికారులా వుంది. తలలో ఓ బుట్టెడు చేమంతి పూలూ, వాటి చుట్టూ కనకాంబరా లూ, మధ్యలో మల్లెపూలూ, జడ పొడుగునా ఈతాకు చాపలా మొగలిరేకులూ, వాట్‌నాట్! దొరికిన పూలన్నీ పెట్టారు ఒక్క అరటి పువ్వు తప్ప!"

" నేనడిగింది అమ్మాయి మొహం గు రించి"

"ఇంకేం కనపడుతుంది చెప్పు! ఈ బరువు కి తల ఎప్పుడో భూమిలో కుంగిపోయింది.

బహుశా! ఇప్పటివరకూ మళ్ళీ ఆ మెడ పైకి లేచుండదు. ఇక పాట పాడమన్నారెవరో వాళ్ళవైపువారే. కాసేపు బతిమాలించుకుంది. చక్కని సినిమా పాట పాడు అంటూ పురమా యించాడు ఇంకా బుద్ధిరాని మా పేరయ్య. అంతే రకీమని అందుకుంది.

"ఏమిటి జనగణమనా"

"అదయినా బానే వుండేది. పాడు జీవిత మూ యవ్వనం, మూడునాళ్ళ ముచ్చటలేరా!" అని. ఆ పాట వినగానే నాకూ ఈ యవ్వ నంమీదా, బతుకుమీదా విరక్తి పుట్టి ఎదురు గుండా పెట్టిన ఓ సున్నుండ తీసుకుని అమాంతం కొరికాను, అంతే మళ్ళీ మర్నాటివ రకూ నోరు తెరవలేకపోయాను.

"ఎందుకూ?"

"ఫెవికాల్‌లా నోటికి అతుక్కుపోయిందిలే. అదంతా కరిగి లోపలి కెళ్లడానికి ఒకరోజున్నర పట్టింది"

"చాల్లే! అబద్ధాలు" నవ్వుతూ అంది యమున.

"అబద్ధాలేమిటి! ఇవేళ పొద్దుట కూడా అమ్మ ధనంపేట సుబ్బలక్ష్మి సంబంధం ఖాయం చేయమంటావురా? అనడిగింది తెలుసా?"

"చేసుకోమరి! చక్కచక్కని పిండివంటలవీ తింటుండచ్చు"

"పిండివంటల సంగతొదిలెయ్, ఒక రైస్ మిల్లూ, సినిమాహాలూ సుబ్బులు పేరిట రాసే స్తానన్నాడు వాళ్ల నాన్న!"

"అయితే ఇకనేం! మహరాజులా చేసు కోక?" ఈసారి నిజంగానే కోపమొచ్చింది యమునకి.

"ఎన్నిచ్చినా వాళ్ల నాన్నని మాత్రం భరించలేం బాబూ! అన్నింటికీ ముక్కున వేలుంచుకుని "భలే, భలే" అంటాడు. "నీ పేరెవరన్నావు?" అడిగాడు రైలు దిగగానే. "చంద్రశేఖర్" అనగానే "భలే భలే" అన్నా డు ముక్కున వేలుంచుకుని.

"ఏం చదివావు నాయనా?" అడిగాడు మళ్ళీ. "బిఇ." అండీ అన్నాను. మళ్లీ "భలే భలే" అన్నాడు బానేవుంది. తాతగారు ఏం చేస్తున్నారు?" అడిగాడు.

"పోయారండి" అని చెప్పగానే "భలే భలే" అన్నాడు. ముక్కున వేలుంచుకుని, దాంతో నావోళ్లు మండిపోయిందనుకో"

అతనభినయం చూసి నవ్వాపుకోలేక పకప కా నవ్వేసింది యమున. "నల్లపిల్ల" ముక్కు పట్టుకునూపి, ఆమె కోపంగా చూడగానే "తమి ళంలో చెప్పాను" అన్నాడు నవ్వుతూ.

"బయల్దేరదాం!" అంది లేచి నిలబడి. ఆమె చెయ్యందుకుని. "జాణవులే! మృదుపా ణివిలే!" అంటూ పాడ్తూ లేచి నిలబడి చెప్పా డు "రేపు మా ఇంటిల్లిపాదీ గుర్తుంచుకొనే రోజు!"

"ఏం?" అడిగింది యమున.

"మా అమ్మా నాన్నగారూ పాతికేళ్ళక్రితం చేసిన తప్పుకు రూపం వచ్చినరోజు!"

"అబ్బా! నా మట్టిబుర్రకు అర్థమయ్యేలా చెప్పు!" అంది విసుగ్గా.

"అంటే నా పుట్టినరోజన్న మాట" గబగబా చెప్పేశాడు.

యమున బుగ్గలు ఎర్రబడ్డాయి. "ఇప్పుడా చెప్పడం?" అంది అలకగా.

"ఇందాక చెప్పింటే ముద్దు పెట్టుకోనిచ్చేదా నివా?" అడిగాడు కొంటెగా.

"ఛీపో! ఎప్పుడూ అదే" మళ్ళీ సిగ్గుపడింది.

"రేపు మాత్రం తప్పదు! అదే నా పుట్టిన రోజు కానుకనుకుంటాను" ఆమె చేతిని గట్టిగా నొక్కుతూ చెప్పాడు. "రేపు కూడా ఇలా వస్తే అలస్యమయిపోతుంది శేఖర్! రోజూ ఐతే ఇంట్లో కూడా అనుమానమొస్తుంది. అయినా ఇవేళ ఈ సినిమా ప్రోగ్రామ్ ఎందుకు పెట్టినట్లు?" అడిగింది చిరుకోపంగా.

"రేపు నా పుట్టినరోజు కాబట్టి హీరోయిన్ లీవ్ పెట్టాలి. అది చెప్పడం కోసం ఇవేళ ఇక్కడికి రమ్మని ఫోన్ చేశాను తప్పా!"

ఆమెకి కోపమొచ్చిందని తెలిసి, బతిమాలుతున్నట్లు అడిగాడు. "ప్లీజ్, లీవ్ పెడ్తావుకదూ! గోల్కొండ వెళ్దాం"

"అమ్మో!" గుండెలమీద చెయ్యేసుకుంది యమున.

"గోల్కొండకే అమ్మో అంటావేమిటి? పెళ్ళయితే గ్లోబుమీదున్నవన్నీ తిప్పేస్తాను" చెప్పాడు సీరియస్‌గా శేఖర్.

"నీ ధోరణి నీదేగానీ నా సంగతాలోచించవు. ఎవరైనా చూస్తే ఎంతసహ్యంగా వుంటుంది? మనం పెళ్లి చేసుకోబోతున్నట్లు వూళ్లో అందరికీ తెలియదుగా. ఈ అమ్మాయి అందరితో ఇలాగే తిరుగుతుందేమో అనుకుంటే తెలిసిన వాళ్లు చూసి, అమ్మకీ నాన్నగారికీ తెలిస్తే, అంత తొందరగా వుందా దానికి అనుకుంటే ఛీ! సిగ్గుతో నా ప్రాణాలు పోవూ!" అడిగింది బాధగా.

శేఖరేం మాట్లాడలేదు కాసేపు. ఇద్దరూ మౌనంగా నడుస్తున్నారు. "నీ వల్లేకదా ఇదంతా" అంటున్నట్లుగా వుంది అతని మౌనం. బస్‌స్టాపు చేరాకా కూడా అతను మాట్లాడలేదు. ఎప్పుడూ ,ఏదో ఒకటి చెప్పి నవ్విస్తుండే అతను అలా అయిపోవడం చాలా బాధగా అనిపించింది యమునకి. దూరంనుండి బస్‌వస్తూ కనిపించింది. ఏమైనా చెప్తాడేమో అని శేఖర్‌వైపు చూసింది. అతను తల తిప్పుకున్నాడు. బస్ చాలా దగ్గిరకొచ్చేసింది. "శేఖర్" అంది. అతను ఆమెవైపు చూడలేదు. బస్ ఆగింది. కళ్ళనిండా నీళ్లతో ఎక్కేసింది. మనసంతా చేదుగా అయిపోయింది. పుట్టినరోజని చెప్తే బాధపెట్టానేమో! అయినా అంత మొండితనమా? మాట్లాడకుండా శిక్షిస్తాడా? రేపు కలుస్తాడో లేదో! చూసి మామూలుగా మాట్లాడేదాకా మనసు, మనసులో వుండదు. తనకు మాత్రం తెలీదా? ఆలోచిస్తుండగానే తన స్టేజ్ వచ్చేసింది. దిగి అన్యమనస్కంగా అడుగులు వెయ్యసాగింది.

"జాణవులే! వరవీణవులే" వెనుకనించి వినిపించింది. దిగ్గున వెనక్కి తిరిగి చూసింది. నవ్వుతూ శేఖర్,

"రేపు కలుస్తావా లేదా? ఇప్పుడు చెప్పు! ఆలోచించడానికే ఇంత టైమిచ్చాను" చెప్పాడు మీసాల చాటున నవ్వును దాస్తూ.

"రేపు నీవని చెప్తాను" కళ్లనుండి చెంపల మీదుగా జారే ముత్యాలను రుమాలుతో అద్దుకుంటూ అంది.

"థ్యాంక్యూ! ఎదురుచూస్తుంటాను" నవ్వుతూ చెప్పి వెనుదిరిగి వెళ్లిపోయాడు.

ఓ నిమిషమాగి చూసి సన్నని చిరునవ్వు పెదవులమీదకి రాగా తనూ ఇంటివేపు అడుగులెయ్యసాగింది తేలికబడ్డ మనసుతో యమున.

★ ★ ★

కావేరికి క్షణం తీరిక లేకుండా వుంది. జయకి ఏడోనెలొచ్చి వారమయింది. వెళ్లి పసుపు కుంకుమలిచ్చి తీసుకురావాలి. వాళ్ళు ఒండేది బెజవాడలోనే కాబట్టి కనకదుర్గ మొక్కు కూడా తీర్చేసుకోవచ్చని పూజని కూడా తీసుకెళ్తోంది. ప్రభని రమ్మని మర్యాదకడిగింది. "అమ్మో! వాళ్లత్తగారో లంఖిణీ, ఏదో ఒకటంటుంది. నీకైతే ఓరిమి బాబూ! నేనైతే ఏదో ఒకటి దులిపిపారేస్తాను. వద్దు నువ్వెళ్లు అన్నయ్యతో" అంది.

సుధాకర్ సూట్‌కేస్ సర్దుతూ మాటిమాటికీ

''కావేరీ కావేరీ'' అని పిలుస్తూనే వున్నాడు.

వంటింట్లో అత్తగారితో కలిసి చక్కిలాలూ, చలిమిడీ, లడ్డూ చేస్తున్న కావేరి మాటిమాటికీ పరిగెత్తాల్సొస్తోంది.

''అబ్బా! వదిలెయ్యండీ, నేనొచ్చి చూస్తానుగా!'' అంది.

''ఏమిటి నీ మొహం! నువ్వు చూసేది, చంటిపిల్లతో వెళ్తున్నాము. దానికి స్వెట్టర్ పెట్టాలా? కొత్తచోటు అక్కడేమైనా విరేచనాలు అవుతాయనుకో. వాళ్లనిబ్బంది పెట్టకుండా మనమే మందులవీ తీసుకెళ్లాలి. పూజకి కాఫ్ సిరప్, కోల్డు సిరప్, దెబ్బ తగులుతే నియోమైసిన్ ఆయింట్‌మెంట్, చెవిపోటొస్తే ఓజోసిన్, ఇంకా...'' అంటుంటే తల కొట్టుకుంది కావేరి.

''ప్రయాణాలు బొత్తిగా చెయ్యకపోవడంతో మీరు ఖంగారు పడ్తున్నారంతే! అదేం అంటార్టికా కాదు, అడవీ అర్ధాన్నం అనలేకాదు. విజయవాడ మహాపట్టణం. వెళ్తున్నది మీ చెల్లెలింటికి రెండు పూటల్లో తిరిగి వచ్చేస్తాం. ఇంత సరంజామా అనవసరం. అవునూ! ఇంతకీ ఉత్తరం అందుంటుందా? లేకపోతే ఆవిడ చెప్పా పెట్టకుండా వచ్చి మా కోడల్ని పట్టుకుపోతున్నారెందుకంటుంది''

''ఎప్పుడో అంది, మనమొస్తే ఎలా రిసీవ్ చేసుకోవాలో ఆవిడ రిహార్సల్స్ కూడా చేసేసుకునుంటుంది'' అన్నాడు పెట్టెమూస్తూ.

''అమ్మాయ్, ఈ పాకం చూడు'' అంటూ వంటింట్లోంచి అత్తగారి కేక వినిపించి ''ఈసారి పిలుస్తే రాను'' అని బెదిరించి వంటింట్లో కెళ్లింది కావేరి.

సాయంత్రం బజారుకెళ్లి జయకో మామిడి పండు రంగుకి ఎర్రబోర్డర్, వెంకటగిరి జరీ చీర, వాళ్ళత్తగారికో తెలుపుకి నీలమంచు నేతచీర తీసుకుంది. జయకిష్టమని కలాఖండ్, జీడిపప్పుపాకం మంచి షాప్‌లో కొంది. పూలూ, ఆకులూ. అరటిపండ్లూ దగ్గర్నుంచి అన్నీ కొనేసి ఇంటికొచ్చారు భార్యాభర్త.

''అమ్మవారికి చీర పెడ్తానన్నావు?'' అడిగింది వర్ధనమ్మగారు ఇంటికి రాగానే. కావేరి మాట్లాడలేదు. ''బాగానే వుంది. సంబడం? ఇదిగో మొన్న ప్రభచేత తెప్పించివుంచాను. నాకు నీ సంగతి తెలుసుగా!'' అంటూ ఎర్రగళ్ల పేటేరు చీర పేకెట్లోంచి తీసి చూపించింది వర్ధనమ్మ. కావేరికి తెలుసు అదావిడ మనసువడి ఎదురింటికి చీరలవాడొస్తే కొనుక్కుందని. కానీ తెలియనట్లే తీసుకుని ''చూసేరా! అమ్మవారే ఏర్పాటు చేసుకున్నారు తన చీర'' అంటూ వంగి అత్తగారి కాళ్లకు దండం పెట్టింది. పిచ్చిమొద్దు అంటూ లేవనెత్తి 'తన స్వార్థం తను చూసుకుంటే ఈ సంసారం ఇలా సాఫీగా నడిచేదా? ఏమైనా కోడలి విషయంలో నేను చాలా అదృష్టవంతురాల్ని' అనుకుంది వర్ధనమ్మ.

స్టేషన్‌లో దిగగానే ''టిఫిన్ చేసేద్దాం. ఎందుకైనా మంచిది'' అన్నాడు సుధాకర్. సరేనని పూజకి పెట్టించి తనూ ఆకలి లేకపోయినా ఇడ్లీతింది. రిక్షా చేయించుకుని ఎడ్రెస్ ప్రకారం ఇంటికెళ్లారు. వాకిట్లోనే కూర్చునుంది దుర్గమ్మ. ''కాగల కార్యం గంధర్వులు తీర్చారనీ, నేనే మీ పిల్లని పురిటికి తీసుకెళ్తారా, లేదా అని ఉత్తరం రాద్దామనుకున్నాను. ఇంతలో మీరు రాసిన ఉత్తరం అందింది. ఏమిటింతా లశ్యం. 'మందుకెళ్లి మాసికానికొచ్చినట్టు' అంది.

ఆవిడ వాగ్ధాటి తెలిసిందే కావడంతో ''ఇద్దరం ఉద్యోగస్తులమా, సెలవులవీ చూసుకోవాలి కదండీ!'' అంది కావేరి.

''తుమ్మితే వూడిపోయే ముక్కుల్లా అవేం ఉద్యోగాలమ్మా రెండు రోజులు సెలవు కూడా దొరకదా! బాగానే వుంది'' అంది.

''అమ్మా అత్తేది?'' అంటూ మధ్యలో రెండుసార్లడిగింది పూజ.

''పెళ్లికొడుకేడంటే, అరివేణం కుండలకాడ తొంగున్నాడన్నట్టూ లోపలెక్కడో చేసినపనే చేస్తుంటుంది, ఒసే జయా!'' అంటూ కేకేసింది.

ఆ పిలుపు చాలా మోటుగా కన్పించింది. జయ లోపల్నుండి భారంగా అడుగులేస్తూ వచ్చి ''అన్నయ్యా, వొదినా'' అంటూ గబాగబా దగ్గరకొచ్చి వదినగార్ని రెండు చేతులతో పట్టుకొని ''బాగున్నారా అంతా?'' అనడిగింది.

''నువ్వేమిటలా అయిపోయావు? వేవిళ్లు తగ్గాయా?'' అడిగింది కావేరి గుంటలుపడ్డ

కళ్లూ, పాలిపోయిన చెక్కిళ్లూ తడిమి.

"కడుపుతోటున్నప్పుడలా గాక ఇంకెలా వుంటారు? నువ్వు మాత్రం కనలే ఇద్దర్నీ" అంది దుర్గమ్మ నిష్టూరంగా.

సుధాకర్ మొహం ఎర్రబడింది.

"లోపలికి రండి! పూజా, అత్త గుర్తుందా!" అంటూ పూజని ముద్దు పెట్టుకుని లోపలికి తీసుకెళ్లింది జయ.

పక్కగదిలోంచి టి.వి. హోరుగా విని పిస్తోంది. "ఎవరూ?" అన్నట్లు సైగ చేశాడు సుధాకర్.

"మా వదినగారూ, పిల్లలూ, అన్నయ్యగారు దుబాయ్ వెళ్ళినప్పట్నించీ ఇక్కడే వుంటున్నారు" చెప్పింది కావేరి.

ఆవిడ కానీ, పిల్లలు కానీ ఇంటికెవరో వచ్చారని బయటకొచ్చి పలకరించడం అదీలేదు. వి.సి.ఆర్.లో క్యాసెట్లనుకుంటా చూస్తున్నారు. గొడవ, గొడవగా.

కావేరి స్నానం చేసొచ్చింది. పూజని కూడా తయారుచేసింది. దుర్గమ్మ తన ధోరణిలో ఏదో పెళ్ళినాడు మర్యాదలవీ సరిగ్గా జరగలేదనీ, వాళ్ళ మేనత్తకెవరికో అప్పగింతల చీర పెట్ట లేదనీ చెప్పుకొస్తోంది. జయ వంచిన నడుం ఎత్తకుండా వంటింట్లో అటూ ఇటూ తిరుగుతూ వంట చేస్తోంది. కత్తిపీట ముందు కూర్చుని కూర తరుగుతున్నదల్లా, పొయ్యి మీద ఎసరు చూడడానికి లేచింది. లేచేటప్పుడు చాలా కష్టపడ్తోందని ఆమె ముఖం చూస్తే ఎవరైనా చెప్పగలరు. కావేరి మనసు కొట్టుకుపోతోంది జయ పరిస్థితి చూస్తుంటే. అక్కడ వదినగారూ, పిల్లలూ మళ్లీ క్యాసెట్టు మార్చుకుని కేరింతలు కొడ్తూ సినిమా చూస్తున్నారు. ఇక్కడ దుర్గమ్మ ధోరణి దుర్గమ్మదే.

"జయా నేను తరుగుతాను. నువ్వు వేరే పనిచూసుకో" అంటూ ధైర్యంచేసి వంటింట్లో కెళ్లింది.

"కూసే గాడిదొచ్చి మేసే గాడిదని చెడగొట్టినట్టూ, నువ్వూరుకో, అదలా తిరిగి పనిచేసుకుంటుంటే సుఖంగా, తేలికగా ప్రసవమవుతుంది" అంది దుర్గమ్మ.

"ఈవిడ సామెతల పిచ్చికాదుగానీ, ఏమంటోందో ఆవిడకే తెలియదు" నుదురుకొట్టుకుంది జయ.

"ఉష్! అంటే అందిలే, గాడిదలం కాకపోతే ఇలాంటి ఇంట్లో ఆడపిల్లనిస్తామా" అంది చిన్నగా నవ్వుతూ కావేరి.

"ఇదివరకు ఆడపిల్లనిచ్చిన ఇంట్లో కాదు గదా! ఆ వూళ్లోనే వచ్చి మంచినీళ్లు తాగేవారు కాదుట. ఆ రోజులు పోయాయి. "మా తాతలు నేతులు తాగారు. మా మూతులు వాసన చూడండీ" అనే పరిస్థితులొచ్చాయి"

దుర్గమ్మ కావాలనే అంటోందా లేక తెలివి తక్కువగా మాట్లాడ్తోందా? అనే అనుమానమొచ్చింది కావేరికి. గబుక్కున భర్తవైపు తిరిగింది. పేపరు చూస్తున్నవాడల్లా లేచి "చక్రపాణింటికెళ్దాం పద" అన్నాడు. అతని మొహం ఎర్రగా కందిపోయింది.

"అదేమిటన్నయ్యా! వంటయిపోయింది" అంది జయ. "ఇవాళెలాగూ గురువారం, మా ఇద్దరికీ మీ వదిన చెప్పలేదా? పూజకి పెట్టి తింటానంటే" అన్నాడు చెల్లెలి మనసు నొప్పించకూడదనీ.

"అయ్యయ్యో! ఈ విషయం చెప్తే ఉప్మా చేసేదాన్నిగా" అంది నొచ్చుకుంటూ.

"నిన్నిబ్బంది పెట్టడం ఇష్టంలేక హోటల్లో టిఫిన్ చేసేవచ్చాం" చెప్పింది కావేరి.

జయకి పరిస్థితర్థమయింది. ఇక మాట్లాడలేదు. చీకటిపడ్తుండగా జయ భర్త శశిధర్ వచ్చాడు. "బావగారా? నమస్కారం. ఎప్పుడు రావడం" అంటూ బాగానే పలకరించాడు.

జయ వదినగారూ, పిల్లలూ బయటకొచ్చి ఎవరివైపూ చూడకుండా వంటింట్లోకెళ్ళారు. జయ వడ్డిస్తోంది. కావేరి వూర్కోలేకపోయింది. "జయ చాలా బలహీనంగా కనిపిస్తోంది. డాక్టర్‌కి చూపించారా? మందులతోబాటు విశ్రాంతి కూడా ఈ పరిస్థితిలో అవసరం" అంది నెమ్మదిగా.

"అవన్నీ ఆడవాళ్ల విషయాలు, నేను పెద్దగా పట్టించుకోను" చెప్పాడు కావేరివైపు చూడకుండానే.

కావేరి మనసు రగిలిపోయింది. కాపురంచేసి, గర్భవతిని చేసి మిగతా సంగతులేం పట్టించుకోకండా రంగేళీగా వూరేగుతున్నాడు.

సుష్టుగా తిని, ఆ భోజనం పెట్టిన మనిషిని "నువ్వు తిన్నావా?" అనడగనివాడు ఓ మనిషేనా అనిపించింది. సుధాకర్ లేచి నిలబడి చెప్పాడు. "మా ఫ్రెండ్ ఇంటికెళ్తున్నాం. రేపు గుడికదీ వెళ్లి సాయంత్రానికొస్తాం. రాత్రికి బండి. మీరింట్లోనే వుండండి" అని కావేరివైపు తిరిగి చెప్పాడు. "జయకి చెప్పు ప్రయాణానికి సిద్ధం చేసుకోమని అలాగే మనకి వంట చెయ్యొద్దు అని కూడా చెప్పు"

నరేనని వంటింట్లోకెళ్లింది కావేరి. భర్త చెప్పమన్న మాటలు చెప్పి "వెళ్తొస్తాం అక్కయ్యగారూ, వెళ్లొస్తాం పిన్నిగారూ" అని చెప్పి బయటికి నడిచింది.

"హడావిడి పెళ్లికొడుకు అత్తగారి మెడలో పుస్తె కట్టాడనీ, ఇప్పుడే వెళ్లిపోతున్నారా?" అంటోంది ఇంతింత ముద్దలు చేసుకుని మింగుతూ దుర్గమ్మ.

బయటకు రాగానే జయ భుజంమీద చెయ్యేసి చెప్పింది కావేరి. "మీ గదిలో మంచంమీద స్వీట్ ప్యాకెట్టు పెట్టాను, నువ్వు తిని, తర్వాత వాళ్లకియ్యి. లేకపోతే నీదాకా రాదు" అని.

జయ శుష్కదరహాసం చేసి "అన్నం పెట్టకుండా పంపించేస్తున్నాను" అంది.

"మనింటికెళ్ళాకా నీ పాకశాస్త్ర ప్రావీణ్యమంతా చూపించెయ్! తృప్తిగా తింటాను. ఇంకెంత ఇరవైనాలుగ్గంటలు!" చెల్లెలి తలని దగ్గరగా తీసుకుని ప్రేమగా చెప్పాడు సుధాకర్.

రిక్షాలో చెప్పింది కావేరి. "ఇన్నాళ్ళూ అందరూ కావేరికి ఓర్పెక్కువా, మంచిది" అంటుంటే నిజమనుకున్నాను. కాదని జయని చూశాక తెలిసింది. అన్నీ సరిగ్గా వుండి, భర్త ఆదరణా, అత్తగారి మంచితనం వున్నచోట కలివిడిగా వుండడం గొప్పకాదు. ఏమీ లేకపోయినా, నోరెత్తకుండా ఇంత చాకిరీ చేస్తూ, ఒక్కమాటైనా మనకు తెలియబర్చని జయది మంచితనం" అంది.

"కాదు చాతకానితనం!" వెంటనే అన్నాడు.

"ఆడదానికి భర్తని తనవైపుకి తిప్పుకునే ఓర్పూ, నేర్పూ కొంతవరకూ అవసరం. శశిధర్ మూర్ఖుడే కానీ దుర్మార్గుడు కాదు, అది ప్రయత్నిస్తే అతన్ని మార్చుకోవచ్చు. అతనోసారి ప్రపంచాన్ని చూస్తే, తల్లి నణుగుడు లెఖ్ఖచెయ్యడు. చాలా మొండివాడు"

"మనింటికి రానీయండి దానికి నాలుగు లెక్చర్లిచ్చి మార్చేస్తాను. అంతేకాదు అతన్నే రెండు, మూడుసార్లు పిలిపించి మిగతా భార్యాభర్తలు ఎలా వున్నారో తెలిసేటట్లు చెయ్యాలి" అంది కావేరి.

పూజ నిద్రపోయింది. చక్రపాణివాళ్లూ రిక్షా బెల్లు కొట్టగానే బయటికి వచ్చి చూశారు. రిక్షాలోంచి దిగుతున్న సుధాకర్‌ని చూడగానే "సుధా" అంటూ కావలించేసుకున్నాడు. వెనకాలే వచ్చిన వాళ్ళావిడ "రండి, రండి" అంటూ పూజని చేతిలోంచి చనువుగా అందుకుని ఎత్తుకుని, "ఒరే బుజ్జీ, సూట్‌కేస్ లోపలికి తీసుకురా" అంటూ కొడుక్కి చెప్పింది. రిక్షావాడికి డబ్బులు కూడా ఇవ్వనివ్వలేదు చక్రపాణి. తనే ఇచ్చి భుజంచుట్టూ చెయ్యేసి లోపలికి తీసుకొచ్చాడు. వాళ్ళ భోజనాలవీ అయి పడుకున్నట్లున్నారు.

"లక్ష్మీ! ముందు కుక్కరు పడేసిరా, తర్వాత మాట్లాడుకోవచ్చు" చెప్పాడు.

"అరెరే! ఏం వద్దు, ఓ దుప్పటీ ఇవ్వండి చాలు" అంది గబుక్కున కావేరి.

"మీ హైదరాబాద్‌లో చుట్టాలొస్తే అలాగే చేస్తారా ఆంటీ!" సిసింద్రీలా అడిగింది వాళ్ళమ్మాయి.

"లతకి కొత్తా పాతా లేదు, అంతా తల్లిపోలిక" చెప్పాడు చక్రపాణి.

"అవునవును! కొత్త వాళ్ళని చూడగానే బిగుసుకుపోయి కూర్చోడం. అలవాటుపడేలోగా వచ్చినవాళ్లు వెళ్లిపోడం నాకు చిరాకు" చెప్పేసింది బంగాళాదుంపలు తొక్కతీస్తూ లక్ష్మి.

"మీరనవసరంగా శ్రమపడ్తున్నారు" అంటున్న కావేరి మాటల కడ్డొస్తూ చెప్పాడు సుధాకర్ "నాకూ చాలా ఆకలిగా వుంది. నువ్వనవసరంగా అడ్డుపుల్లలేసి మా చెల్లెలి పనికడ్డురాకు"

తెల్లబోవడం కావేరి వంతయింది. బంగాళా దుంపల వేపుడూ, చారూ, అప్పడాలూ, వడియాలు, గోంగూర పచ్చడీ, కందిపొడీ, పెరుగుతో కొసరి కొసరి వడ్డించి పీకలదాకా తినిపించారా దంపతులు.

నా కడుపులో ఇంత ఆకలి దాక్కుందా? అని ఆశ్చర్యపోయింది కావేరి. "ఒక చెల్లెలింటికొచ్చి, ఇంకో చెల్లెలి చేతివంట తినాలని రాసిపెట్టుంది కాబోలు" చెప్పాడు సుధాకర్, జరిగినదంతా పూసగుచ్చినట్లు.

"ఈ కాలంలో కూడా ఇంత గుండమ్మలుంటారా?" అడిగింది లక్ష్మి అమాయకంగా.

కావేరీ, లక్ష్మీ బాగా కలిసిపోయారు. అటువైపు వాళ్ళ గురించీ, ఇటువైపు వాళ్ళ గురించీ కూడా మూడుతరాలు వెనక్కెళ్లిపోయారు.

"చిన్నప్పటినుండి స్నేహితులం, అయినా మాకిన్ని కబుర్లు లేవేమిటి" ఆశ్చర్యంగా అడిగాడు చక్రపాణి.

"వదిన చాలా కలుపుగోలు మనిషండీ! చదువుకుని, ఉద్యోగం చేస్తున్నా అస్సలు గర్వంలేదు" అని చెప్తుంటే స్వచ్ఛమైన పాలలాంటి ఆమె మనసులోంచొచ్చినవేకాని అవి మాట వరసకన్నవి కావని తెలిసిపోతోంది.

ఆలస్యంగా పడుకోవటంవల్ల తెల్లారి లేచేటప్పటికి బారెడు పొద్దెక్కుతోంది.

"అయ్యో!" అనుకుంటూ గబుక్కున లేచింది కావేరి. రాత్రి సరిగ్గా చూడలేదుకానీ, మూడు గదుల పోర్షన్, ముందుగదిలో పిల్లలూ, చక్రపాణి, సుధాకర్ పడుకున్నారు. మధ్య గదిలో లక్ష్మీ, కావేరీ పూజని పెట్టుకుని పడుకున్నారు. మిగిలింది వంటిల్లు. విశాలంగా బావుంది. కూర్చుని భోజనాలు కూడా చెయ్యొచ్చు.

"అమ్మా..." అంటూ వచ్చింది పూజ లోపల్నుండి. "షేమ్, షేమ్ లేట్‌గా లేచావు. నేను చూడు బ్రష్ చేసుకుని, పాలుతాగి, స్నానం కూడా చేసేశాను" చెప్పింది.

కావేరి అప్పుడు గమనించింది బల్లమీద పూజ బ్రష్, టంగ్ క్లీనర్ వున్నాయి. "నేను ఆంటీకి తీసిచ్చాను. ఈ బాడీఫ్రాక్ కూడా తీసివేసుకున్నాను బుట్టలోంచి" చెప్పింది.

"లేచావా వదినా! ఇంకాసేపు పడుకోపోయావా? అక్కడెలాగూ తప్పదు నీకీ తెల్లారగట్ల లేవడం" అంటూ వచ్చింది లక్ష్మి తలపిడపతో.

"ఛా! ఇప్పటికే చాలా ఆలస్యమయిపోయింది" అంటూ బాత్‌రూంలోకి నడిచింది కావేరి.

పదవుతుండగా అందరూ కొండకి బయల్దేరారు. చక్రపాణి ఆఫీస్‌దే టెంపో తెప్పించాడు. అతనికి తను పనిచేసే కంపెనీలో షేర్లవీ వున్నాయి. బాగానే సంపాదిస్తున్నాడు. ఇల్లు కూడా కడ్తున్నాడు. రెండెళ్లల్లో గృహప్రవేశముంటుంది మళ్లీ రావాలి" అని లక్ష్మి ఇప్పటికి పదిసార్లు చెప్పుంటుంది. విజయవాడలో ఇల్లు కట్టడమంటే మాటలు కావు. అందరూ వేన్ ఎక్కి కూర్చున్నారు. పూజకి చాలా సంతోషంగా వుంది. లతా వాళ్ళ బుజ్జీ దాన్నెత్తుకుని దింపట్లేదసలు.

"లక్ష్మీ ఏమిటాలస్యం?" అంటూ హారన్ మోగించాడు చక్రపాణి.

"వస్తున్నానండీ!" అంటూ పెద్ద బుట్టతోటి బయటకొచ్చింది లక్ష్మి. "అందులో ఏమిటమ్మా" అడిగాడు సుధాకర్. "ఏం లేదన్నయ్యా! దర్శనమయ్యేటప్పటికి ఆలస్యమవుతుంది. అందుకని, పులిహోరా, చక్కెర పొంగలీ చేశాను. పిల్లలకోసం పండ్లూ, బిస్కెట్లూ పెట్టాను. ఇంక మంచినీళ్లూ, కూర్చోడానికో జంబుఖానా నరేసరి."

"సర్లే! నీకింకాస్త టైమిస్తే మనింట్లో ఒక్క వస్తువా మిగలకుండా టెంపోలో పెట్టించేస్తావు" హాస్యమాడాడు భర్త.

"ఇప్పుడిలాగే అంటారొదినా! తర్వాత పిల్లలకంటే ముందీయనే ఆకలాకలని నా ప్రాణం తినేస్తారు" చెప్పింది వేన్‌లో కూర్చుంటూ.

లక్ష్మి ఓర్పూ, పనితనం చూస్తుంటే ముచ్చటేసింది కావేరికి. ఇంకా ఇలా అతిథులకి మర్యాదలూ, ఆప్యాయతలూ పంచే మంచి మనసులుండబట్టే దేశం ఈ మాత్రంగానైనా వుంది కాబోలుననుకుంది.

అమ్మవారికర్చన చేయించి చీరా, రవికలగుడ్డా పెట్టి "ప్రతి జన్మలోనూ ఇటువంటి భర్తా, అత్తగారే దొరకాలని మొక్కుకుంది కావేరి.

అందరూ జంబుఖానా పరచుకుని కూర్చుని తెచ్చినవన్నీ తిన్నారు. లక్ష్మి చేతి మహిమేమో కానీ దానం కూడా చేసేంత మిగిలింది.

ఇంటికొచ్చేటప్పటికి మూడయింది. లక్ష్మి ఓపిగ్గా గుత్తివంకాయకూర, సాంబారూ, కొబ్బరి చట్నీ అన్నీ చేసింది. ఏకంగా తిని బయల్దే రదాం సాయంత్రం'' అన్నారు సుధాకర్, కావేరి.

కావేరి బలవంతంమీద సాయంత్రం లక్ష్మీ, చక్రపాణీ కూడా బయల్దేరారు జయ ఇంటికి.

''తెచ్చినసారె నేనెప్పుడు పంచేదమ్మా, ఇంతాలస్యంగా వస్తే'' అంటూ రుసరుసలాడింది దుర్గమ్మ.

''నీకింకో అక్క ఈవిడ పేరు లక్ష్మి'' అని పరిచయం చేసింది జయకి కావేరి.

''చేరెడు పసుపూ, భరిణెడు కుంకుమా, ఈ కొంచెం చలిమిడీ ఎవరి ముక్కుల్లోకమ్మా?'' ముక్కున వేలేసుకుంది ఆడపడుచు.

కుంకుమా, పసుపూ, మూడుకిలోల చలిమిడీ, వంద లడ్డూ, చక్కిలాలూ, తెచ్చిన చీరలూ ఆవిడకంటికానలేదు. జయ అటూ ఇటూ తిరుగుతూ ఏదో ఒకపని చేస్తూనేవుంది. పేరంటాళ్ళొచ్చినా కూడా.

''అంతలా అవిధిపడకు. నువ్వు కుర్చీలో కూర్చో'' అంది కావేరి.

''వగలమారొంకాయ సెగలేకే మగ్గిందనీ అంతమాత్రానికే అలిసిపోతుందా?'' అంది దుర్గమ్మ.

కావేరేం మాట్లాడలేదు. దుర్గమ్మకి చీరపెట్టి నమస్కరించి, జయకి చీరెపెడ్తుండగా ''మరి మా అమ్మాయికో'' అంది దుర్గమ్మ.

కావేరి ఇది వూహించలేదు. అందుకే ఏం చెయ్యాలో తెలీలేదు. ''చేసిన పాపం చెప్తేపోయిందీ, తొక్కిన అడుసు కడుక్కుంటే పోయిందీలే కానీ ఈ చీర మా అమ్మాయికి పెట్టు. జయకి మీ వూరెళ్ళాకా కొనుక్కోవచ్చు'' అని ఉచితసలహా పారేసింది.

లక్ష్మి కావేరిని ఏంచేద్దాం అని కళ్ళతో అడిగింది. కావేరి జయవైపు చూసింది.

పెట్టేయ్ తప్పదు అన్నట్టు సైగ చేసింది జయ.

''అయ్యవారొచ్చేదాకా అమావాస్య ఆగదు. త్వరగా కానీండీ'' అంది దుర్గమ్మ.

కావేరి చీరా, రవికలగుడ్డా, తాంబూలం వాళ్ళమ్మాయి వొళ్ళోపెడ్తూంటే ''కట్టుకున్నది కూడబెడ్తే, వుంచుకున్నది వూడ్చుకెళ్ళిందట. ఎలా వుంది అత్తయ్యగారూ సామెత'' అంది లక్ష్మినవ్వుతూ.

తల్లీకూతుళ్ళు దెబ్బతిన్నట్టు ఒకరి మొహాలొకరు చూసుకున్నారు.

''భోగీ భోగీ నీ భోగమెన్నాళ్ళే అన్నట్టు ఇక రేపట్నించీ ఎలా చేసుకుంటారో ఏమిటో పనీపాటలూ''అంటూ ఓ చురకంటించింది.

''గుడ్డొచ్చి పిల్లనెక్కిరించినట్టు నాకు సామెతలు చెప్తుందేమిటీ'' అంది కూతురితో దుర్గమ్మ.

''తాడిని తన్నేవాడికీ తలదన్నేవాడుంటాడత్తయ్యా'' చెప్పింది లక్ష్మి.

కావేరీ, జయా నవ్వాపుకోలేకపోయారు. ''మాటలు నేర్చిన కుక్క వుస్కో అంటే వుస్కో అందనీ బాగానే చెప్తున్నావే'' అంది మూతి తిప్పుతూ.

''కుక్క కాటుకి చెప్పుదెబ్బ' అన్నారు పెద్దలు. అయినా నిలబడి నీళ్ళు తాగలేనివాడు వొంగుని తీర్థమెళ్ళాడన్నట్టూ తెచ్చిన కొద్దిపాటి సారె పంచలేక లోపల పెట్టేశారు. ఇంకా తేలేదేమిటని సాధింపెందుకమ్మా'' అడిగింది.

''కందకు లేని దురద కత్తిపీటకని నీ కెందుకులుకు''

''గుమ్మడికాయల దొంగంటే భుజాలు తడవుకున్నట్టు బాగానే వుంది వరసకి. ఇక పిల్లని తీసుకుని బయల్దేరమంటారా అత్తయ్యా''

''గుళ్ళో ఏదో చెయ్యకుండా వుంటే గుగ్గిలమేసినంత పుణ్యంకానీ బయల్దేరండి'' అంది దుర్గమ్మ.

''వీధిగుమ్మాన అల్లుడిలా రమ్మంటే దొడ్డిగుమ్మాన్నొచ్చి 'మాధాకబళం' అన్నాడెవరో, అలా వుందత్తయ్యా. చక్కగా తెచ్చిన సారెంతా పంచిపెట్టండి. 'దాచా మగడా వేరుండ' అని వెనకటికో ఇల్లాలు రోజూ కాస్తకాస్త అన్నంకూర

లూ దాచిందిట. చివరికి వేరెళ్లాం అని. చూసేటప్పటికి పాచిపోయి గబ్బుకంపు కొట్టిందిట" అని "అమ్మా జయా! మీ ఆయనతో చెప్పిరా!" అంది.

"వాడితో చెప్పేదేమిటి? నాకు చెప్తే చాలు" అంది తకీమని దుర్గమ్మ.

ఆగిపోయిన జయని లోపలికెళ్ళమని సైగ చేసింది కావేరి.

"వెళ్లొస్తానండీ! మీ ఆరోగ్యం జాగ్రత్త. వేళపట్టున ఇంటికొచ్చేస్తుండండి" అని చెప్పింది.

"ఆ... ఆ అలాగే!" అన్నాడు శశిధర్.

"ఉత్తరాలు రాస్తారుకదూ!" అడిగింది.

"అబ్బే! నాకలవాటులేదు" వెంటనే చెప్పేశాడు.

"ఇప్పుడలవాటు చేసుకోండి. ఎదురుగా వున్నప్పుడు చెప్పలేని భావాలు ఉత్తరాల్లో రాయొచ్చు. ప్రయత్నించండి, చాలా బావుంటుంది" అంది జయ.

వంగి అతని కాళ్ళకి నమస్కరించబోతుంటే "వద్దులే!" అన్నాడు భుజాలు పట్టుకుని.

"మీకిష్టమని జీడిపప్పు పాకం డబ్బాలలో వేసి బెడ్‌రూంలో పెట్టాను. రాత్రిపూట పుస్తకం చదువుకుంటూ తినండి" అంది.

శశిధర్‌కి మనసులో ఏదో మెలిపెట్టినట్టయింది. కానీ అది ఇష్టమయినవాళ్లు వెళ్ళిపోతుంటే కలిగే బెంగని తెలుసుకోలేకపోయాడు. అది అతని తప్పుకాదు. మొదట్నుంచీ గయ్యాళి తల్లీ, ఏమీ పట్టించుకోకుండా తన నరదాల్లో తను మునిగుండే అక్కా మధ్యన పెరిగేడేమో! ఆప్యాయతలూ, అనుబంధాలూ అంటే పెద్దగా తెలియవు.

జయని తీసుకుని చక్రపాణింటికొచ్చారు సుధాకర్‌వాళ్ళు. అందరూ భోజనాలు చేసి స్టేషన్‌కి బయల్దేరారు. కావేరికీ, జయకీ బొట్టు పెట్టి జాకెట్టు బట్టలు పెట్టింది లక్ష్మి. సుధాకర్ చక్రపాణి పిల్లలకో కిలో స్వీటూ, తన పిల్లలకీ, ప్రభ పిల్లలకీ తలో అరకిలో తొక్కుడులడ్డూ కట్టించుకొచ్చాడు.

"ఇంకోరోజుంటే బావుండేది" అని పదే పదే అంది లక్ష్మి.

"మీ గృహప్రవేశానికొస్తాంకదా!" అన్నాడు సుధాకర్.

"మాటలుకావు, తప్పకుండా రావాలి" అని మాట తీసుకుంది లక్ష్మి. లతా, బుజ్జీ పూజని వదల్లేక వదల్లేక వొదిలారు.



రోట్లో కందిపచ్చడి రుబ్బుతోంది తులశమ్మ. "అమ్మమ్మగారూ, వాసన ఘుమాయించేస్తోంది" చెప్పింది మల్లెమొగ్గలు కోస్తున్న జయ. జయ వచ్చినప్పటినుంచీ అప్పుడప్పుడూ మధ్యాహ్నంపూట తులిశమ్మని పలకరించడం, కబుర్లు చెప్పడం మామూలయిపోయింది.

"కందిపచ్చడి చేస్తున్నాను తినాలనుందా?" అడిగింది కళ్ళజోడు పైకి తోసుకుంటూ.

అవునన్నట్టు నవ్వుతూ తలూపింది జయ.

రుబ్బటం పూర్తయి, రోలు కడిగాకా కాసింత అరిటాకులో పెట్టి జయకిస్తూ "కడుపుతోటున్నప్పుడు కోరికలు దాచుకోకూడదు" అంది నవ్వుతూ.

జయ కూడా నవ్వుతూ లోపలికెళ్ళిపోయిందది తీసుకుని. తులిశమ్మ తలవొంచుకుని లోపలికి రాగానే కిటికీ దగ్గర నిలబడ్డ నర్మద కనిపించింది. ఆవిడకి పైప్రాణాలు పైనేపోయాయి.

"ఎన్నాళ్లనుంచీ సాగుతోందీ వ్యవహారం?" అడిగింది కఠినంగా.

"ఎన్నడూ లేదమ్మా, ఇవాళే ఇచ్చాను. ఏదో కడుపుతోటున్న పిల్లకదాని" భయపడుతూ చెప్పింది.

''ఇలా పంపకాలు చెయ్యడానికి మీవారు సంపాదించిన ఆస్తేం లేదండీ ఇక్కడ. మీరు కూర్చుని తింటున్నారు చాలటంలేదా? అయినా ఈరోజంటే నేను త్వరగా వచ్చాను కాబట్టి నా కళ్ళల్లో పడింది. ఇలా ఎన్నిదానాలు చేస్తున్నారో? అయినా తీసుకునేవాళ్ళకుండాలి బుద్ధి!'' అంటూ అంతకంతకూ గొంతు పెంచే యసాగింది.

''నెమ్మదిగా మాట్లాడమ్మా, వాళ్ళు వింటే బావుండదు'' అంది తులిశమ్మ ధైర్యంచేసి.

''ఏం? ఎందుకు బావుండదు? వింటే తెలి సొస్తుంది. వాళ్ళనంటే మీకంత నెప్పిగా వుందా? అవున్లెండి, మాయదారి జబ్బుల వంకతో వాళ్ళకలుసిచ్చారు. వాళ్ళు మీ మొహా నింత జావ పోసినట్టే పోసి నా ఇల్లంతా గుల్లచేస్తున్నారు. ఎళ్లొస్తే సరికాదు బుద్ధుండాలి'' అంటూ వాయించెయ్యసాగింది.

నర్మద గొంతు చిన్నదేంకాదు. అంతా పక్కింట్లోకి వినిపిస్తూనేవుంది. జయ బిక్కచచ్చిపోయింది.

''అత్తగారితో అలాగేనా మాట్లాడడం వొదినా?'' అంది.

''విని నేర్చుకో'' అంది నవ్వుతూ కావేరి.

''నవ్వుతావేంటి వదినా? నాకొళ్ళుమండిపో తోంది. ఈ పచ్చడి తీసుకెళ్లి మొహానపడేసి రానా?''

''దానివల్ల బాధపడేది ఆ ముసలావిడేకానీ ఆ శూర్ఫణఖ కాదు''

''మరేం చెయ్యడం!'' అడిగింది దిక్కుతోచక జయ.

కావేరి మాట్లాడలేదు, పూలు కట్టసాగింది. పక్కింట్లోంచి ధన, ధనా చప్పుడుతోపాటు అంతకంతకూ నర్మద కఠినమైన వాగ్బాణాలు వినిపిస్తూనే వున్నాయి. గేటు చప్పుడుకి తల ఎత్తి చూసింది కావేరి. శంకర్ లోపలికొస్తున్నాడు.

''ఏమండోయ్! ఓసారిలా రండి'' అని పిలిచింది కావేరి.

తన వాటావైపు వెళ్ళబోతున్నవాడల్లా ఆగి వెనక్కొచ్చాడు.

''లోపలికి రండి'' అంది కావేరి.

ఎన్నడూ లేంది ఇలా పిలుస్తోందేమిటి చెప్మా అనుకుంటూ లోపలికొచ్చాడు.

''కూర్చోండి'' అని కుర్చీ చూపించింది.

టీ.వీ. గట్టిగాపెట్టి ''ఏమండోయ్! ఓసారిలా రండి, అన్నయ్యగారొచ్చారు'' అంటూ భర్తని పిలిచింది. సుధాకర్ లోపల్నుండొచ్చి శంకర్‌ని ''హలోసార్'' అని వలకరించి చెయ్యికలిపాడు.

''పక్కపక్క వాటాల్లో వుండటమే కానీ ఒకరికొకరం పరిచయం కూడా కాలేదు'' అన్నాడు నవ్వుతూ.

''అవునవును'' అన్నాడు శంకర్.

ఇంతలో లోపల్నుంచి ప్లేటులో కాజా, అరిసె, కారప్పూస తెచ్చిపెట్టింది కావేరి శంకర్ ముందు.

''ఎందుకిప్పుడివన్నీ. వద్దువద్దు'' అని కంగారుపడ్డాడు.

''ఫర్వాలేదు తీసుకోండి'' అంటూ సుధాకర్ బలవంతంచేశాడు.

''మీ ఇంటికొస్తే పెట్టాల్సొస్తుందనా అన్నయ్యగారూ?'' అంటూ కావేరి బలవంతంచేసింది. శంకర్‌కి తినక తప్పలేదు. ఆ తర్వాత జయ చిక్కని కాఫీ కూడా తెచ్చిచ్చింది. సుధాకర్ ఆ కబురూ, ఈ కబురూ చెప్తూ కూర్చోపెట్టేశాడు చాలాసేపు. వర్ధనమ్మగారు లోపల్నుంచొచ్చి తులశమ్మగారి గుణగణాలు కాసేపు పొగిడింది.

''ఇందాక పిన్నిగారు కందిపచ్చడి చేస్తుంటే మా జయ వాసన బావుందండీ అన్నందుకు కాస్త పంపించారు. మాకు చాలా మొహమాటమేసింది'' అంది కావేరి కావాలనే.

''దాన్దేముందండీ, మణులా, మాన్యాలా, దానికి మీరంత మొహమాటపడక్కర్లేదు'' చెప్పాడు కాఫీగ్లాసు కిందపెడ్తూ శంకర్.

''ఆవిడది చాలా దొడ్డగుణం. మీరు అదృష్టవంతులు... అటువంటి తల్లికి సేవ చేసుకుంటున్నారు'' అన్న కావేరి మాటలకి పాలమారింది శంకర్‌కి.

''అవునవును'' అన్నాడు.

కాసేపటి తర్వాత ఇంటికెళ్ళిన శంకర్‌కు గుమ్మంలోంచే నర్మద కేకలు వినిపించాయి.

మళ్ళీ ఏమైంది బాబూ! అనుకుంటూ లోపలికె ళ్ళాడు.

"వచ్చారా! రండి. మీ అమ్మగారు ఆ పక్కింటివాళ్ళకి ఇల్లంతా దోచిపెడ్తోంది. ఇందాక నేను వచ్చేటప్పటికి కందిపచ్చడి చక్కగా అందిస్తూ పట్టుబడిపోయింది. నేను కష్టపడి రెక్కలు ముక్కలు చేసుకుని సంపాది స్తున్నది ఈవిడిలా దానధర్మాలు చెయ్యడాని కా?" అంటూ అరుస్తున్న నర్మద మాటలకడ్డొ స్తూ "ఛీ! సిల్లీ విషయాలకింత గొడవ చె య్యకు. కాస్త కందిపచ్చడిచ్చినంత మాత్రాన నీ సొమ్మంతా దోచిపెడ్తోందన్నట్టు మాట్లాడ్తావే మిటి?" అని చిరాకుపడ్డాడు.

"అమ్మో! అమ్మో! మీరుకూడా ఇంతలోకీ ఎంత మారిపోయారు? ఆ సంగనాచి తుంగబు ద్ర మీకు కూడా మందేమైనా పెట్టిందేమి టండీ?" అంది ఆశ్చర్యంగా.

కావేరీ, ఆమె భర్తా మాట్లాడిన వైఖరి గుర్తు కుతెచ్చుకుని "ఛీఛీ ఇదిల్లుకాదు నరకం" అంటూ విసుగ్గా బాత్రూంలోకెళ్ళాడు శంకర్.

తులశమ్మకీమార్పు వింతగా అని పించింది. కొడుకెప్పుడూ కోడలితో ఈమాత్రం గట్టిగా మాట్లాడటం ఆవిడ చూడలేదు.

నర్మద నోరు నెప్పి పుట్టేదాకా పక్కింటివాళ్ళ ని, ముఖ్యంగా కావేరినీ, అత్తగారినీ, భర్తనీ అందరినీ కలిపి తిట్టింది. ఆ తర్వాత సుష్టుగా భోంచేసి పడుకుంది.

స్నానంచేసొచ్చిన శంకర్ "అమ్మా! అన్నం తిందాంరా" అని పిలిచాడు.

ఎన్నాళ్ళయింది కొడుకింత ప్రేమగా పిలిచి అని ఆశ్చర్యపోయింది తులిశమ్మ. తనే రెండు కంచాలు పెట్టి వొడ్డించాడు శంకర్. ఆరోజెంతో తృప్తిగా భోంచేశారు తల్లీకొడుకులు.

★ ★ ★

"బెండకాయలు, గోరుచిక్కుడు కాయలూ, వంకాయలు టమోటా" అంటూ కేక విని పించింది.

"వచ్చె వచ్చె" అంటూ మంచంమీద నుంచి లేచి బయటకెళ్ళిన కాత్యాయినికి బు ట్టదింపుకుని నీరసంగా కూర్చున్న గంగ కని పించింది.

"ఏమే అలా వున్నావు? ఒంట్లో బాగాలేదా ఏమిటీ" అనడిగింది. గంగ రెండు మూడేళ్ళ నుంచీ పరిచయం కాత్యాయినికి. రామారావు గారికీమధ్య మార్కెటుకెళ్ళే ఓపికుండటంలే దు. యమున, శరత్ ఏవేళ్టికొస్తారో భరోసాలేదు. అందుకే పదిపైసలెక్కువయినా గంగ దగ్గరే కూరలు కొంటోంది.

"పొద్దుగాల మబ్బుల లేచొచ్చినా, కడుపుల ఏమి లేదు. తిరిగి తిరిగి శోయ లేకుండయిపో బట్టె" అంది గంగ నీరసంగా.

తెల్లవారగట్లే ఇంట్లోంచి బయల్దేరుతుంది గంగ. ఏ పది పన్నెండు గంటలకో ఇంత చాయి, బన్‌రొట్టె కొనుక్కుని తిని సాయంత్రందాకా అమ్మి చీకటిపడ్తుండగా ఏ లారీనో పట్టుకుని సిటీకి దగ్గరగా వున్న వాళ్ళ వూరు చేరుతుంది. ఓపికుండి వొండుకుంటే ఇంత అన్నం, కారం కూడా సత్తుగిన్నెలో పెట్టి తెచ్చుకుంటుంది. లేకుంటే పస్తే.

కాత్యాయినికి జాలేసింది. "పోనీ కాస్తన్నం తింటావుటే?" అనడిగింది.

"అమ్మో! చీకటయితుంది. పిల్లలు ఆకల్తో నుంటారు. తండ్రి ఏయాల్టికెల్తాడో ఆనికే తెలి యదు. జల్దీ తీసుకోంద్రమ్మా" అంది తరాజు చేతిలోకి తీసుకుంటూ.

వంకాయలు ఏరుతూ "ఎంతమంది పిల్లలే?" అనడిగింది.

"ఐదుగురు మగోళ్ళు ఒక ఆడపిల్ల!" అని చెప్పింది.

"మళ్ళీ..." అని అనుమానంగా చూసింది కాత్యాయిని దాని కడుపుకేసి.

"ఔ అమ్మ మల్ల ఇదొక్కటొచ్చి పడాయె, ఆ ముదనష్టపోనికేం తెలుస్తది నా బాధ" అంది కసిగా.

"నీకేంరోగం? ఇంతమందిని కనేబదులు ఆపరేషన్ చేయించుకోరాదు? ఎట్లా పెంచుతా రే మీరు? ఇద్దరికే చస్తున్నారు మా ఇళ్ళల్లో" అంది గట్టిగా కాత్యాయిని.

"ఎట్లయితది నువ్వే చెప్పు! గా ఆపరేసనో, ఏమోగాని చేపించినాకా మంచంమీదకెల్ల

కుండా వండాలంట. నేనట్ల వండితే నాబి డ్డలేం దినాల?'' అనడిగింది తక్కెట కిందపె డ్తూ.

''నీ మొగుడు చూసుకోవాలే ఆ సంగతి. లేకపోతే ఇలా పుడ్తావుంటారు'' అంది విసు గ్గా.

''మా మొగోల్లు మీవాల్లలెక్క కాదమ్మో. ఆడది కష్టంచేసి ఇల్లు నడపాలె. లేకుంటే సావాలె. అంతే! వానికేం పట్టదు. పగలు కష్టంచేస్తడు. సీకటి కాగానే తాగి ఇంటికొచ్చి ఆగమాగము చేస్తడు. పిల్లలు బతికున్నారా, సచ్చిన్రా అన్నది వానికిబట్టదు. తట్టలో కూడు రావాలె, పెండ్లాం కావాలె, మందు కావాలె. ఏమైనా అంటినా ఇక మీదికెగబడ్తడు, ఒల్లంతా సితక తంతడు. తెల్లారి పనిచెయ్యనీ కి చాతగాదు. పిల్లగాల్లని వస్తుపెట్టాలె. గందు కని ఏమనక నాపని నేన్చూసుకుంట. జల్దీ పైసలియ్యమ్మో!'' అంది.

కాత్యాయిని వుసూ రని నిట్టూర్చి పైసలు తేవడానికి లోపలికెళ్ళింది. గంగ లేచి బావిద గ్గరకెళ్ళి ఓ చాదెడు నీళ్ళు తోడుకుని గటగటా తాగి మిగిలినవాటితో మొహం, కాళ్ళూ, చేతు లూ కడుక్కుంది.

''ఇదిగో రూపాయి ముప్పావలా'' అంది కాత్యాయిని.

కొంగుతో మొహం సుబ్రంగా తుడుచుకుని పైసలందుకుంది. బుట్ట తేలిగ్గా వుండటంతో కాత్యాయిని సహాయం లేకుండానే అందుకుని నెత్తిమీద పెట్టుకుని వెళ్ళిపోయింది. అదెళ్ళిన వైపే చూస్తూ నిలబడింది కాత్యాయిని. రెక్కలు ముక్కలు చేసుకుని ఆడది పిల్లలకోసం కష్టప డుతుంది. రేపా పిల్లలు పెద్దయ్యాకా చూ స్తారా! ముఖ్యంగా మగపిల్లలు. పెళ్ళయ్యాకా ఎవరి సంసారాలు వాళ్ళకొస్తాయి. దాంతో స్వా ర్థంపెరిగో లేక వ్యవధిలేకో సొంత తల్లిదండ్రు ల్ని కూడా పట్టించుకోరు. కొంతమంది తమ పిల్లలూ, భార్యా గురించి అతిగా పట్టించుకుని బతుకే వాళ్ళకోసమన్నట్లుగా వుంటారు. ఇంకొంతమంది భార్యా, పిల్లలకింత ప్రాము ఖ్యతివ్వకుండా ఎప్పుడూ వాళ్ళ సరదాలూ, స్నేహితులతో మునిగివుంటారు. మగవాడు బాధ్యత వహించేవాడుగా వుంటే ఆడది అదృ ష్టవంతురాలంటారు. అదేంపట్టించుకోకుండా తిరిగేవాడో, వ్యసనపరుడో అయితే ''మగా ళ్లంతే!'' అని సరిపెట్టుకుంటారు. కానీ ఆడ వాళ్ల విషయంలో అలాకాదు. అది తాళి కట్టించుకున్న మరుక్షణంనుండీ సంసారానికే అంకితమయిపోవాలి. తన ఇల్లూ, తన భర్తా, పిల్లలూ తప్ప బయటప్రపంచంలో ఏం జరు గుతోందో ఆమెకి తెలియకూడదు. భర్త కోరిక తీర్చినందుకు గర్భమొచ్చేది ఆడదానికే. నవ మాసాలు నానా కష్టాలకోర్చి బిడ్డని కంటుంది. ఆ బిడ్డని కంటికి రెప్పలా పెద్దయ్యేదాకా సాకేది ఆడదే. మధ్యమధ్యలో వాడు ముద్దొచ్చి నప్పుడు ఎత్తుకుని కాసేపాడించి ఓ ముద్దుపె ట్టుకుంటారు కొందరు భర్తలు. ఇంతలో వాడే ఒకటో, రెండో చేస్తే ''ఒసే, వీడ్ని తీసుకో, ఛీ, ఛీ'' అంటూ భార్యకందించి దులిపేసుకుని వెళ్ళిపోతాడు. అలా ఆడది చెయ్యగలదా? పిల్లాడికో, పిల్లకో విరేచనాలయి యిల్లంతా పాడుచేస్తుంటే ''వీడ్ని కాస్త చూడండి!'' అంటూ ఎక్కడికన్నా వెళ్ళిపోగలదా? అంతెందుకు చాలా విసుగ్గా వున్నా ''నేను కాస్త అలా అలా తిరిగొస్తాను. మీరు పిల్లల్ని చూసు కోండి'' అని చెప్పి ఎక్కడికన్నా వెళ్తుంటే ''ఎక్కడికి? ఎందుకు?'' అనడగకుండా ఏ భర్తన్నా పిల్లల్ని చూసుకుంటూ ఇంటిపట్టు నుంటాడా? ముఖ్యంగా ఒంట్లో బాలేనప్పుడు రాత్రుళ్ళు నిద్రమేల్కొని, పిల్లల్ని కంటికి రె ప్పలా కాపాడుకునేది తల్లేకానీ తండ్రి కాదు. అందరు తండ్రులూ అలా వుండకపోవచ్చు కానీ కాత్యాయినికి తెలిసిన తండ్రులు అంతే.

పదిహేడోఏట పెళ్ళిచేసి అత్తవారింటికి పంపించారు కాత్యాయినిని. అత్తవారింట్లో నలుగురు మరుదులూ, ఇద్దరు ఆడపడుచు లూ, అత్తగారూ, మావగారూ, మావగారి అక్క గారూ... ఇంతమందుండేవారు. ''నీకు వంటొ చ్చా? ఇంతమందికి చెయ్యగలవా?'' అని ఎవ రూ అడగలేదు. ''మడిగట్టుకుని ఎసరు పడెయ్'' అనత్తగారు ఆజ్ఞాపించింది. ఆపూట నించీ కాత్యాయినికి రెండుపూట్లా వంటా మిగ తా పన్లూ అప్పజెప్పబడ్డాయి. చీటికీ మాటికీ పెళ్ళయిన ఆడపడుచులు పుట్టింటికొస్తుండే వారు. ఏపూటా పది, పన్నెండుమందికి తక్కు

వకాకుండా వుండేవాళ్ళు. వాళ్ళుకాక అప్పుడ పుడూ వేరేవూళ్ళనుండొచ్చిన చుట్టాలూ గట్రా కూడా వుండేవారు. ఓసారి కొత్తల్లో అన్నం చిమిడిపోయింది.

"ఎవరీ అన్నం వొండిందీ?" అనడిగారు మామగారు.

"ఇంకెవరూ, మీ కోడలే" అంది అత్తగారు.

"అమ్మాయ్" అని పిలిచాడు.

ఆ పిలుపుకే గజగజా వొణికిపోయింది కాత్యాయిని. ఆమె బయటికి రాగానే "తీసుకెళ్ళి గోడకి పిడకలా చరుచమ్మా, ఎండాకా వేయించుకోవచ్చు" అని చెప్పి చరచరా వెళ్ళి పోయాడు. అదో హాస్యంలాగా అత్తగారూ, ఆడ బిడ్డలూ పడీపడీ నవ్వేరు.

ఆ రాత్రి కాత్యాయిని ఏడుస్తూ "నాకు పుట్టింట్లో వంట చేసే అలవాటు లేదు. ఇక్కడి కొచ్చాకా అలవాటు చేసుకున్నాను. కానీ ఇంత మందికి నాఒక్కదానివల్ల కావడంలేదు. అత్త య్యగారనలేం చెప్పనేచెప్పరు, నేనే వూహతో చేస్తున్నాను" అంది భర్తతో.

"మరి పుట్టింటినుండి దాసదాసీజనాన్ని తెచ్చుకోపోయావా?" అన్నాడాయన.

కాత్యాయిని మళ్ళీ ఏ కష్టం కలిగినా ఆయనతో చెప్పలేదు. కడుపుతోటున్నప్పుడు కూడా నెప్పులొచ్చేదాకా పెదవి తొణకనిచ్చేది కాదు. బుట్టలో ఆస్పత్రికి తీసుకెళ్ళాల్సిన సామానంతా సర్దుకుని, భర్తకీ మిగతావాళ్లకీ ఇంకో పూటకి కూడా వండిపెట్టి అప్పుడు చెప్పింది "నేను ఆస్పత్రికెళ్ళాలి. నెప్పులెక్కువయ్యాయని"

ఈవిధంగా ఇన్నేళ్ళ సంసారం లాక్కొస్తున్న కాత్యాయినికి భర్తలో మార్పు తెలుస్తూనేవుంది. తనిప్పుడు కాస్త విసుక్కున్నా, ఏదైనా చెప్పినపుడు 'అలా కాదు ఇలా' అన్నా ఒప్పుకుంటున్నాడు కానీ ఇదివరకట్లా అరిచి, కోపగించుకోవడంలేదు. "కాస్త ఆ నీళ్ళు నింపెయ్యండి పంపొచ్చినప్పుడే", "ఆ పాలపాకెట్లు ఇంట్లోకి తీసుకెళ్ళండి", "స్టౌమీద పాలుపెట్టాను కాస్త చూస్తుండండి" అని చెప్పినా నోరెత్తకుండా చేస్తున్నాడు. అదే మునుపయితే అమ్మో...! చెయ్యి చేసుకోడానికి కూడా వెనుకాడేవాడు కాదు. బహుశా ఇది కాలంతెచ్చిన మార్పేమో. ఇద్దరాడపిల్లలూ ఉద్యోగం చెయ్యడం, బాధ్యతగా ఇల్లు నడపడం కూడా ఆయనలో వచ్చిన మార్పుకు కారణమే. "ఆడదానికెందుకే పొగరు" అనేవాడు ఇదివరలో. కానీ ఇప్పుడలా మాట్లాడటంలేదు. యమున ఆఫీస్‌నుండి రాగానే 'అమ్మా! మంచినీళ్ళు కావాలా?' అనడుగుతున్నారు. అప్పుడప్పుడూ 'ఆడపిల్లల చేత ఉద్యోగాలు చేయించాల్సొస్తోంది' అని బాధపడ్తారు. యమునోసారి 'అదేమిటి నాన్నా! మగపిల్లల్ని చదివించినట్టే డబ్బు ఖర్చుపెట్టి మమ్మల్ని చదివించలేదా? వాళ్లలాగే మాకూ తిండీ, బట్టా ఇవ్వలేదా? అలా బాధపడిపోతారెందుకు? మీరలా అన్నప్పుడల్లా మమ్మల్ని చులకన చేసినట్లుగా వుంది. ఇంకోసారలా అనొద్దు. మేమేమీ మగపిల్లలకన్నా తీసిపోలేదు" అని గట్టిగా చెప్పింది. దాంతో ఈమధ్య కాస్త తగ్గించారు.

యమున గుర్తు రావడంతోటే "దాని పెళ్ళి చెయ్యాలి. ఏవయసుకాముచ్చటన్నారు పెద్దలు" అనుకుందా తల్లిమనసు. కానీ అది పెళ్ళి చేసుకునెళ్ళిపోతే ఇంకా రెండున్నరేళ్ల వీడి చదువెలా? అనుకుంది అంతలోనే. పోనీ పెళ్ళి సంబంధాలు చూడడం ప్రారంభిస్తేనో! సంబంధం కుదరడమంటే మాటలుకాదు. అందరాడపిల్లల తల్లిదండ్రులూ కాళ్ళరిగేట ట్లు తిరుగుతున్నారు. తిరగడమొక ఎత్తూ, కుదిరాకా వాళ్ళడిగిన కట్నాలూ, కానుకలూ ఇవ్వడమొక ఎత్తూనూ. కట్నం గుర్తుకు రాగానే గుండెల్లో రాయిపడ్డ భావన కలిగింది. "పాతిక వేలు కాక ఆడపడుచు లాంఛనాలిచ్చాము" అని ఒకావిడా, "నలభై వేలూ, స్కూటరూ అడిగారు" అనొకావిడా చెబుతున్నారీమధ్య. పాతికంటే మరీ హీనమనమాట. పెద్దగా చదువుకోని, ఏదో బతకడానికో వుద్యోగం చేసే వరుడు దొరకచ్చు. అమ్మాయికి చదువుండాలి. ఉద్యోగం చెయ్యాలి అనే కోరికలే కాక ఈమధ్యన ఫలానా బాంకుద్యోగమే కావాలి, సెంట్రల్ గవర్నమెంటులో కూడా ఫలానా ఆఫీస్‌లోనే చెయ్యాలి అని హిరణ్యాక్ష వరాలడుగుతున్నారు. ఇక అందం సంగతి సరేసరి. వాడప్పావక్కడైనా భార్య అద్భుత సౌందర్యరాశి

కావాలి. యమునది కాస్త చామనఛాయ. కావేరి ఫరవాలేదుకానీ యమునకి మరీ తన రంగొచ్చింది. అత్తగారు బతికున్నప్పుడు "కోడలు నలుపయితే కులమెల్లా నలువవుతుందని వూరికే అన్నారా? ఇద్దరాడపిల్లలకీ నీరంగే వచ్చింది. రేపు సంబంధాలు చూసేటప్పుడు తెలుస్తుంది?" అని దెప్పేది. అప్పుడు తనకేం అనిపించలేదు. కానీ ఇప్పుడిప్పుడు భయమేస్తోంది. కావేరికి దేవుడు చల్లగా చూసి మంచి సంబంధం త్వరగానే కుదిరిపోయింది. "అబ్బాయి మంచి పిల్లాడు. స్ఫురద్రూపి, ఉద్యోగం చేసే పిల్ల కావాలట. పెద్దగా కట్నకానుకలాశలేదు. తల్లి మంచావిడ" అంటూ కావేరి మైపు నేర్చుకున్న ఇనిస్టిట్యూటాయన చెప్తే, ఇప్పట్నించీ చూస్తే ఎప్పుడో కుదురుతుందిలే అన్న ఉద్దేశంతో వెళ్ళారు రామారావుగారు. వాళ్ళు వెంటనే చూడ్డానికి రావడం, మర్నాడే నచ్చినట్టు కబురు చెయ్యడం అన్నీ చకచకా జరిగిపోయాయి. తను భయపడ్డట్లు కట్నకానుకలదగ్గర కూడా పెద్దగా పేచీ పెట్టకుండా "మా ఆడపిల్లల ముద్దుముచ్చట్లు మాత్రం తీర్చండి. నేనూ ఆడపిల్లల పెళ్ళిళ్లు చేసినదాన్నే! మీ కష్టం నాకు తెలుసు, కట్నం పేరిట మాకేమీ వొద్దు. బంగారుబొమ్మలాంటి మీ అమ్మాయినివ్వండి చాలు" అందా మహాఇల్లాలు.

వింటున్నది నిజమా లేక కలా! అని ఆశ్చర్యపోయి ఆశ్చర్యంలోంచి కోలుకోగానే వెంటనే రిటైర్‌మెంట్ డబ్బుతో పెళ్లి జరిపించేశారు. పెళ్లికి పదిహేనువేలు ఖర్చయింది. ఇల్లు మరీ పాతగిల్లిపోవడంతో కాస్త బాగుచేయించాల్సొచ్చింది. తనకి పెద్దాపరేషన్ చెయ్యాల్సి రావడంతో దానికి బాగానే ఖర్చయింది. అన్నీ పోగా పదివేలు మిగిలాయి. అవి యమున పెళ్ళికని బాంక్‌లో వేశారు. ఆ పదివేలూ ఓ పక్కకి రావు. ఇంకో యాభైవేలుంటే కానీ సంబంధాల వేటకి బయల్దేరలేము అని ఇద్దరికీ తెలుసు. తెలిసిన వాళ్లందరూ "అమ్మాయికి సంబంధాలు చూస్తున్నారా?" అని ప్రశ్నిస్తున్నారు. నిజమే మరి ఇరవైనాలుగో ఏడు నడుస్తోంది. కావేరికి ఇరవై రెండొచ్చేదాకా చెయ్యకపోతేనే "ఆడపిల్ల సంపాదనకలవాటుపడి చెయ్యట్లేదని" బంధువర్గంలో పుకార్లొచ్చాయి. ఇక ఇప్పటి తమ పరిస్థితి తెలిసినవాళ్ళు అనుకోకుండా ఉంటారా? యమున నలుపైనా దాని కళ్ళు ఎంత పెద్దవి! బారెడు జడ, తలంటు పోసేటప్పుడు తన దృష్టి సోకుతుందేమోనని తను కళ్ళారా చూడదు కూడాను. దాని నవ్వులు చాలు నాలుగు లక్షల విలువ. అయినా కన్నతల్లికలాగే వుంటుందేమో! కాకిపిల్ల కాకికి ముద్దు అని లోకంలో ఏతల్లికి తన కూతురు అనాకారిగా కనపడుతుంది?

"వదినా! కాస్త తోడుకి పెరుగుబిళ్ల పెడ్దూ" అంటూ వచ్చిందెదురింటావిడ.

"అలాగే!" అంటూ ఆవిడ తెచ్చిన గిన్నెతో లోపలికెళ్ళి పెరుగు తెచ్చింది కాత్యాయిని.

"అమ్మాయింకా రాలేదా?" అడిగిందావిడ.

"రాలేదమ్మా! అదే చూస్తున్నాను" అంది కాత్యాయిని అరుగు చివరకొచ్చి చూస్తూ.

"ఈమధ్య తరచూ ఆలశ్యమవుతున్నట్టుందే?" ఆరాగా అడిగింది.

"దానుద్యోగమంటే, బస్సులు దొరికి వచ్చేటప్పటికి అలాగే అవుతుంది" అని ఘాటుగానే సమాధానం చెప్పింది.

"అలాగా! నే వస్తా" అంటూ వెళ్ళిపోయిందావిడ.

కాత్యాయినికి యమునమీద కోపమొచ్చింది. ఈ పిల్ల కాస్త త్వరగా రావచ్చుకదా? ఇలా అందరూ నానా మాటలూ అనే ఆస్కారమెందుకివ్వాలి? నాముందు ఇలా మెల్లగా అడిగింది. వెనకాలెలా మాట్లాడ్తోందో? ఎవరికైనా మచ్చుందని అనుమానమొస్తే చాలు 'అదో పులంటే ఇదో తోక' అంటుందీ లోకం. అద్దాలమేడలో వుంటే ఎవరైనా రాయి విసరొచ్చు. మనజాగ్రత్తలో మనం వుండాలి. ఈవేళ ఆలస్యమెందుకైందో అడిగెయ్యాలీ పిల్లని అనుకుంది.

"అమ్మా! అక్కొచ్చిందా?" అంటూ శరత్ వచ్చాడు.

"లేదురా!" అంది కాత్యాయిని.

"ఊళ్లో గొడవలుగా వున్నాయి. ఎవర్నో లీడర్ని చంపేశారుట! బస్సులవీ తగలబెడ్తున్నారు. ఇదింతవరకూ రాకపోవడమేమిటీ?" అన్నాడు.

"ఓరి దేవుడో! నెమ్మదిగా చెప్తావేమిటిరా? ఇప్పుడీ పిల్ల ఇంటికి రాకపోతే ఎవర్నని అడగడం? మీ నాన్నగారికసలే పొద్దుట్నించీ ఒంట్లో బావుండక మాత్రేసుకుని పడుకున్నారు. అయినా ఆయనమాత్రం ఎక్కడికనెళ్తారు? ఏమని అడుగుతారు?" అంటూ ఘొల్లుమంది.

"నువ్వూరుకో! నేను ఫోనుచేసొస్తాను" అంటూ బయటకెళ్తున్న కొడుకుతో "ఒరేయ్! నువ్వు రోడ్డుమీదికెళ్ళకు" అంటూ హెచ్చరించింది.

"ఏంఫరవాలేదు. మా ఫ్రెండ్ ఇంట్లోనే ఫోనుంది" అంటూ క్షణంలో మాయమయ్యాడు.

"పొడుద్యోగాల పుణ్యమా అని ఈ ఆడపిల్లలు ఓపట్టాన ఇల్లు చేరడంలేదు. భగవంతుడా! ఈ పిల్లకేదైనా అయితే నాకేది దారి? తిరుపతి వెంకటేశ్వరా! నీ కొండ నడిచెక్కుతాను తండ్రీ, ఆంజనేయా! నీకప్పాలు పోస్తాను. సత్యనారాయణస్వామీ! నీ వ్రతం చేసుకుంటాము" అంటూ గుర్తుకొచ్చిన దేవుళ్ళందరికీ మొక్కులు మొక్కింది. మధ్యమధ్యలో తిట్టుకుంటూ, మళ్ళీ అంతలోనే కళ్ళు తుడుచుకుని ఎవరో వస్తున్నట్టుంటే ఆశగా చూస్తోంది. వాళ్ళు తమ ఇల్లు దాటిపోగానే కొంగు ముక్కుకడ్డుపెట్టుకుని వెక్కివెక్కి ఏడుస్తోంది.



శరత్ వస్తోంటే ఆశగా ఎదురెళ్ళి "ఆఫీస్‌లో వుందా? పలికిందా?" అడిగింది.

"ఆఫీస్‌లో ఎవరూ లేరటమ్మా. అందరూ అయిదింటికే ఆఫీస్ వదలగానే ఇంటికెళ్ళిపోయారుట. డ్యూటీలోవున్న ఆపరేటర్ చెప్పింది" అన్నాడు.

"అయ్యో! ఖర్మా! ఎక్కడికని వెళ్ళడం? ఏమని అడగడం? నా పిల్లని ఏ దేవుడు కాపాడ్తాడురా నాయనా!" అంటూ మళ్ళీ భోరుమంది.

"నువ్వూరుకో! నాన్న లేస్తే ఆయన కూడా గాభరాపడ్తారు. ఏడిస్తే పని జరుగుతుందా? ఏదో ఒకటి ఆలోచించాలి. బావావాళ్ళ ఎదురింటికి ఫోన్‌చేస్తాను. ఆఫీను అక్కడికి దగ్గరని అక్కడికేమన్నా వెళ్ళిందేమో!" అన్నాడు.

ఆ మాటలకి ప్రాణం లేచొచ్చినట్టయింది. ఆవిడకి "గమ్మున వెళ్ళిరా, ఇందాకే చెయ్యాల్సింది. నాకు తట్టనే లేదురా తండ్రీ నిజమే! తల్లీ జగదంబా, నా బిడ్డ ఇంటికి రాగానే నీకు కుంకుమార్చన చేయిస్తాను తల్లీ, శుక్రవారాల నోము పట్టిస్తాను" అని నానావిధాలుగా మొక్కింది. వంటింట్లోకి పరిగెత్తుకెళ్ళి, దేవుడి గూట్లో దీపం పెట్టి "తెలియక ఏ అపరాధమన్నా చేస్తే క్షమించు తల్లీ" అంటూ చెంపలేసుకుంది. జపం చేస్తూ కూర్చుందామని జపమాల పట్టుకుని నామం చెయ్యబోతే మనసు నిలువలేదు. కాలు గాలిన పిల్లిలా దొడ్డంతా తిరిగేసింది. ఇందాకొచ్చిన ఎదురింటావిడ కనిపిస్తే "మా పిల్ల రాలేదు, ఊరంతా కల్లోలంగా వుందిట వదినా! మీ ఆయనున్నారా?" అంటూ ఏడుస్తూ అడిగింది.

"అయ్యయ్యో! అలాగా, వుండండి పిలుస్తాను" అని "ఏవండీ" అని పిలిచి "ఫరవాలేదు, యమున తెలివైంది ఏ స్నేహితురాలింటికో వెళ్లుంటుంది. వాళ్ళ వాళ్ల నెవళ్లనన్నా తోడుతీసుకుని వచ్చేస్తుంటుంది. ఖంగారుపడకండి" అంది.

ఆవిడ కాత్యాయిని కళ్లకి నిజంగా దేవతలా కనిపించింది.

ఇంతలో వాళ్ళాయనొచ్చి "మెహదీపట్నం, కాంచన్‌బాగ్, టప్పాచపుత్రా, ఆసిఫ్‌నగర్ అవన్నీ కర్ఫ్యూ ఏరియాలు. మీ అమ్మాయి అట్నుంచేగా రావాలి, చాలా కష్టం! బహుశా అక్కడెవరింట్లోనన్నా ఆగిపోయుండాలి. భానుమూర్తిగారింట్లో ఫోనుందికదా! అక్కడికేదైనా కబురు చేస్తుందేమో, ఇంకాసేపు చూద్దాం. అధైర్యపడకండి" అన్నాడు.

"ఇంతకీ మీ పెద్దమ్మాయి గారింటికెళ్లిందేమో కబురు చెయ్యకపోయారా?" అంది వాళ్ళావిడ.

"మా అబ్బాయి అక్కడికి ఫోన్ చెయ్యడానికే వెళ్ళాడు. అదొక్క ఆశ మిగిలింది" అంటుండగానే శరత్ వచ్చాడు.

"ఏరా, అక్క దగ్గరుందా?" అని ఎదురెళ్లి ఆత్రంగా అడిగింది.

"నువ్వూరికే ఖంగారుపడకు. బావ కూడా కనుక్కుంటానన్నాడు" అనగానే "అక్కడికి కూడా వెళ్లలేదా!" అంటూ కుప్పకూలిపోయింది కాత్యాయిని.

ఈ గొడవకి రామారావుగారు లేచి బయటికొచ్చారు. భార్య ఏడుపూ, చుట్టుపక్కలవాళ్లు చుట్టిముట్టి వుండడం చూసి ఆయన బేజారెత్తిపోయాడు. ఎదురింటాయన ఆయన్ని కూర్చోపెట్టి నిదానంగా జరిగినదంతా చెప్పాడు. పలువిధాల ధైర్యం కూడా చెప్పాడు. "నేవెళ్లి బస్‌స్టాప్‌లో నిలబడతాను" అని ఆయన లేవబోయాడు.

"మీరుండండి. మేమంతా వున్నాంకదా" అని పక్కింటాయన శరత్‌ని తీసుకుని బస్‌స్టాప్ వైపెళ్లాడు.

కాత్యాయిని ఎదురింటావిడ్ని తీసుకుని భానుమూర్తిగారింటికెళ్లింది.

భానుమూర్తిగారి భార్య అంతావిని "అసలు మీ అమ్మాయి ఐదింటినుంచీ ఇంటికిరాక ఏం చేస్తున్నట్టూ?" అనడిగింది కనుబొమలు చిట్లించి.

"అక్కడేం పరిస్థితొచ్చిందో ఏమో! మనకేం తెలుస్తుందీ!" అంది ఎదురింటావిడ.

కాత్యాయినికి తనేం చెప్తోందో తనకే అర్థం కాకుండా "మీకు పుణ్యం వుంటుంది. దయచేసి కనుక్కోండి, కబురొస్తే వెంటనే తెలియజె

య్యండి'' అంటూ చేతులు జోడించి ఏడు స్తోంది. ఆవిడ ''అలాగే, అలాగే'' అంటూ తలూపేసింది.



యమునకి దుఃఖం ఆగట్లేదు. ఇంట్లో పరిస్థితి తనూహించగలదు. తల్లీ తండ్రీ అంతగా ఆరోగ్యవంతులు కారు. పైగా ఖంగారెక్కువ. తమ్ముడు చిన్నవాడు. ఇలా సడెన్‌గా కర్ఫ్యూ పెడ్తారని తనకు మాత్రమేం తెల్సు? మధ్యాహ్నం తన పక్కన పనిచేసే నిర్మల కళ్లు తిరిగి పడిపోయింది. నిర్మలని తీసుకుని తను హాస్పిటల్‌కెళ్ళింది. వాళ్ళేవో పరీక్షలవీ చేశారు. ఆ తర్వాత తను నిర్మలని తీసుకొచ్చి 'వర్కింగ్ విమెన్స్ హాస్టల్లో దింపి బస్‌స్టాప్ కొచ్చేసరికీ ఆరున్నరయింది. బస్‌స్టాపంతా నిర్జీవంగా వుంది.

''ఏమైందబ్బా'' అనుకుంటుండగా పోలీస్ సైరన్, వెంటవెంటనే షాపులన్నీ మూసెయ్యడం, కొంతమంది గుంపుగా పరిగెత్తడం, వాళ్ళని పోలీసులు తరమడం జరిగిపోయాయి.

తను ఒక్కత్తే బస్‌స్టాపులో నిలబడుందనే విషయం తట్టగానే తను గబగబా నాలుగడుగులేసి వెళ్లిపోతున్న ఆటోనొకదాన్ని చప్పట్లు కొట్టి పిలిచింది. ఆటో ఆగలేదు కానీ డ్రైవర్ తల బయటికి పెట్టి ''కర్ఫ్యూ పెట్టారమ్మా, ఆటోలవీ నడపకూడదు, నేనింటికి పోతున్నా'' అని చెప్పి రయ్యిమని వెళ్లిపోయాడు.

రోడ్డుమీదొక్క పిట్టకూడా లేదు. తనకి భయమేసింది. వెనక్కి తిరిగి మళ్లీ స్నేహితురాలి దగ్గరకని బయల్దేరింది. వెనకాలే ఓ వ్యక్తి తనతోబాటే నడుస్తున్నాడు. ఎవరో ఒకరు నడుస్తున్నారు రోడ్డుమీద అంతేచాలు అనుకుంది.

కాస్సేపయ్యాకా అతను చాలా పక్కకొచ్చేసి ''వస్తావా?'' అని లోగొంతుకతో అడుగుతున్నాడు.

యమున బిక్కచచ్చిపోయింది. అరిచి గీపెట్టినా అడగడానికెవరూ లేరు. గబగబా అడుగులెయ్యసాగింది, తన గుండె వేగం తనకే తెలుస్తోంది.

''ఎక్కడికే? ఈవేళ నిన్నెవ్వడూ రక్షించలేడు'' అంటూ తనూ వేగం పెంచాడు వాడు.

చుట్టుపక్కలెక్కడా ఇళ్లు లేవు దూరుదామన్నా. యమున పరుగు మొదలెట్టింది. ఆయాసం, ఏడుపూ కలిపొచ్చేస్తున్నాయి. ఎదురుగుండా ఓ స్కూటరొస్తోంది. గబగబా చెయ్యూపింది, అది ఆగకుండా వెళ్ళిపోయింది. వెనకనించొచ్చినవాడు చెయ్యి పట్టుకున్నాడు. ''అరవకుండా రా, నీకూ నాకూ లాభం'' అన్నాడు. అంత శక్తి ఎలా వచ్చిందో తెలియదు. ఈడ్చి చెంపదెబ్బ కొట్టింది. వాడు కిందపడ్డాడు. అప్పుడు గమనించింది చాలా ముసలిగా వున్నాడు. దగ్గర దగ్గర యాభైఏళ్లు మీదుండొచ్చు. ఇంకాలస్యం చెయ్యలేదు. శక్తికొద్దీ పరిగెత్తింది. ఎదురుగుండా ఓ గుడి కనిపించింది. దానిలోకి పోబోతుండగా ''గుడి మూసే వేళయిపోయిందమ్మా, నేను తాళం పెట్టుకుని వెళ్లిపోతున్నాను'' అన్నాడు పూజారి.

యమున చేతులు జోడించి చెప్పింది ''కర్ఫ్యూ అని నాకు తెలియదు. మా ఇల్లు చాలాదూరం, ఎవడో వెధవ వెంటపడ్డాడు. మీరు కాస్సేపిక్కడే వుండండి'' అని.

పూజారి వెనక్కి తిరిగి చూసి ''అక్కడెవరూ లేందే?'' అన్నాడు.

''ఇప్పటివరకూ వున్నాడండీ, ఇప్పుడే ఎక్కడో నక్కివుంటాడు'' అని చెప్పి రొప్పసాగింది.

''లోపలికి రామ్మా'' అని గొళ్లెంతీసి తనూ లోపలికి నడిచాడాయన. టైము ఏడు దాటిపోతోంది. ఇంకాసేపటిలో ఇంటిల్లిపాదీ గగ్గోలయిపోతారని యమునకి తెలుసు. అది అమ్మవారి గుడి, ''తల్లీ నన్నింటికి చేర్చు, అమ్మా నాన్నల్ని తొందరగా చూడాలి'' అని కళ్లు మూసుకుని దణ్ణం పెట్టుకుని పర్సులోంచి ఐదురూపా

యల కాయితంతీసి హుండీలో వేసింది. పూజారి తీర్థమిచ్చి, ప్రసాదం పెట్టాడు. ఇంతలో పెద్ద చప్పుడుతో ఓ పందమంది కర్రలతో వచ్చేశారు. పూజారి ''అమ్మా నువ్వా విగ్రహం చాటునుండు'' అని చెప్పి బయటికెళ్ళి వాళ్ళతో మాట్లాడుతున్నాడు.

యమున విగ్రహం చాటునుండి భయభయంగా చూసింది. పచ్చినెత్తురుతాగే గూండాల్లా కనిపిస్తున్నారు వాళ్లు. పూజారి చెప్పే మాటలు వినకుండానే ఒకడు ''వెయ్యండిరా'' అనడం. ఇంకోడు కర్రెత్తి కొట్టడం జరిగిపోయాయి. నుదుటిమీంచి రక్తం ధారగా కారిపోతుండగా అమ్మో, అంటూ కుప్పకూలిపోయాడాయన. వాళ్ళందరూ వెంటనే పారిపోయారు.

యమున బయటికొచ్చి, కొంగు చింపి ఆయనకి కట్టుకటింది. ''నా వల్లే మీరు గుడి తెరిచారు. నన్ను క్షమించండి'' అంది ఏడుస్తూ. ఆయన చేత్తో వారిస్తూ ''నాకేం ఫరవాలేదు, నువ్వెళ్లిపో, త్వరగా ఈ మాత్రం వెలుతురుండగానే, దగ్గరలో తెలిసిన వాళ్లుంటే తల దాచుకో, ఉన్మత్తులమ్మా అనలే ఆడపిల్లవి'' అన్నాడు. మూలుగుతూ.

''దగ్గర్లో ఎక్కడైనా ఫోనుందా?'' అడిగింది ఏడుస్తూనే.

''ఉందమ్మా వెనకవైపు ఇళ్లున్నాయి. అందులో ఎర్రడాబా వాళ్లింట్లో వుంది'' అన్నాడాయన లేస్తూ.

యమున గబగబా అడుగులేస్తూ ఆయన చెప్పినవైపు నడక మొదలెట్టింది. పదడుగులెయ్యగానే ఇళ్లు కనిపించాయి. కాస్త ధైర్యమొచ్చింది. వేగం హెచ్చిద్దామనుకుంటుండగా ఒక్కసారి మైకం కమ్మినట్టయి ఒళ్లు తూలసాగింది. కళ్లు మసకలుకమ్మి చమట్లు పట్టాయి.

భారంగా అడుగుతీసి అడుగువేస్తుండగా పక్కనించి రయ్యిమనో మోటార్సైకిల్ వెళ్లింది. కాస్త దూరం వెళ్లి ఆ వ్యక్తి వెనక్కి తిరిగి చూశాడు. మళ్ళీ వెనక్కి తిప్పుకు రాసాగాడు.

యమున మనసు కీడు శంకించింది. మళ్ళీ ఓపిక చేసుకుని పరుగందుకుంది. అయినా అది వేగంగా తన దగ్గరకొచ్చేస్తోంది. బలవంతంగా మూసుకుపోతున్న కళ్లని తెరుస్తూ పరుగుపెట్టడంలో కాలికి బలంగా ఓ పెద్ద రాయి తగిలింది.

ఆ ఎదురుదెబ్బకి ముందుకి తూలి బొక్కబోర్లాపడాల్సిందే. కానీ ఇంతలో అతను నడుంచుట్టూ ఓ చెయ్యి, భుజంచుట్టూ ఓ చెయ్యివేసి పట్టుకున్నాడు.

కెవ్వుమంది యమున.

''నేనే, పిచ్చీ'' అంటూ రెండు చేతులతో ఆమె తల పట్టుకుని బలంగా వూపాడు.

పరిచితమయిన కంఠధ్వనికి నెమ్మదిగా రెప్పలు విప్పింది. తను తన శేఖర్ చేతుల్లో వుంది.''ఇది కలా లేక నిజమా'' అని ఆలోచించే శక్తి కూడా లేదు. ''నేను, ఇక్కడ... నీకు ఎలా...?'' అంటూ వెక్కిళ్లమధ్య మాటరాక, భోరున ఏడుస్తూ అతని బాహువుల్లో వాలిపోయింది యమున.

ఆమె వీపు తలనిమురుస్తూ చెప్పాడు శేఖర్. ''మీ ఆఫీస్‌కి ఐదింటికి ఫోన్ చేస్తే ఎవర్నో తీసుకుని హాస్పిటల్‌కెళ్లావనీ, ఆవిడ హాస్టల్లో వుంటుందనీ చెప్పారు. వాళ్లు చెప్పిన ఎడ్రెస్ ప్రకారం హాస్టల్‌కెళ్తే నువ్వెప్పుడో వెళ్లిపోయావని చెప్పింది నిర్మల. వెంటనే మీ ఇంటికెళ్లి చూశాను. నన్నెవరూ పట్టించుకోలేదు. మీ తమ్ముడెక్కడికో వెళ్ళాడట. అతని ఫ్రండ్‌నను కుని మీ నాన్నగారంతా చెప్పుకొచ్చారు. మీ అమ్మగారు ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లిపోయారు. ఎనిమిదవుతోంది. క్విక్ తొందరగా ఎక్కు. ఇంటికెళ్లాలి'' అన్నాడు. ఎలా ఎక్కిందో యమునకే తెలియదు. ఎక్కగానే అతని వీపు కంటుకుపోయికూర్చుంది.

సందుల్లోంచెక్కడెక్కడనుంచో తీసుకెళ్లి ఇల్లు చేరేటప్పటికి ఎనిమిదిన్నరయింది. మోటర్సైకిలాగగానే జనమంతా రోడ్డుమీదికొచ్చేశారు. యమునని చూడగానే కాత్యాయిని ''వచ్చావా అమ్మా'' అంటూ కౌగలించుకుని కుప్పకూలిపోయింది.

శరత్ ''మీరెవరో దేవుళ్ళాగా అక్కని తీసుకొచ్చారు. చాలా థాంక్స్ సార్'' అంటూ శేఖర్‌తో చెయ్యి కలిపాడు.

''చాలా ప్రమాదం జరగబోయింది. ఆయనుండబట్టి సరిపోయింది. లేకపోతే మీ కూతు

రికివాళ ఆఖరి రోజయ్యేది'' అంటూ ఏడుస్తూ చెప్పింది యమున. అందరూ వేసే రకరకాల ప్రశ్నలకి జవాబులు చెప్పి యమునకి వెళ్లొస్తా నని చెప్పి బయటపడేసరికి తొమ్మిదయింది శేఖర్‌కి.

★ ★ ★

సింధుకి చాలా విసుగ్గా వుంది. ఇంటికొచ్చే టప్పటికి ఎక్కడవస్తే అక్కడ పుస్తకాలు, బొమ్మ లూ, డైనింగ్ టేబుల్‌మీద ఎంగిలిప్లేట్లూ.

''ఈ చిట్టెమ్మ ఎప్పుడొస్తుందో'' అనుకుంటూ ఇల్లంతా శుభ్రం చేసింది.

''ఈమధ్య చిట్టెమ్మ అప్పుడప్పుడూ మూలు గుతోంది. జ్వరమనీ, జలుబనీ ముసుగుపెట్టి పడుకుంటోంది. తను వెంటనే డాక్టరు దగ్గరికి తీసుకెళ్లి మందిప్పిచ్చి, తీసుకొస్తుంది. జ్వరం తగ్గేదాకా బ్రెడ్డూ, పాలూ లాంటివి తనే కలి పిస్తుంది. ఎంత త్వరగా కోలుకుంటే అంత బావుంటుందని ఆలోచిస్తుంది. ఒక్కోసారి కోప మొస్తుంది'' తనకే టైమ్ లేక చస్తుంటే ఇదో ఖర్మా! అనిపిస్తుంది. కానీ లేస్తే మళ్లీ బండెడు చాకిరీ చేస్తుందిలే పాపం! అని సరిపెట్టు కుంటుంది.

చిట్టెమ్మ రెండురోజులయింది వాళ్లమ్మకి బాలేదని వూరెళ్లి. వంటపనీ, అవీ తను ఎలాగో చేసేసుకున్నా పిల్లల విషయం మాత్రం పెద్ద గొడవగా తయ్యారయింది. రమ్యకి తను తల దువ్వితే నచ్చదు. తేజా తను అన్నం పెడ్తే తినట్లేదు. ''నీకు వంట అలవాటు తప్పిపోయి నట్లుంది'' అంటున్నాడు అరుణ్. అంతవ రకూ ఎందుకు? తనకు మాత్రం ప్రతి పనిలో తడువులాడుకోవడమే అవుతోంది. వంటింట్లో ఏ డబ్బాలో ఏమున్నాయో తెలియట్లేదు. ఏమ యిపోయాయో, ఏమున్నాయో అసలే తెలీదు. నెలమధ్యలో చిట్టెమ్మ పప్పయిపోయిందీ, ఉప్పయిపోయిందీ అని చెప్తుంటే తనే దుకా ణంలో ఖాతా తెరిచి, అందులో కావలసినవి తీసుకొమ్మంది. అప్పటినుంచీ ఎంతో హాయిగా అనిపించింది. మొన్న అరుణ్ ''కొట్లో రెండు వేల చిల్లరయింది, మనకంత ఎప్పుడూ అవ లేదు'' అన్నాడు. తను చిట్టెమ్మతో అమాటే అంటే ''పాప బిస్కెట్లయిపోతే గొడవ పె డ్తుందమ్మా, బాబు నాతో వచ్చినప్పుడు ఖరీద యిన చాకలేట్లవీ తీసేసుకుంటాడు. ఇక బాబు గారి బ్లేడ్ల దగ్గర్నుంచీ, మీకు పిన్నీసుల దగ్గ ర్నుంచీ అందిస్తున్నానంటే ఎట్లా అందిస్తున్నా నంటారు?'' అంది కాస్త బాధపడ్తూ. చిట్టెమ్మని ఏమీ అనబుద్ధికాదు సింధుకి. ఎందుకంటే తనకీ ఈమధ్య చిట్టెమ్మచేత తలకి నూనె రాయించుకోవడం, అప్పుడప్పుడు మసాజ్ చే యించుకోవడం, చివరకు చీర కట్టుకోవడంలో కూడా సహాయం తీసుకోవడం అలవాటయిపో యింది. చిట్టెమ్మ వెళ్లిపోతే ఎలా అనే పరిస్థితొ చ్చేసింది. తన జాకెట్లూ, చీరలూ అన్నీ కాస్త పాతగిల్లగానే చిట్టెమ్మ కిచ్చేస్తోంది. చిట్టెమ్మ శుభ్రంగా వుంటుంది. తమ సబ్బుతోనే వొళ్ళు రుద్దుకుని స్నానం చేస్తుంది. తమలాగే టూత్ పేస్ట్, షాంపూ, పౌడరూ, స్నో అన్నీ వాడు తుంది. ఇవన్నీ తనకి మొదట ఇబ్బందిగా అనిపించినా ఇప్పుడలవాటయిపోయాయి. బహుశా! ఆమెతో అవసరమో లేక దగ్గరత నం పెరగడంవల్లనేమో. తను కూడా కొన్ని విషయాల్లో చనువుగా కలగజేసుకుని సలహా ఇస్తుంటుంది. ''పెద్ద పెద్ద వాళ్లొస్తుంటారు, కర్టెన్లు పాతబడ్డాయి. కొత్తవి తీసుకుందాం'' అంటుంది. ''అయ్యగారీమధ్య సిగరెట్లు ఎక్కువే తాగుతున్నారు, ఆరోగ్యం పాడవు తుంది వద్దని చెప్పండీ'' అంటుంది. ''పాపకి పరీక్షలొస్తున్నాయి. కాస్త దగ్గర కూర్చోపెట్టుకుని చెప్పండీ, నాకు చదువొస్తే నేనే చెప్పేదాన్ని'' అంటుంది. అన్నీ ఇంట్లో మనిషిలా కలగజేసు కుని చెప్పడం, తనకు వినడం అలవాటయిపో యింది.

''ఎవరు చెప్పినా విననిదానివి, చిట్టెమ్మ చెప్తే మాత్రం వింటావు'' అన్నాడోసారి అరుణ్.

''మంచేగా చెప్తోంది. వింటే తప్పేమిటి?'' అంది తను.

ఓసారి ఆనంద్. అతని భార్యా వచ్చారు. అతను కూడా అరుణ్ ఆఫీస్‌లోనే పనిచేస్తాడు. వాళ్ళింట్లో సత్యనారాయణవ్రతం, భోజనాలూ అని పిలిచింది వాళ్ళావిడ. ఆమె చాలా ముభావంగా వుంది. వచ్చినప్పటినుండీ అస హనంగా కూడా వుంది. అరుణ్ లేకపోబట్టి తనే ఆనంద్‌తో మాట్లాడవలసివచ్చింది. అత ను ఇంగ్లీషులో మాట్లాడ్తుంటే తను ఇంగ్లీష

లోనే సమాధానం చెప్తోంది. తనకి కాలేజ్‌లో లెక్చరివ్వడం అలవాటు మూలాన ఎవరితో నైనా గబుక్కున ఇంగ్లీషే వచ్చేస్తుంది. తాము మాట్లాడుకునేది ఆవిడకర్థం కాదనేమో విసుగ్గా చూస్తూకూర్చుంది.

ఇంతలో చిట్టెమ్మ కాఫీ తెచ్చింది.

''వద్దు'' అంది ఆవిడ.

''పోనీ పాలు కానీ, జ్యూస్ కానీ...'' అని తనంటుంటే ''నేను బయట చేసినవి తిననూ, తాగనూ'' అంది చిట్టెమ్మని చూస్తూ.

దాని భావం తనకర్థమయిపోయింది. ఇంక తను ఫోర్స్ చెయ్యలేదు. రెండు నిమిషాలు ముళ్ళమీద కూర్చునట్టు కూర్చుంది. వెళ్ళిపో యారు వాళ్ళు.

చిట్టెమ్మొచ్చి ''ఆమె తీరు అంతగా బాలేద మ్మా, సరిగ్గా పిలవనుకూడా లేదు. ఇంక వెళ్తే ఏం మర్యాద చేస్తుందీ, వొద్దు'' అంది. తనకీ వెళ్ళాలనిపించలేదు వెళ్లలేదు. అరుణ్ కార ణమడిగితే చెప్పి ''చిట్టెమ్మ కూడా ఇలాగే అంది'' అంది. అతనోరకంగా తనవైపు చూసి వెళ్ళిపోయాడు. ''చిట్టెమ్మ మాటంటే నీ కంత విలువా'' అన్నట్టుగా అన్నమాట.

''మమ్మీ, మమ్మీ ఈరోజు డాడీ రాగానే బయటికెళ్దాం'' అంది రమ్య. నిజమే! చాలా రోజులయింది ఎక్కడికైనా వెళ్లి. అరుణ్‌కి సర దానేగా పిల్లలతో బయటికెళ్లడం. తనూ వంట తప్పించుకోవచ్చు అనుకుంది సింధు. లేచి ఫోన్ చేసింది అరుణ్‌కి. అవతలనించి ఆపరే టరు గొంతు తియ్యగా పలికింది. తను ఫలానా అని తెలియగానే విష్ చేసింది. ''సార్ ఒబె రాయ్ హోటల్లో కాన్ఫరెన్స్ కెళ్లారు. ఇంటి నించి ఫోనొస్తే లేటవుతుందని చెప్పమన్నారు'' అంది. ఊసూ రంటూ ఫోన్ పెట్టేసి పిల్లలతో చెప్పింది.

తేజా చిందులు తొక్కి ''వెళ్దాం ఎక్కడికన్నా వెళ్దాం'' అంటూ గొడవ చెయ్యసాగాడు. రమ్య కూడా చిన్నబుచ్చుకుంది. ''సరే పదండి'' అంటూ తను తయారయి, వాళ్ళని రెడీచేసి బయటికి తీసుకెళ్ళింది. ముందు హోటల్‌కె ళ్లి టిఫిన్ చేశారు. అక్కడినుండి ఇందిరాపా ర్కు కెళ్లారు. పిల్లలు కాసేపాడుకున్నాకా ''ఐస్ క్రీం'' అంటూ వచ్చారు. తను కొనడానికి పర్స్‌తీసి డబ్బులు తీసింది. వాటితోపాటే ఓ కాయితం కూడా కిందపడింది. ఏమిటా? అని తీసిచూస్తే అది కావేరి ఎడ్రెస్. ఇక్కడికి దగ్గ రేగా ఓసారి వెళ్తే? అనుకుంది. మళ్లీ ఇంత తీరుబడి ఎప్పటికి దొరికేను అనుకుంటూ పిల్ల లకి ఐస్‌క్రీమ్ పెట్టించి, ఓ పెద్ద బిస్కెట్ పేకెట్టు కొనుక్కుని టి.వి.యస్.మీద ఎడ్రెస్ వెతుక్కుంటూ బయల్దేరింది.

తొందరగా దొరికింది ఇల్లు. కొంతమంది పిల్లలు బయట ఆడుకుంటున్నారు, ''బాబూ ఇక్కడ కావేరి అనీ...'' అనడుగుతుంటే ''మా మమ్మీయే రండి ఆంటీ'' అంటూ చెయ్యిబట్టి లాక్కెళ్ళిందో ఆరేళ్ల పిల్ల.

అదో నాలుగ్గదుల పోర్షన్. ఎల్ షేపులో నీట్‌గా వుంది. ''బామ్మా మమ్మీ ఫ్రెండ్'' అంటూ వాళ్ళ బామ్మగారి దగ్గరకు తీసుకె ళ్లింది. ఆవిడ లేచి అలాగా రా అమ్మా, కూర్చో'' అంటూ కుర్చీ జరిపి మర్యాద చేసింది.

''వెళ్ళి అమ్మను రమ్మను'' అని మనవరాలి కి చెప్పి వచ్చినమ్మాయిని నఖశిఖ పర్యంతం చూసింది.

''గులాబీరంగులో, పెదవులకి ఎర్రని లిప్ స్టిక్, పెద్ద సిగ, సిగలో ఎర్రగులాబీ, కలకత్తా కాటన్ పెద్ద బోర్డరు చీరా, చెవులకి పెద్ద పెద్ద రింగులూ చూడగానే స్టయిలుగా కనిపిస్తున్నా మంచి హుందాగా వుంది. ''భగవంతుడు కష్టపడి మలచిన అందమైన బొమ్మ'' అను కుందావిడ.

ఇంతలో కావేరి బయటికొచ్చి ''ఓహ్ మీరా, నేననలు వూహించలేదు. ఏమిటీ విచిత్రం! నాకు చాలా సంతోషంగా వుంది'' అంది చేయి పట్టుకుని వూపేస్తూ. మళ్ళీ అంతలోనే ''అత్త య్యా, నేను చెప్పలేదూ సింధు అని నా బస్‌మేటు, పెద్ద పోస్టులో వున్నారని, ఈవిడే'' అంటూ సంతోషంతో వుక్కిరి బిక్కిరిగా చె ప్పింది.

ఆ పరిచయానికి సింధు గలగలా నవ్వింది. వెంటనే వాళ్లత్తగారు లేచి నిలబడి ''మీరేనా! మా కోడలెప్పుడూ చెబ్తూ వుంటుంది'' అంది.

"అయ్యయ్యో! కూర్చోండి పెద్దవారు" అంది సింధు. ఆవిడ కూర్చుని సింధు గురించి కోడలు ఎంత గొప్పగా చెప్తుందో వర్ణించి చెప్పసాగింది. పిల్లలప్పుడే పూజ ఆటసామాన్ల బుట్ట దగ్గర బిజీ అయిపోయారు.

"ఇప్పుడే వస్తా!" అంటూ కావేరి లోపలికెళ్లింది. ఇంతలో జయ రెండు గ్లాసులతో మంచినీళ్లు తెచ్చిచ్చి "మీరేనా సింధు, మా వదిన మీ గురించి చాలా చెప్పింది" అంది.

సింధు నవ్వుతూ "మంచిగానా? చెడుగానా?" అంది. "మంచిగానే, మీ కసలు గర్వంలేదనీ, మంచి కలుపుగోలు స్వభావమనీ" అని ఓ నిమిషమాగి నెమ్మదిగా "జయప్రదలా వుంటారనీ" అంది.

"సింధు ఇబ్బందిగా మొహంపెట్టి "చివరిది అబద్ధంకదూ!" అంది.

"లేదు, లేదు దానివల్లే మీరు సింధు అని గుర్తుపట్టాను చూడగానే" అంది.

"మీ వదిన మీ గురించి కూడా చెప్పింది, నాకో చక్కని ముద్దొచ్చే ఆడపడుచుందనీ, ఆమె త్వరలోనే ఓ ముద్దొచ్చే పాప నియ్యబోతోందనీ" అని నవ్వేసింది సింధు.

వర్ధనమ్మగారు లేచి వంటింట్లోకెళ్లి, కిటికీ దగ్గరకెళ్లి గట్టిగా "చూడవే ఆవిడ గొప్ప ఇంజనీరయినా, డాక్టరు పట్టా కూడా పుచ్చుకుంటున్నా ఇసుమంతైనా గర్వంలేదు. ఎంత కలివిడీ, ఎంత మర్యాదా. అలా వుండాలి ఆడపిల్లన్నాకా, పెద్దలూరికే అన్నారా? అన్నీ వున్న ఆకు అణిగి మణిగివుంటుందీ, ఏమీ లేని ఆకు ఎగిరి ఎగిరి పడ్తుందీ అని" అంటోంది.

పకోడీలు ప్లేట్లో పెడ్తున్న కావేరికి తెలుసు, నర్మద బయట కిటికీ దగ్గరే నిలబడి కాఫీ తాగుతోందనీ, ఈ మాటలన్నీ వినిపిస్తున్నాయనీ, సింధు టి.వి.యస్. ఆపి దిగుతున్నప్పుడే నర్మద చూసింది. "ఇంత అందంగా, స్టైలుగా వున్నావిడ ఎవరా?" అన్న కుతూహలంతో బయటే నిలబడింది. వర్ధనమ్మ మాటలు ఎక్కడ తగలాలో అక్కడే తగిలాయి. దాంతో చివాల్న లోపలికెళ్లిపోయింది మొహం ముడుచుకుని.

కావేరి పకోడీల ప్లేటుతో బయటికి రాగానే "ప్లీజ్, నన్ను మొహమాటపెట్టి తినిపించాలని చూడొద్దు. పొట్టలో అన్నలు స్థలం లేదు. ఇప్పుడే పిల్లలతో హొటల్కెళ్లొస్తున్నాను" అంది. జయ బలవంతం చెయ్యబోతే కావేరి వారించింది. వర్ధనమ్మగారు కాఫీ కప్పులతో వచ్చి అందరికీ ఇచ్చింది. కావేరీ, సింధూ, జయా కాసేపు పిల్లల గురించీ, అల్లరి గురించీ కబుర్లు చెప్పుకున్నారు.

ఇంతలో ప్రభ సుడిగాలిలా వచ్చి "వదినా! మా బాబినీ, అపర్ణనీ కాసేపిక్కడ ఆడుకోనీ, నేనెదురింటావిడతో మార్కెటుకెళ్తున్నాను" అంది.

"నీకు మార్కెటెందుకే? అసలు వంటే చెయ్యవుగా!" అంది జయ నవ్వుతూ.

ఆ శ్లేష పట్టించుకోకుండా "అబ్బా, కూరగాయలకోసం కాదులే! పక్కింటావిడ కొన్నిలాంటి కర్టెన్లు కొనుక్కోవాలట ,మా ఎదురింటావిడ. తోడెళ్తున్నాను" అంది.

కావేరి ప్రభని సింధుకి పరిచయం చేసింది. ప్రభ నమస్కారం చేసి, రెండు పకోడీలు నోట్లో వేసుకుని "ఈ చీరెక్కడ కొన్నారు? చాలా బావుంది" అంది.

"తెలియదు! మావారు తెచ్చారు థాంక్స్" అంది.

ప్రభ తల్లిచ్చిన కాఫీ ఆదరాబాదరా తాగేసి "రాత్రికేదైనా కూర పంపించొదినా! పొద్దుటివేం మిగలలేదు" అంటూ హడావుడిగా వెళ్ళిపోయింది. సింధు కావేరివైపు చూసి అర్థవంతంగా నవ్వింది.

సుధాకర్ వచ్చేవరకూ కూర్చుని, పరిచయాలయ్యాక "చాలా సేపయింది, నేవెళ్ళొస్తా" అంటూ బయల్దేరింది. పిల్లలకింకా ఆడుకోవడం తనివి తీరలేదు, బులుస్తూనే బయల్దేరారు. "మీరు మీ కోడలితో మా ఇంటికి రావాలి" అంది వర్ధనమ్మనీ, జయనీ చూస్తూ.

"అలాగే! నువ్వు కూడా వస్తూ వుండమ్మా!" అందావిడ ఆప్యాయంగా.

కావేరి సింధుకి బొట్టుపెట్టి మల్లెపూల చెండిచ్చింది. సింధు వెంటనే సిగచుట్టూ పెట్టుకుంది. మనసులు కలిసినచోట అరమరికలుండవు.

సుధాకర్తో కూడా చెప్పి గేటువరకూ

వచ్చింది సింధు. కూరలు కొంటున్న తులిశమ్మ పక్కకి తప్పుకుంటూ "బంధువులమ్మాయా?" అడిగింది జయని.

"కాదు వదిన స్నేహితురాలు. సింధూర ఆవిడ పేరు, ఇంజనీరింగ్ కాలేజీలో లెక్చరర్" అంటూ గొప్పగా చెప్పింది.

అప్పటికే సింధు టి.వి.యస్. స్టార్ట్ చేస్తోంది. ఆవిడ కళ్లజోడు పైకి తోసుకుంటూ నాలుగడుగులేసి "ఎవరూ? సింధూ!" అంది.

సింధు వెనక్కితిరిగి చూసి "మీరూ... ఎక్కడో చూసినట్టుంది" అని "తులిశమ్మత్తయ్యకదూ!" అంది.

అంతలోనే ఆవిడొక్కవుదుట్న సింధుని కావలించుకుని "నా బంగారు తల్లీ! ఎన్నాళ్ళయిందే చూసి, అమ్మ బావుందా? అన్నయ్యలెక్కడున్నారు?" అంటూ ప్రశ్నలు వేసింది.

"అన్నయ్యలిద్దరూ అమెరికాలో వున్నారు. అమ్మ కూడా వాళ్ల దగ్గరే వుంటోంది. అప్పుడప్పుడూ గుంటూరొచ్చి పెద్దమామయ్య దగ్గరో ఆర్నెల్లూ, నా దగ్గరో ఆర్నెల్లూ వుంటూ వుండేది. ఇప్పుడు రెండేళ్ళయిందొచ్చి. మళ్ళీ ఈ సంవత్సరం రమ్మని రాశాను" అంటూ గడగడా చెప్పి, ఓ నిముషమాగి "కావేరీ ఈవిడ మా మేనత్త, నాన్నగారు అమెరికా వెళ్ళాకా, మేము మా మేనమామల దగ్గరకెళ్ళిపోవడం, అక్కడే మాకు అన్నీ సెటిలయి, పెళ్ళిళ్లూ, అవీ అయిపోవడంతో టచ్ పోయింది. నా పెళ్లికి కూడా అత్తయ్య రాలేదు. తర్వాత నాన్నగారు పోయినప్పుడొచ్చి చూసెళ్ళిపోయిందంతే! మళ్ళీ ఇన్నాళ్లకి అనుకోకుండా కలిశాం. మీరిక్కడున్నట్టు ఒక్కమాట కూడా నాకు తెలియబర్చలేదెందుకూ?" అడిగింది.

"శంకరం బావకీ వూరు ట్రాన్స్ఫరు పెట్టుకున్నాకా మీకు కబురు చెయ్యడం కుదరలేదే! కోడలికీ వూరు బ్యాంక్‌లో ఉద్యోగం, ఇద్దరు పిల్లలూ, రా లోపలికి" అంటూ చేటంత మొహం చేసుకుని పిల్చిందావిడ.

సింధు పిల్లల్ని తీసుకుని మళ్ళీ లోపలికి నడిచింది.

"అయినవాళ్ళింతకాలం కలుసుకోకుండా ఎలా వున్నారమ్మా?" అని ఆశ్చర్యపోయింది. వర్ధనమ్మ.

"పోనీలెండి, ఈ రూపకంగానన్నా కలుసుకున్నారు" అంది సంతోషంగా కావేరి.

"ఒరేయ్! శంకరం, ఎవరొచ్చారో చూడు" అని కేకలు పెడ్తూ లోపలికెళ్లింది తులిశమ్మ.

"అమ్మమ్మగార్నింత సంతోషంగా ఎప్పుడూ చూడలేదు నేను" అంది జయ.

శంకరం సింధూరని చూసి చాలా ఆశ్చర్యపోయాడు. "మీ మావయ్యోసారి కలిసి బెంగుళూరులో ఇంజనీరింగ్ చేస్తున్నావని చెప్పాడు. నీ పెళ్లికి కూడా రాకపోవడంతో మీ సంగతులు తెలియలేదు. ఈ ఊళ్లో వున్నావని తెలిస్తే తప్పకుండా అమ్మని తీసుకొచ్చేవాడిని" అన్నాడు.

నర్మదని పరిచయం చేశాడు. తనకంటే పెద్ద ఉద్యోగస్తురాలని తెలియగానే నర్మద ముఖం వివర్ణమయిపోయింది.

సింధు తులిశమ్మగారి భుజంమీద చెయ్యేసి "అత్తయ్యా మీ పల్లెటూరిలోనే వుందనుకుంటున్నానిన్నాళ్లూ. అమ్మీసారొస్తే ఎడ్రెస్ తెలుసుకుని వెళ్దామని కూడా రాసింది ఉత్తరంలో. ఇక్కడే వున్నారని తెలిస్తే చాలా సంతోషిస్తుంది" అంది ఆనందంగా.

శంకరం కూడా చాలా సంతోషపడ్డాడు సింధు ఆప్యాయతకి. పిల్లల్ని దగ్గరకు తీసుకుని ముద్దు చేశాడు.

"అబ్బాయేం చేస్తాడే?" అడిగింది తులిశమ్మ.

"ఆయనా ఇంజినీరే అత్తయ్యా" అని అరుణ్ పనిచేసే కంపెనీ పేరు చెప్పింది. నర్మద టీ తీసుకొచ్చింది.

తులిశమ్మగారే అందుకుని "ఈ పూట కుండి భోంచేసెళ్లు. ఆలస్యమయితే బావ దింపుతాడు" అంది.

ఆవిడ చేతిలోంచి టీ కప్పు తీసుకుంటూ "ఈసారి కొదిలెయ్. ఆయన్ని తీసుకుని వస్తాను" అంది.

మళ్ళీ వాళ్లు చుట్టాల గురించీ వాళ్లెక్కడెక్కడుంటున్నదీ కాసేపు చర్చించుకున్నారు. "బావా, రేపాదివారం మీరంతా మా ఇంటికి రావాలి"అని ఆహ్వానించింది సింధు.

# ఏరిన ముత్యాలు

★ నేను కొంగను గురిచూసి తుపాకితో కాల్చి చంపడంలోకన్నా అది ఆకాశంలో హాయిగా ఎగురుతూ వుంటే ఎక్కువగా ఆనందిస్తాను. పికిలిపిట్టను వండుకొని తినడంకన్నా అది ఆకాశంలో ఎగురుతుంటే చూసి ఎక్కువగా ఆనందిస్తాను.

-- రస్కిన్

★ కడుపు కాలుతున్న నిరుద్యోగికి వ్యక్తి స్వాతంత్ర్యం గురించి చెప్పడం వ్యర్థం... అర్థరహితం.

-- జోసెఫ్ స్టాలిన్

★ కడుపుకాలేవాడు దేవుణ్ణి పూజించలేడు.

-- డబ్ల్యు. విల్సన్

★ ఆకలి వేసేవాడికి అన్నమే పరబ్రహ్మ.

-- గాంధీజీ

★ మనిషి ఆకలితో ఉన్నప్పుడు అభిమానం, కులం, విద్య, జ్ఞానం, హెూదా, అనురాగం అన్నీ మర్చిపోతాడు.

-- అవ్వైయార్

★ అబద్ధంవల్ల ఒకరి ప్రాణం రక్షింపబడితే అది పాపంకాదు... పుణ్యం.

-- ప్రేమ్‌చంద్

★ ఆచారమనే మట్టిదేవతను బద్దలుకొట్టి నూతన సత్యములను, నూతన ధర్మముల ను స్వీకరించినప్పుడే ఏజాతైనా అభివృద్ధి చెందుతుంది.

-- ఇబ్సన్

★ చట్టాలను చేయడం ప్రపంచానికి పరిపాటి, కాని ప్రపంచం ఆచారాలనే పాటిస్తుంది.

-- మాంటెయిన్

★ పురుషుల సాహచర్యంలేని స్త్రీలు వాడిపోతారు. స్త్రీ సాహచర్యంలేని పురుషులు మూఢులవుతారు.

-- చెకోవ్

★ పిల్లల భవిష్యత్తుకోసం స్త్రీ తన భర్తను ప్రేమిస్తుంది. భార్యకోసం పురుషుడు తన పిల్లల్ని ప్రేమిస్తాడు.

-- షిర్లే

★ ప్రతి మగవాడూ తనగొప్ప చెప్పుకోవడానికి మరొకర్ని వెతికితే ప్రతి స్త్రీ తన తలమోపడానికి మరొకరి భుజం వెదుకుతుంది.

-- మెన్‌కిబ్

★ అహింస అనేది సర్వప్రాణులకు మేలుకోరే తల్లిలాంటిది.

-- వర్ధమాన మహావీరుడు

---

సేకరణ: నల్లబెల్లి శ్రీమన్నారాయణ

---

"అబ్బాయిని తీసుకుని మా ఇంటికి నువ్వే రావే" అంది తులిశమ్మ మొహమాటంగా.

"అదేవిటమ్మా, అంత ప్రేమగా పిలుస్తుంటే" అని మందలించాడు శంకరం. "తప్పకుండా వస్తాం" అన్నాడు సింధుతో.

నర్మదతో కూడా "వెళ్ళొస్తా"నని చెప్పి బయటికొచ్చింది సింధు. కావేరీవాళ్లు వరండాలోనే కూర్చునున్నారు. "అత్తయ్యని చూసిన సంతోషంలో ఈ పిన్నిగార్ని మరిచిపోకమ్మా" అంది వర్ధనమ్మ.

సింధు నవ్వేసింది.

సుధాకర్‌తో చెప్పాడు శంకరం "మా మామయ్య కూతురు, బంధుత్వం దగ్గరే కానీ రాకపోకలు లేక ఒకళ్ల సంగతులొకళ్లకి తెలియవు, ఇన్నాళ్లనించీ" అని.

"ఇప్పటికన్నా కలిశారు. చాలా మంచిరోజి వాళ" అన్నాడు సుధాకర్.

సింధు అందరికీ మరోసారి చెప్పి బయల్దేరింది.

సింధు వెళ్ళాకా కూడా ఆమెని గురించే చాలాసేపు మాట్లాడుకున్నారు రెండిళ్ళవాళ్ళూ. తులిశమ్మగారు ఉత్సాహంగా మేనమామ గురించీ, అతని తెలివి తేటల గురించీ, పిల్లల ప్రయోజకత్వాల గురించీ శంకరానికి చెప్తూనేవుంది

"వాళ్ళ గురించి చెప్పుకుని కడుపు నింపుకోడమేనా? వంట చేసేదేమైనా వుందా?" అడిగింది నర్మద కటువుగా.

తులిశమ్మగారు టక్కున లేచి వంటింట్లోకెళ్ళిపోయింది. శంకరం బయటికి నడిచాడు.

★ ★ ★

శేఖర్‌కి చాలా అసహనంగా వుంది. సిగరెట్ తీసి వెలిగించాడు. ఫోన్ చేస్తే యమున రావడానికి కుదరదంది. కర్ఫ్యూరోజు తరువాత ఆమె చాలా మారిపోయింది. బహుశా ఇంట్లోవాళ్ళు కట్టడి చేసుంటారు. ఆఫీసొదిలాకా నిమిషం కూడా ఎక్కడా గడపట్లేదు. వాళ్ళమ్మగారికి అప్పట్నుండీ వొంట్లో బావుండటంలేదనీ, త్వరగా వెళ్ళి వంటదీ చెయ్యాలనీ తను ఫోన్ చేసినప్పుడల్లా ఏదో ఓ వంక చెప్తోంది.

ఆఫీసు వదిలేవేళ్టికెళ్తే "ఈరోజు రావడానికి కుదరదు. ఏమీ అనుకోకండి" అంటూ తుర్రుమంటోంది.

ఆమె సంగతలా వుంటే ఇక తల్లి సంగతి మరోలా వుంది. ఎవరో సంబంధం తెచ్చారు. చూడ్డానికి రమ్మనో అసలు పెళ్ళిందుకు చేసుకోవో చెప్పమనో వేధిస్తోంది.

పులిమీద పుట్రలా పెద్దమావయ్య వాళ్ళ ఆఖరుది పెళ్ళీడుకొచ్చిందనీ మేనరికం చేసుకొమ్మనీ రాయబారం పంపాడు. ఆయనది గుంటూరులో పొగాకు వ్యాపారం. బాగా సంపాదిస్తూ ఇన్నాళ్ళూ అందర్నీ దూరంపెట్టాడు. ఈమధ్యే పెళ్ళిలో శేఖర్ని చూసి అల్లుడిని చేసుకోవాలని మురుస్తున్నాడు. నాన్నగారికంత ఇష్టం లేకపోయినా ఆడవాళ్ళకి పుట్టింటిమీద మమకారం మెండుకదా! "మామయ్య లక్షలు గడించాడు. ఇద్దరూ ఆడపిల్లలే. శిరీషని చేసుకో. కొడుకయినా, అల్లుడైనా నువ్వేననుకుంటాడు" అని నూరిపోస్తోంది.

"ఇన్నాళ్ళూ అక్కరలేనివాళ్ళం ఇప్పుడు కావలిసొచ్చామా మనం! అయినా మేనరికాలు నాకిష్టంలేదు" అని ఖచ్చితంగా చెప్పేశాడు తను.

"సరే అయితే! బయటి సంబంధాలు బోలెడొస్తున్నాయి. నువ్వు చూడటానికి కూడా రాకపోతే మీ అబ్బాయికేం అవకరం? అని అడుగుతారందరూ" అంటూ సాధిస్తోంది.

ఈరోజు పొద్దుటే అమ్మాయి హైద్రాబాదు చూడాలంటోంది. ఒక్కదాన్నీ పంపిస్తున్నాను. ఆదివారం పొద్దుట స్టేషన్‌కెళ్ళి తీసుకొచ్చుకొమ్మని మావయ్య వుత్తరం పంపాడెవరితోటో. అమ్మ బోలెడు సంబరపడిపోతోంది. ఆడపిల్ల దగ్గరగా మసిలితే కొడుకు కరిగిపోతాడనుకుంటోంది కాబోలు! అయినా ఆవిణ్ణనుకుని ప్రయోజనం లేదు. యమున సంగతి ఇక దాచకూడదు. సిగరెట్ వేలు చుర్రుమనిపించడంతో ఆలోచన్లలోంచి బయటపడి అదవతల పారేశాడు. ఏమయితే అదయిందని స్కూటర్ స్టార్ట్‌చేశాడు.

అనుకోకుండా శేఖరు ఇంటికొచ్చేటప్పటికి అవాక్కయిపోయింది యమున.

శేఖర్ని గుర్తుపట్టి "బావున్నావా నాయనా!

ఇదిగో అప్పట్నుంచీ ఇలా మంచంమీదే వున్నాను. ఆయాసం ఎక్కువయిపోయింది'' అంది కాత్యాయిని.

యమున మౌనంగా మంచినీళ్ళు అందించింది.

''ఎందుకొచ్చారు?'' అని కళ్ళతో ప్రశ్నిస్తోంది.

''నాన్నగారు లేరా?'' అడిగాడు.

''గుడికెళ్ళారు. తమ్ముడు లైపుకెళ్లాడు''

మంచినీళ్ళ గ్లాసుతోపాటు చీటీ చేతిలోపెట్టి చదువుకొమ్మని సైగచేశాడు.

వంటింట్లోకెళ్ళి విప్పింది. 'పది నిమిషాల్లో పార్కుదగ్గరకి రా, చాలా మాట్లాడాలి. లేకపోతే ఎప్పటికీ మాట్లాడను' అనుంది.

బయటికొచ్చి ''ఇంకా వంటకాలేదు. ఇందాకే వచ్చాను'' అంది రానన్నట్టుగా.

శేఖర్ లేచి ''వెళ్ళొస్తాను'' అని కాత్యాయినికి చెప్పి బయటికి నడిచాడు. వాకిలిదాకా వచ్చిన యమునతో చెప్పాడు ''సరిగ్గా పది నిమిషాలు చూస్తాను. లేకపోతే రాసానుగా'' అని వెళ్ళిపోయాడు.

అన్నట్టుగా పదినిమిషాలు చూశాడు. యమున రాలేదు. లేచి బయటికి నడుస్తుండగా ''శేఖర్'' అని వినిపించింది. ఆగి చూశాడు. వెనకనించి యమున వస్తోంది. తిరిగి వచ్చి సిమెంటు బెంచీమీద కూర్చున్నాడు.

యమున రాగానే ''కూర్చో''మని చూపించాడు. కూర్చుంది.

''ఏమిటి సంగతి?'' అడిగింది.

వొళ్ళు మండిపోయింది శేఖర్‌కి. ''అనలేమనుకుంటున్నావు? పదిహేనురోజులయింది కలిసి. పిచ్చివాడిలా ఫోన్‌చేస్తున్నాను. మీ ఆఫీసుచుట్టూ తిరుగుతున్నాను. అంత బిజీగా వున్నావా లేక నన్ను తప్పించుకోవడానికి కబుర్లు చెప్తున్నావా?''

యమున తలెత్తి చూసి చెప్పింది ''ఇదివరకటిలా కలుసుకోడానికి కుదరదు. అమ్మ ఆరోగ్యం అంత బాగాలేదు. నాన్నగారు సరేసరి. నేను త్వరగా ఇల్లు చేరకపోతే వాళ్ళు తట్టుకోలేరు. అయినా తమ్ముడు కూడా పెద్దవాడయ్యాడు. ఎక్కడైనా మనని చూస్తే బావుండదు.

వెంటనే అతను ''నీవైపునుంచి బాగానే చెప్పావు. మరి నా సంగతాలోచించు. ఇంట్లో అమ్మపోరెక్కువయిపోయింది. గుంటూరు నుండి మేనమామ పిల్లని కూడా తోలేస్తున్నాడు. ఏమని చెప్పి తప్పించుకోను? ఎన్నాళ్ళు ఈ దొంగప్రణయం?'' కోపంతో దవడ కండరం బిగుసుకుంది శేఖర్‌కి.

''నేను ముందేచెప్పాను. ఇంకా రెండున్నరేళ్ళు ఆగాల్సిందేనని. ఆగలేకపోతే మీ ఇష్టం. మీరు మేనరికం చేసుకున్నా లేక మరింకెవర్నన్నా చేసుకున్నా నేను తప్పుపట్టను'' తల కిందికి వాల్చి, కొంగు మెలిపెడ్తూ చెప్పింది.

''సెభాష్! మంచిమాట చెప్పావు. ఆమాటకోసమే ఎదురుచూస్తున్నాను. త్వరలో శుభలేఖలతో కలుస్తాను. పెళ్ళికోసం నేను పరితపించిపోతున్నాను. ఎవరైనా ఫరవాలేదు నాకు. ఆడదైతే చాలు'' కఠినంగా చెప్తున్నా అతని గొంతులో బాధ తెలుస్తూనేవుంది.

''శేఖర్!'' కళ్ళనిండా నీళ్ళతో తలెత్తి ఏదో చెప్పబోతున్న యమునని వారిస్తూ చెప్పాడు ''నాగురించి చాలా బాగా ఆలోచించావు. చాలా సంతోషం. ఆడదాని గురించి ఎవరైనా తప్పుగా రాస్తే తిట్టుకునేవాడిని. మోసగత్తెలని చిత్రీకరిస్తే, మొగవాడి చాతకానితనం అనుకునేవాడిని. కానీ ఎటువంటివాణ్ణైనా పిచ్చివాడిని చెయ్యగల సత్తా మీ జాతికుందని నిరూపించావు. నన్నో తెలివిలేని వెధవని చేసి ఆడించావు. నీ ఉద్యోగం, నీ అందం చూసుకుని నీకు గర్వమనుకుంటాను. ఆ విషయంలో నాకూ ఏం లోటు లేదు. కో అంటే కోటిమందొస్తారు. నీకంటే అందగత్తెనీ, నీకంటే గొప్ప ఉద్యోగస్తురాల్నీ చేసుకోగలను. తరువాత నన్ను మోసం చేసావనొద్దు. నీ అంగీకారంతోటే చేసుకోబోతున్నాను'' అని లేచి నిలబడ్డాడు.

యమున కూడా లేచి నిలబడి ''నే చెప్పేదేమిటంటే...'' అంటుండగానే శేఖర్ ఆపమన్నట్టు చెయ్యి చూపించాడు. ''మీ ఆడవాళ్ళందరూ తెలివిగలవాళ్లూ, మేమే తెలివితేని వెధవలమని మీ నమ్మకం, మీరు చెయ్యమన్నట్టల్లా చేసి, చెప్పిందల్లా వినాల్సిన ఖర్మ మాకేం

పట్టలేదు. వస్తా'' అని నడవసాగాడు.

యమున అతని కూడా రెండడుగులు వేసింది ఏదో చెప్పాలనీ. కానీ అంతలోనే 'ఎందుకు నేవెంటపడాలి? అతనికి ముందే చెప్పాననీ్న ఇప్పుడిలా తొందరపెడితే ఎలా? అతన్ని ఒప్పించడంకన్నా వ్యర్థమైన పనింకొకటి లేదు. తన పరిస్థితికి ఇప్పుడిప్పుడే పెళ్ళి చేసుకోవడం కుదరదు. ఏంచేస్తాడో, ఏం ఆలోచించుకుంటాడో అతనికే వదిలెయ్యడం మంచిది' అనుకుని అక్కడే ఆగిపోయింది.

బైక్ స్టార్ట్‌చేస్తూ రెండునిముషాలు గడిపాడు శేఖర్. యమునక్కడే ఆగిపోవడం చూడగానే చుర్రున మండింది. వెనక్కెళ్ళి లాగిపెట్టి చెంప మీద కొట్టాలనిపించింది. కానీ తమాయించుకున్నాడు. 'తనకేనా అహం! నాకు లేదా? ఆ విషయానికొస్తే నేనెందులో తక్కువా?' అనుకున్నాడు. వెనక్కి తిరిగి చూడకుండా వెళ్లిపోయాడు.

అతను వెళ్లినవైపే చూస్తూ వుండిపోయింది యమున. పూర్తిగా అతని బండి చుక్కలా అయిపోయి మలుపు తిరిగి మాయమయిపోయేదాకా చూసింది. 'నా శేఖరేనా అలా వెళ్లిపోయింది? ఎప్పుడూ వెళ్లిపోతానంటే 'అప్పుడేనా!' అని అడిగే శేఖర్ తనని ఎంత నిర్లక్ష్యంగా వదిలి వెళ్ళిపోయాడు. ఒక్కసారి కూడా వెనక్కి తిరిగి చూడలేదు. తను చెప్పదలుచుకున్నది చెప్పనీయలేదు. ఇంత కఠినత్వం ఎక్కడినించి వచ్చింది? తన శరీరంలోంచేదో భాగం దూరం చేసేసినట్లనిపిస్తోంది. అనలిదంతా నిజమేనా! ఇంటివైపు అడుగులేసింది యమున. చాలా నెమ్మదిగా అడుగులెయ్యసాగింది. వెనకనుంచి హఠాత్తుగా 'నల్లపిల్లా!' అనో 'హలో హీరోయిన్' అనో పిలుపు వినిపిస్తుందని ఆశగావుంది. ఎంత నెమ్మదిగా నడిచినా ఇల్లు వచ్చేసింది. లోపలికెలా వెళ్ళిందో తనకే తెలియదు. మంచంమీద బోర్లాపడి వెక్కివెక్కి ఏడ్వసాగింది. శబ్దం రాకుండా నోట్లో కొంగు కుక్కేనుకుంది.

నందు మలుపు తిరగగానే శేఖర్‌కి కొంచెం, కొంచెం కోపం తగ్గసాగింది. నేనెందుకివాళింత బేలన్స్ లేకుండా ప్రవర్తించాను? తను చాలా సున్నితం, వచ్చేస్తుంటే ఎంత బేలగా చూస్తూ నిలబడింది? ఇంకా అక్కడే కూర్చుని మోకాళ్ళ మధ్య తల పెట్టుకుని ఏడుస్తోందేమో! ఇదే అదనుగా తీసుకుని ఏ రౌడీ వెధవైనా వెకిలివేషాలేస్తే. చీకటి పడ్తోంది ఏదైనా అఘాయిత్యం జరిగితే! ఈ ఆలోచన రావడమే తరువాయి బండి వెనక్కి తిప్పుకుని ఫాస్ట్‌గా వెనక్కి వచ్చాడు. వడివడిగా నడుస్తూ తాము కూర్చున్న బెంచీ దగ్గరకొచ్చాడు. ఖాళీ బెంచీ వెక్కిరించింది. నెమ్మదిగా బయటికొచ్చి చూశాడు. ఎక్కడా యమున జాడలేదు హు! వెళ్ళిపోయింటుంది. అవును! తనకి తనవాళ్ళే ముఖ్యం. తను మధ్యలో వచ్చినవాడు. అందుకే మధ్యలోనే వదిలేసింది. తనే పిచ్చిగా ఆమెతోడిదే జీవితం అని అందర్నీ దూరంచేసుకుంటున్నాడు. తను స్నేహితులని కలిసీ, వాళ్ళతో తిరిగి ఎంతకాలమయింది? మొదట్లో పిలిచేవాళ్లు. ఇప్పుడిప్పుడు వాళ్ళకీ విసుగొచ్చి మానేశారు. తనకి యమునని చూడకపోతే పిచ్చెక్కుతుంది. ఆమె గురించి ఆలోచించకపోతే అన్నం సహించదు, ఆమె మాట వినకపోతే నిద్రపట్టదు. మరి తనకీ ఇలాగే వుంటుందా? వుంటే ఇంత కర్కశంగా ప్రవర్తిస్తుందా? నువ్వెంత అన్నట్టుగా ధిక్కరించేసింది. తను ఫోన్‌చేస్తే సీట్లో లేదని చెప్పించింది. ఒక్కసారి బయటికి రమ్మంటే వీలవదని నిష్కర్షగా చెప్పేసింది. ఆమె ఏదైనా కోరితే చెయ్యడానికి తను సిద్ధంగా వుంటాడు. ఆమె కనుసన్నల్లో మెలిగాడు. ఏం తక్కువ చేశాడని ఇలా వదిలివెళ్లిపోయింది. తను మొదట్నించీ తన తమ్ముడిగురించీ, తల్లిదండ్రుల గురించీ తప్ప మరేం పట్టనట్టుగానే వుంది. 'నాదే తప్పు! పిచ్చిగా ప్రేమించేశాను. ఇక జీవితంలో ఆమె తప్ప మరేం లేదన్నంతగా. బాగా బుద్ధిచెప్పింది. కోరి వెంటపడితే చెప్పుతో కొట్టి సత్కరించినట్టు చేసింది' అనుకున్నాడు. అన్యమనస్కంగా వచ్చి బండి స్టార్ట్‌చేశాడు. మనసంతా వెలితిగా వుంది. రేపట్నుంచీ ఎలా బతకడం? అన్న ప్రశ్న ఎంత విదిలించినా మనసులోకి చొచ్చుకొస్తోంది. ఏం ఆమె లేకుండా పాతికేళ్ళు బతకలేదా! ప్రేమ అనేదో పిచ్చి. అంతా ట్రాష్! అనుకుంటూ వెళ్తున్నాడు. చుట్టూ వున్న ప్రపంచం అతని

కంటికానట్లేదు. ఎదురుగుండా వస్తున్న కారూ, అది చేస్తున్న హారను చప్పుడూ కూడా అతనికి పట్టలేదు.

అంతే! ఒక్కసారిగా శరీరమంతా గాలిలోకి లేచింది.

ఆ తర్వాత ఎత్తుమీదనుంచి కిందపడ్డాడు.

''అమ్మో'' అన్నాడు బాధతో.

ఇకంతా చీకటే!

ఆపైన ఆలోచించడానికి శేఖర్‌కి ఏమీ తెలియదు.



ఆదివారం సింధు చాలా హడావిడిగా వుంది. చిట్టెమ్మకి చేతినిండా పని. ఆవడలూ, పాయసం చెయ్యమని చెప్పింది. బీన్స్ కొబ్బరేసి కూర, టొమేటో పప్పూ, సాంబారూ, రసం, అప్పడాలూ, వడియాలు, గోంగూర పచ్చడీ అన్నీ తయారుచేసి టేబుల్ సెట్ చేయించింది. ముందురోజే అరుణ్‌కి చెప్పింది

''రాకరాక మా మేనత్తొస్తోంది మంచి చీర పెట్టాలి. పెద్దవాళ్ళ చీరల గురించి నాకంతగా తెలియదు. మీ అమ్మగారు కట్టుకునేలాంటి చీరొకటి కొని తే'' అని.

''మరావిడ కోడలికో'' అన్నాడు అరుణ్.

సింధుకి నర్మదంతగా నచ్చలేదు. అందుకే ఏం మాట్లాడకుండా పిల్లలకోసం మంచి కార్టూన్ పిక్చర్స్ తీసుకురా. ఐస్‌క్రీమ్ మరిచిపోకు. ఇంకోమాట మంచి పాన్‌షాపులోంచి మీఠాకిళ్లీలు కూడా తీసుకురావాలి రేపు'' అంది.

సింధు చాలారోజులకి హుషారుగా కనిపించింది అరుణ్‌కి. నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు.

పదవుతుండగా ఆటో ఆగింది.

గుమ్మంలోకి ఆత్రంగా వెళ్లింది సింధు.

శంకర్, నర్మదా, పిల్లలూ దిగారు.

''రండి, రండి'' అంది చిరునవ్వుతో. ఆటోలోంచి నెమ్మదిగా తులశమ్మగారు దిగుతుందని చూసింది. కానీ ఆవిడ జాడలేదు. శంకర్ ఆటో అబ్బాయికి డబ్బులిచ్చి పంపేశాడు.

''అత్తయ్య రాలేదా?'' అడిగింది నిరాశగా.

''ఆవిడకీవేళ కాస్త జ్వరం తగిలింది. మీరెళ్ళిరండి, నేనింకోసారొస్తానన్నారు'' అంది నర్మద.

సింధు ఉత్సాహం నీళ్లు జల్లినట్టు వుఫ్ అని ఆరిపోయింది.

అరుణ్ బయటికొచ్చి శంకర్‌తో చెయ్యికలిపాడు. అందరూ లోపలికొచ్చి హాల్లో కూర్చున్నారు. పిల్లలు అల్లరిచెయ్యడం ప్రారంభించారు. ''చేపలు, చేపలు'' అంటూ ఎక్వేరియం చూసి చప్పట్లు చరిచారు. చిట్టెమ్మ అందరికీ జ్యూస్ తెచ్చిచ్చింది. శంకర్, అరుణ్ ఏవో లోకాభిరామాయణంలోపడ్డారు.

''అత్తయ్య వస్తుందని ఆశపడ్డాను'' అంది సింధు.

నర్మద కనుబొమలు ముడిపడ్డాయి. ఏదో పుస్తకం తీసుకుని చూస్తూ కూర్చుంది. గోపీ పిచ్చల్లరి చేస్తున్నాడు, తేజా బొమ్మలు తీసుకుని వాడేడుస్తుంటే నవ్వుతున్నాడు. వల్లీ, సీతా ఫరవాలేదు నెమ్మదిగా కనిపించారు.

అరుణ్ లేచి ''భోజనాలకి పదండి'' అని ఆహ్వానించాడు.

సింధు కూడా లేచి ''రండి'' అని నర్మదని పిలిచి, టేబుల్ దగ్గరకెళ్ళింది. శంకర్, పిల్లలూ, నర్మదా, అరుణ్ కూర్చున్నారు. సింధు వడ్డించసాగింది.

''నువ్వు కూడా కూర్చో'' చెప్పాడు శంకర్.

''తర్వాత తింటాను'' చెప్పింది నవ్వుతూ.

గోపీ చాలా గారాలుపోయాడు. ఇదొద్దూ, అదొద్దూ అంటూ అన్నీ వేసుకుని పారేశాడు.

నర్మద కూడా అంతే.

శంకర్, ఆడపిల్లలూ నీట్‌గా తిన్నారు. భోజనాలయ్యాక చిట్టెమ్మ పాన్‌లందించింది. వంటిల్లు సర్దుతున్న సింధుదగ్గరికి వల్లి వచ్చింది.

"పిన్నీ మీ ఇల్లు చాలా బావుంది. నీ వంట కూడా" అంది.

డిప్పకాయలా మాట్లాడుతున్న దాన్ని చూసి నవ్వుతూ "మీ అమ్మ వంటకంటేనా?" అంది.

"మా అమ్మవంటే చెయ్యదసలు. బామ్మే చేస్తుంది" అంది. మళ్ళీ గొంతు తగ్గించి "మా అమ్మ ఏ పనీ చెయ్యదు. బామ్మని తిట్టడం తప్ప" అని కిసుక్కున నవ్వింది.

"బామ్మకి జ్వరమొచ్చిందా పాపం!" అంది సింధు మాట మార్చడానికి.

"అంతా అబద్ధం. ఆటోలో సరిపోరు. మీరొద్దు" అంది అమ్మ. అంతే బామ్మ చిన్నమొహం చేసుకుని వుండిపోయింది. నాన్నేదో చెప్పబోతే బాగా తిట్టింది అమ్మ. దాంతో ఆయన నోరు మూసేసుకున్నారు" అని అభినయంతో చెప్పేసింది.

సింధుకొళ్ళుమండింది. అప్పటికప్పుడెళ్ళి కడిగిపారేద్దామనిపించింది. కానీ వుగ్గబట్టుకుని, ఐస్‌క్రీం తీసుకుని హాల్లోకి నడిచింది.

అప్పటికే గోపీ రమ్య బార్బీ డాల్ జుట్టంతా పీకిపారేశాడని అది గొంతు చించుకుని ఏడుస్తోంది.

"చిట్టెమ్మా! రమ్యని తీసుకెళ్ళు" అని పురమాయించి అందరికీ సర్వ్‌చేసింది. నర్మద వాడిని మందలించడంకానీ, వాడు చేస్తున్న అల్లరికి సిగ్గుపడడంకానీ లేదు. తనని కాదన్నట్టు కూర్చుని వీడియో చూస్తోంది. శంకర్, అరుణ్ బానే మాట్లాడుకుంటున్నారు. కంపెనీ దొరికితే కబుర్లు చెప్పడం అరుణ్‌కి సరదానే.

బెడ్‌రూంలోకి రాగానే తలిశమ్మగారికోసం తెప్పించిన నెమలికంఠం రంగు గుంటూరు జరీచీర ప్లేట్లో పెట్టి కనిపించింది. సింధుకి కలుక్కుమంది. అది తీసి బీరువాలో పెట్టి, జాకెట్టు బట్టొకటి తీసి ప్లేట్లో పెట్టింది.

శంకర్ లేచి "ఇక బయల్దేరతాం" అనగానే "ఇవాళ అత్తయ్యని తీసుకురాకుండా నన్ను చాలా డిజప్పాయింట్ చేశావు. కారణాలేమన్నా కానీ, ఈసారి నేనే వచ్చి అత్తయ్యని తెచ్చుకుని నా ఇష్టం వచ్చినన్నాళ్ళు వుంచుకుంటాను" అంది.

నర్మద మొహం మాడిపోయింది. "పదండి, పదండి" అని పిల్లల్ని తొందరపెట్టింది. సింధు బొట్టుపెట్టి జాకెట్టు గుడ్డ చేతిలోపెట్టింది. వాళ్ళు వెళ్ళిపోయాకా 'హమ్మయ్య' అనిపించింది. ఇల్లంతా రణరంగంలా మార్చేశాడు గోపీగాడు. చిట్టెమ్మ విసుక్కుంటూ ఇల్లు సర్దసాగింది.

"ఏం పిల్లాడు బాబూ! అదేం పెంపకం" అంది సింధు అరుణ్‌తో.

"పిల్లలలాగే వుంటారు" అని చెప్పి శాంతమూర్తిలా గదిలో దూర్తున్న అతనిని వెనకనించి మొట్టబుద్ధయింది సింధుకి.

★ ★ ★

జయ ఒకత్తే డాబామీద కూర్చునుంది.

వచ్చిన ఓ నెలరోజులు అమ్మా, వొదినా అపురూపాలతోటీ అన్నగారి హాస్యాలతోటీ సరదాగానే గడిచిపోయింది. కానీ ఈమధ్య శశిధర్ గురించిన ఆలోచనలతో బెంగగా వుంది. పగలంతా చాకిరీ, అత్తగారి సాధింపులతో గడిచిపోయినా సాయంత్రం శశిధర్‌కోసం ఎదురుచూస్తుంటే సంతోషంగా వుండేది.

శశిధర్ వస్తూనే "ఇందాకా ఏమైందో తెలుసా..." అంటూ బోలెడు కబుర్లు చెప్పేవాడు. అందులో జయకి సంబంధించిన విషయం ఒక్కటి కూడా వుండదు. సినిమాల గురించో, పాలిటిక్స్ గురించో, క్రికెట్ గురించో చెప్తాడు. చివరికి "నీకేం అర్థంకాదులే మొద్దువి" అని కొట్టిపారేస్తాడు. జయకి నిజంగానే అర్థంకాకపోయినా చాలా ఉత్సాహంగా, కుతూహలం తెచ్చుకుని మరీ వింటుంది. ఎందుకంటే ఇంట్లో అతని తల్లీ, అక్కగారూ ప్రతిదానికీ "చిన్నవెధవ్వి నీకేం తెల్సు" అంటూ తీసిపారేసి మాట్లాడ్తారు. అతను పెద్దపెద్ద కళ్ళుచేసి చెప్పే కబుర్లు అతని నొక్కుల, నొక్కుల క్రాఫ్ చూస్తూనో, సొట్టపడే అతని గడ్డం చూస్తూనో వినడం జయకిష్టం. ఒక్కోసారి అన్నంముందు కూర్చుని కబుర్లు మొదలెడ్తే అన్నం తినడం కూడా జయ గుర్తు చేయాల్సొచ్చేది. ఇప్పుడెవ

రితో కబుర్లు చెప్తున్నాడో ఏంటో! అనుకుంటే చాలా బెంగగా అనిపించింది. అత్తగారికెంత సేపూ ఎవర్నో దెప్పడం, ఎదురింటి, పొరుగింటీ పెత్తనాలూ, ఆడబడుచు పిల్లలూ, తిండీ, సినిమాలు చూడడంతప్ప వాళ్ళకి వేరే ప్రపంచం అక్కరలేదు. ఇతనికి స్నేహితులెక్కువ. తిరిగి తిరిగి ఏ రాత్రికో ఇల్లు చేరి వుంటే తినీ, లేకపోతే అలాగే పడుకుంటాడు. ఒక్క ఉత్తరమన్నా రాయొచ్చుగదా! ఈ ఆలోచన రాగానే తనూ రాగానే క్షేమంగా చేరినట్టు అత్తగారికో ఉత్తరం రాసి వూర్కున్న సంగతి గుర్తుకొచ్చింది. పోనీ నేనే రాస్తేనో అనుకుంది. వదినని కవరు తెచ్చిపెట్టమని అడగాలి. అన్నయ్యనడగాలంటే సిగ్గు.

ఎనిమిదోనెల కూడా వచ్చిందేమో చాలా భారంగా ఉంది. అందరూ త్వరగా పురుడొచ్చేస్తుందంటున్నారు. కొంతమంది 'మగపిల్లాడే కడుపు చూస్తే తెలుస్తోంది' అంటున్నారు. మగపిల్లాడైతే శశిధర్ పోలికొస్తే చాలా బావుంటాడు. పెళ్ళిచూపులకతనొచ్చినప్పుడు అక్కయ్య లోపలికొచ్చి 'హీరోలా వున్నాడు' అంది. ఎవరైనా సరే! అని సరిపెట్టుకుంటున్న తను అతనిని చూడగానే ఈ సంబంధమే ఖాయమవ్వాలని దేవుడ్ని వేడుకుంది.

పెళ్ళయ్యాకా తొలిరాత్రి "మీరు నన్ను చూసినప్పుడు ఎలా ఫీలయ్యారు?" అనడిగింది.

"అమ్మా, అక్కయ్యా నరేనంటే ఈ అమ్మాయినే చేసుకోవాలనుకున్నాను" అన్నాడు.

తను బుంగమూతి పెట్టి "ఒకవేళ వాళ్లు నచ్చలేదంటే ఏం చేసేవారు?" అనడిగింది.

"మానేసేవాడ్ని" అని ఠకీమని చెప్పాడు.

"మీకు నచ్చినప్పుడు వాళ్ళదేముంది? నేను చేసుకుంటాను. నా యిష్టం అని చెప్పలేరా?" అంది.

"సరే! వాళ్ళిష్టంతో చేసుకుంటేనే అంతంత మాత్రం, ఇక ఎదిరించి చేసుకుంటే నన్నూ నిన్నూ బతకనిస్తారా?" అన్నాడు అమాయకంగా.

ఆ అమాయకత్వం వెనుక నిజాన్ని నిర్మొహమాటంగా మాట్లాడే గుణముంది. అతని మనస్తత్వం అర్థంచేసుకుని ఆనాటినుంచీ మసులుకుంటోంది.

ఎన్నోసార్లు ఇతని మనసులో వున్న మాట బైటపెట్టడం ఇతనికి చాతకావట్లేదు అనుకుంది తను. ఓసారి ఆఫీస్‌నుంచి త్వరగా ఇంటికొచ్చాడు.

"సినిమాకెళ్దాం" అన్నాడు. తనత్తగార్ని అడగమంది. తల్లితో చెప్పగానే "ఎలా కుదుర్తుందీ? రాత్రికి వంటో, వచ్చి చేస్తుందా అర్థరాత్రి" అని ఎగిరిపడింది.

'నువ్వు చెయ్యొచ్చుగా' అని అడగాలని అతనికన్పించింది కానీ అడగలేకపోయాడు. గదిలోకొచ్చి "అసలు నన్నెందుకు పెళ్ళిచేసుకున్నావు? మీవాళ్ళు జాతకాలు చూపించారా?" అనడిగాడు.

ఇంతకాలమయ్యాకా ఈ ప్రశ్నేస్తున్నాడేమిటని తను తెల్లబోయింది. తర్వాత సంగతి తెలుసుకుని తను నవ్వుకుంది. అతని గురించి ఆలోచిస్తున్నకొద్దీ బెంగెక్కువయిపోయింది.

"జయా! జయా!" అంటూ కిందినుండి కావేరి పిలిచింది. నెమ్మదిగా లేచి కిందికొచ్చింది.

"ఒక్కదానివే ఏం చేస్తున్నావు? అలా వున్నావేమిటీ వొంట్లో బాగాలేదా?" అడిగింది ఆదుర్దాగా.

"ఏంలేదొదినా!" అంటూ లోపలికెళ్లిపోయింది జయ. "నాకు తెల్సులే" అంది వెనకాలే వచ్చిన కావేరి.

"ఏంటదీ?"

"ఇది" అంటూ వెనకనించి చేతులు ముందు పెట్టి చూపించింది కావేరి. అవి కవర్లు.

తన మనసులో మాట వదినకప్పుడే ఎలా తెలిసిందా అని ఆశ్చర్యపోతూ "వదినా!" అంది సంభ్రమంగా.

"ఇవి నువ్వు వచ్చినప్పుడే తెప్పించి పెట్టాను. నీకెప్పుడు అవసరమైతే అప్పుడు ఇద్దామని. కానీ నీకా ధ్యాసే కలగలేదు. ఇప్పుడు నీ ముఖం చూస్తే పతిమీద ధ్యాన మళ్ళిందని తెలుస్తోంది. తీసుకో చక్కగా నీ ప్రేమంతా ఒలకబోసెయ్యి" అంది చిలిపిగా.

జయ సిగ్గుపడ్తూ తీసుకుని "రాత్రికి రాస్తాను" అంది.

"అవును, కొన్ని పన్లు రాత్రికే కేటాయించాలి" అంది వుడికిస్తూ కావేరి.

"అబ్బా! ఏవయింది నీకీవేళ!" అంటూ నునుసిగ్గులు గులాబీ మొగ్గలై పూస్తుండగా అక్కడినుంచెళ్ళిపోయింది జయ.

రాత్రి భోజనాలయ్యాక ఉత్తరం రాయడానికుపక్రమించింది జయ.

'ప్రియమైన శ్రీవారికీ!' అని మొదలుపెట్టింది. తర్వాతేం రాయాలో తెలియలేదు. 'నేను క్షేమం, మీరు క్షేమంగా వున్నారా?' అని రాసింది. ఇంకేం విశేషాలు లేనట్టుగా అనిపించింది. ఎలా రాయాలో వదిన్నడుగుదామనుకుని మళ్ళీ ఆటపట్టిస్తుందని వూర్కుంది. త్వరగా ఇల్లు చేరుతుండమనీ, అన్నం అదీ వేళ్టికి తినమనీ, డబ్బులు అనవసరంగా ఖర్చుచేయొద్దనీ, ఏమేమో రాసింది. 'కడుపులో బాబు వూరికే తంతున్నాడనీ, త్వరగా పురుడొచ్చేస్తుందని అందరూ అంటున్నారు, మీరప్పుడిక్కడే వుంటే బావుంటుంది. తండ్రి కాబోతున్నందుకు మీకు సంతోషంగా లేదూ!' అని రాసింది. ఆ తరువాత అన్నయ్యే పిల్లల గురించీ, వదిన ఓర్పు గురించీ ఇలా నాలుగు పేజీలు రాసింది. మొదట్లో అసలు సంగతులే లేవనిపించాయి. ఇప్పుడిన్ని సంగతులు పుట్టుకొచ్చేసాయేంటబ్బా! అని ఆశ్చర్యపోయింది. చివరకు 'ముద్దులతో మీ జయప్రద' అని రాసి బోలెడు సిగ్గుపడిపోయింది.

మర్నాడు ఉత్తరం వదినకిచ్చి పోస్ట్ చేయమని చెప్పిన దగ్గరనుంచి ఉత్తరం చదువుకుని ఏమనుకుంటాడో అసలు అతనికన్నా ముందరే ఎవరైనా విప్పుతారేమోని పలురకాల అనుమానాలతో గడిపింది. సాయంత్రం కావేరి వస్తూ వూలు వుండలు తెచ్చిచ్చి "ఖాళీగా కూర్చుంటే అస్సలు తోచదు. నీకు అల్లడం వచ్చుగా. చక్కని స్వెట్టరల్లు" అంది.

జయకి హుషారొచ్చేసింది. వెంటనే అల్లడం ప్రారంభించింది. వర్ధనమ్మకసలు తీరికలేదు ఏవో ఒకటి చేస్తూనేవుంది. జయకిష్టమని ఓరోజు పల్లీపాకం, ఓరోజు కొబ్బరి లౌజూ, ఓరోజు కొయ్యరొట్టె చేసి తినేదాకా వదలదు. మధ్యమధ్యలో ప్రభ దుమారంలా వచ్చి, "దానికైతే అన్నీ చేసిపెడ్తావు" అంటుంది. "నీకూ చేసాను కదే!" అంటే "ఎప్పుడో చేశావులే, ఇప్పుడు మాత్రం నాకోసమేం చెయ్యవు" అని సణుగుతూనే చేసినవన్నీ తీసుకెళ్తూవుంటుంది. ఓరోజు కాత్యాయినొచ్చింది. వచ్చేటప్పుడు మైసూర్‌పాక్ చేసి తీసుకొచ్చింది. "నువ్వొచ్చినప్పటినుండీ రావాలనుకుంటూనే వున్నాను. కానీ నావశంకాలేదు. ఇంక చూడాలనిపించి వడ్తూ లేస్తూ వచ్చాను" అంటూ జయ ఆరోగ్యం గురించీ, అత్తగారి గురించీ అడిగి తెలుసుకుంది. నిండుగా తిరుగుతున్న జయని చూస్తుంటే యమున వయసుదేకదా! దానికెప్పుడు పెళ్ళిచేస్తామో అని ఆ తల్లి మనసు పరితపించింది.

"వచ్చారుకదా! ఇవాళ్టికుండి వెళ్ళండి" అని వర్ధనమ్మ బతిమాలింది.

"యమునకి వంట్లో కులాసాగా లేదు. ఆఫీసునుండి రావడంతోటే పడుకుని పోతోంది. రోజూ తలనెప్పంటుంది. డాక్టరుకి చూపించుకొమ్మంటే వినదు. మొండిది" అని బాధపడింది.

"యముననోసారి రమ్మనండి అత్తయ్యగారు!" అంది జయ.

"నువ్వే వచ్చి ఓరోజుండి వెళ్ళమ్మా, దానికి తగని మొహమాటం. ఓరోజు తీసుకురావే" అని కావేరికి చెప్పింది. కావేరి సరేనంది. తనకీ చెల్లెలి ఆరోగ్యం గురించి విన్నాకా చూడాలనిపించింది. ఎంతో చలాకీగా వుండే యమున అలా ఉంటోందంటే బహుశా! నిజంగానే ఏదైనా నుస్తీ ఏమో! బలవంతంగానైనా సరే డాక్టరుకి చూపించాలి అనుకుంది. కనుచీకటి వడ్తుండగా శరత్ వచ్చి కాత్యాయినిని తీసుకెళ్ళిపోయాడు.

మర్నాడు ఉదయం పక్కింట్లోంచి పెద్దపెద్ద అరుపులూ, గొడవా వినిపించింది. ఏమైందబ్బా అని జయ గోడ దగ్గరకెళ్ళి చూసింది.

"అందరికీ మా ఇంటి సంగతులే కావాలి. చుప్పనాతిమూక, మరీ అలగా వాళ్ళ మధ్య వుండాల్సివచ్చింది. కాస్త చప్పుడైతే చాలు

వచ్చేస్తారు గోడదగ్గరకి" అంటూ నర్మద రయ్యి మని వచ్చి వాళ్ళ కిటికీ తలుపులేసింది.

జయ లోపలికొచ్చేస్తుంటే తులశమ్మగారి మూలుగూ, ఏడుపూ వినిపించింది. లోపలికొచ్చి తల్లితో చెప్పింది. అవిడ చేస్తున్న పనాపి బయటికొచ్చి చూసింది. గోపీగాడు గోటీకాయ లాడుతున్నాడు ఎవరో పిల్లలతో. "ఒరేయ్, బామ్మగారికి ఒంట్లో బావుందా?" అని గొంతు తగ్గించి అడిగింది.

"బామ్మ నూతి దగ్గర జారి పడింది. మోకాలింత లావున వాచిపోయింది. నీకెవరు చేస్తారని పడ్డావంటూ అమ్మ తిడ్తోంటే ఏడుస్తోంది. నాన్న కొబ్బరి నూనె రాసి, ఆఫీసుకెళ్ళిపోయారు" అని గడగడా చెప్పేసాడు.

"డెబ్బై ఏళ్ళు పైనబడ్తున్నావిడ చేత ఇంటెడు చాకిరీ చేయించడమే కాక, ఆవిడ కాస్త మూలిగితే చాలు నానా మాటలూ అంటుంది. ఆ కొడుక్కైనా వుండాలి బుద్ధి" అని గొణుక్కుంటూ లోపలికొచ్చి కావేరి, జయావాళ్ళతో చెప్పింది.

"అయ్యయ్యో! డాక్టరు దగ్గరకి తీసుకెళ్ళాల్సింది. అసలే పెద్దవయసు. విరిగితే అతకవు కూడానూ" అంది బాధగా కావేరి. జయకు ఆవిడ దుస్థితి తలుచుకుంటే కళ్ళనీళ్ళ పర్యంతమయింది. నర్మద కాసేపటికి చక్కగా తయ్యారయి ఆఫీసుకెళ్ళిపోయింది. వెంటనే వర్ధనమ్మా, జయా అవతలి వాటాలోకెళ్ళారు. నొప్పెక్కువగా వున్నట్టుంది. ఆవిడ ఒకటే ఏడుపు. నిజంగానే మోకాలు చాలా వాపొచ్చేసింది. "ఇలాంటి స్థితిలో కూడా వదిలి వెళ్ళిపోయారు. ఏం మనుమలమ్మా" అని ఆశ్చర్యపోయింది వర్ధనమ్మ.

"మంచంలోనే వుండిపోవల్సొస్తుందేమోనమ్మా, మా కోడలు అదేదో ముసలివాళ్ళ ఆశ్రమంలో చేర్పించెయ్యండి మీ అమ్మని అని చెప్తోంది వాడితో" అంటూ బావురుమందావిడ.

"ఛా, అలా జరగదు, వూరుకోండి" అంటూ ఓదార్చి, జ్వరం కూడా రావడంతో "జయా కాస్త బ్రెడ్డూ, పాలూ తీసుకురా" అని చెప్పింది. జయ ఇంట్లో వున్న నవాల్జిన్ టాబ్లెటు కూడా తెచ్చి వేసి, పాలల్లో ముంచి ఒక్క బ్రెడ్డు ముక్క తినిపించింది బలవంతాన.

ఆవిడ మూలుగూ, ఏడుపూ అంతకంతకూ ఎక్కువయ్యాయి. ధైర్యం చెబుతూ తల్లీకూతుళ్ళు మార్చి మార్చి ఆవిడ దగ్గరే కూర్చున్నారు. నర్మదొచ్చే వేళకి ఇంటికొచ్చేసారు. వస్తూనే మంచంలో ఏడుస్తున్న ముసలావిడ్ని చూసి చిందులేసేసింది. "ఏమిటా ఏడుపూ? ఆర్భాటం? ఊరందరికీ తెలియాలా? నోరుమూసుకుని పడుకోలేరా?" అంటూ నానా ఎగురుడూ ఎగిరేసింది.

ఆ తర్వాత శంకర్ వచ్చాడు. "అమ్మ ఎలా వుంది?" అనడగగానే ఆవిడ...

"ఇంక నేను బతకనురా, ఈ బాధ భరించలేను" అంటూ ఘొల్లుమంది.

"చాల్చాలు, అయిన రచ్చ ఇంక చాలు, ఇంట్లో వుండాలి అనుకుంటే నోర్మూసుకుని పడుండాలి" అని కళ్ళెర్రచేసి అరిచింది. దాంతో శంకర్ ఇంక నోరెత్తలేదు.

"నేను వంట చెయ్యలేను. పదండి బయటే తిన్దాము" అని పిల్లల్ని తీసుకుని తయారయింది. తల్లినాస్థితిలో వదిలి వెళ్ళలేక వెళ్ళలేక వెళ్ళాడు శంకర్. నీకంటే ఎక్కువ సంపాదిస్తున్నాను అని మాటిమాటికీ గుర్తుచేస్తుంది నర్మద. అందుకే ఎదిరించలేడు. ఒకవేళ ఎదిరించినా వదిలి వెళ్ళిపోడానికి కూడా వెనుకాడదు. ముగ్గురు పిల్లలతో తనూ, పరువూ కూడా బజార్నపడ్తారనవసరంగాఅని సర్దుకుపోతాడు. అతని అశక్తత తెలిసి ఆమె మరీ సాధిస్తుంది.

తులశమ్మగారికి ప్రాణాలు పోతున్నట్టుగా వున్నాయి. "శ్రీరామచంద్రా, ఆపద్బాంధవా, నిన్నే నమ్ముకున్నాను. నా మొరాలకించవేం తండ్రీ" అంటూ వెక్కివెక్కి ఏడుస్తోంది. "ఇంత విశాల ప్రపంచంలో నన్నునాధని చేశావేం నాయనా" అని కళ్ళు మూసుకుని ఏడుస్తుండగా "అత్తయ్యా" అన్న పిలుపూ, నుదుటిమీద చల్లని స్పర్శా తగిలింది. కళ్ళు తెరిచింది. ఎదురుగుండా సింధు జగన్మాతలా కనిపించింది.

కళ్ళనిండా నీళ్ళతో "ఏమిటత్తయ్యా ఈ ఘోరం? నిన్నిలా వదిలేసి, ఛీ బావకూడా" అంది ఛీత్కారంగా.

"సింధూ!" అంటూ చెయ్యిపట్టుకుని పసిపిల్లలా ఏడ్చేసింది తులశమ్మ.

"కావేరి ప్రొద్దుట బస్‌లో కలవలేదు. లేక పోతే ప్రొద్దుటే వచ్చేదాన్ని. ఇంకిప్పుడాలశ్యం చెయ్యడం దేనికీ, కావేరి! మీవారొస్తే ఒక ఆటో తెప్పించండి, అత్తయ్యని డాక్టరు దగ్గరకీ, తర్వాత ఇంటికీ తీసుకెళ్లాలి" అని ఆవేశంగా చెప్పింది సింధు.

"బావని రానీ" ఏడుస్తూనే చెప్పింది తుల శమ్మ. "ఏం చెప్పాలి సింగినాదం! ప్రొద్దుట నగా పడి ఆ మోకాలుచిప్పంత లావున వాచి ఏడుస్తుంటే ఆస్పత్రికి తీసుకెళ్లలేదు సరికదా! పెళ్లాన్ని తీసుకుని హొటళ్ళకీ, షికార్లకీ తిరు గుతాడా! అంత భారంగా వుంటే చెప్పెయ్యమ ను తీసుకెళ్ళి నాదగ్గరే పెట్టుకుంటాను. దిక్కూ మొక్కూ లేదనుకుని విర్రవీగుతున్నారు" అని ముక్కుపుటాలదుర్తుండగా కోపంగా అంటుండగా బిలబిలా పిల్లలూ, తర్వాత నర్మదా, శంకర్ లోపలికొచ్చేసారు.

"సింధూ! నువ్వా ఎప్పుడొచ్చావు?" అని పలకరిస్తున్న శంకర్‌మీద గయ్యిమని లేచింది. "లేవలేని మనిషిని, అందులోనూ తల్లినీ విధంగా మంచంలో ప్రొద్దుటనగా వదిలేసి, నీ దారి నువ్వు చూసుకుంటావా? ఇంత ఘోరమా మనింట్లో కుక్కపిల్లకో, పని మనిషికో లేక పక్కింటివాళ్లకో ఏదైనా అయితేనే పదిసార్లను కుని బాధపడడం మానవ సహజం. అలాంటిది కన్నతల్లిని, నీకోసం నానా కష్టాలూ పడి, మావయ్య పోయినప్పటినుండీ నీ మీదే ప్రాణాలు పెట్టుకుని, తన కడుపుకట్టుకుని, చదివించి పెంచిన తల్లిని ఎంత బాగా చూస్తు న్నావో చూస్తుంటే, మొత్తం ప్రపంచంలో ఎవ రూ పిల్లలు లేనివాళ్లూ అందులోనూ మగపిల్ల లు లేని వాళ్ళూ బాధపడక్కరలేదనిపిస్తోంది.

"ఏమిటండీ మీరు? ఇందాకట్నుంచి చూ స్తున్నాను మా మీద దాష్టీకం చేస్తున్నారు. ఇంతకాలం ఈ మేనత్తొకతుందనే మాటే తెలి యని మీరు ఇప్పుడింత ప్రాణం పెట్టి మాట్లా డుతున్నారు. అయినా... మా ఇంటి విషయంలో కలగజేసుకోడానికి మీరెవరు?" అంటూ నర్మద శంకర్‌ని వెనక్కి తోసి ముందుకు వచ్చింది.

"బావా! నేను నీతో మాట్లాడుతున్నాను, నువ్వు సమాధానం చెప్పు, సభ్యతా సంస్కారం మాట అటుంచి కనీసం మానవత్వపు విలువలు తెలియని వాళ్ళతో నేను మాట్లాడను" అని నర్మదవైపు చూడకుండానే అడిగింది.

"ఆయనేం మాట్లాడ్తాడు. ఈ ఇంట్లో నేనెంత చెప్తే అంత. మర్యాదిచ్చి పుచ్చుకో. నువ్వెంత గొప్ప చదువులు చదివినా, ఉద్యోగస్తురాలివైనా నాకేం గొప్పలేదు. నీ లెక్చర్లన్నీ కాలేజీలో చెప్పుకో. నా ఇంట్లో నోరిప్పి నాకెదురు మాట్లా డితే వూరుకునేది లేదు. బయటికి నడు" అని తర్జనని చూపించింది నర్మద.

"వెళ్ళక ఇక్కడ వుండిపోడానికి రాలేదు. అత్తయ్యవి ఓ రెండు రవికలూ, చీరలూ సంచిలో పెట్టెయ్యి బావా" అంది సింధు.

"చాలా గొప్పదానివి కదా! అవి మాత్రం తీసుకెళ్లడం ఎందుకు? కొనిపెట్టలేవూ?" మూతి తిప్పుతూ అంది.

"ఓహో! బహుశా అవి కూడా మీరు కొ నుండరు. బావా నీ దౌర్భాగ్యం చూస్తుంటే నాకు జాలేస్తోంది" అంది వెటకారంగా.

ఇందాకట్నించీ చూస్తున్నాను. నేను మాట్లా డుతుంటే అటు తిరిగి ఆయనతో మాట్లాడు న్నావు, ఏమనుకుంటున్నావనలు" అంటూ సింధు భుజంపట్టి తిప్పుతూ గద్దించింది నర్మద.

విసురుగా ఆ చెయ్యి తోసేస్తూ-

"నీ భర్తతో మాట్లాడుతుంటే మర్యాదలేకుండా అడ్డుపడ్తూ నీకు అహం తప్ప అభిమానం లేదని మరోసారి చాటుతున్నావు" అంది సింధు. "ఎంత పొగరే నీకు!..." అని నర్మద గొంతు చించుకుని అరుస్తుంటే "నోర్మూసుకో" అని శంకర్ ఆమెని పట్టి వెనక్కి లాగి "ఇంకొ క్క మాట మాట్లాడినా, నన్ను పశువుని చేసిన దానివవుతావు. నలుగురిలోనూ దెబ్బలు తిని నవ్వుల పాలౌతావు. సింధు మాట్లాడినదంతా నిజం. నీ నోటికి జడిసి కన్నతల్లిని నానా అగచాట్ల పాలూ చేసాను. మంచంలో ఏడుస్తు న్న నా తల్లిని తలుచుకుంటూ నేను కుమిలిపో తుంటే నీకు తిండెలాసహించిందో నాకు అర్థం కావట్లేదు. ఛీ ఛీ నా ప్రవర్తన తలుచుకుంటే

నామీద నాకే అసహ్యం వేస్తోంది. నే వెళ్ళి ఆటో తీసుకొస్తాను'' అని విసురుగా వెళ్ళబోతుండగా ఆటో చప్పుడయింది. సుధాకర్ ఆటో తీసుకొచ్చి గుమ్మంలో నిలబెట్టాడు. సింధు, కావేరి, శంకర్ సాయంపట్టి తులశమ్మగారిని తీసుకెళ్తుంటే నర్మద నోరు తెరుచుకుని శిలా ప్రతిమలా చూస్తుండిపోయింది.

సింధు వాళ్ళింటి దగ్గరుండే నర్సింగ్‌హోమ్‌కి తీసుకెళ్ళింది. అక్కడినుండి అరుణ్‌కి ఫోన్ చేసింది. డాక్టర్ చూసి ఎక్స్‌రే తీయించాడు. పెయిన్ కిల్లింగ్ టాబ్లెట్లిచ్చి, నిద్రకి ఇంజెక్షన్ కూడా చేశాడు. ''ప్రొద్దుటనగా పడితే ఇప్పుడు తీసుకొచ్చారా!'' ఆశ్చర్యంగా అడిగాడు సింధుని.

''అందరం ఆఫీసులకెళ్ళిపోయాక జరిగింది'' శంకర్‌ని క్రీగంట చూస్తూ చెప్పింది.

''వెంటనే తీసుకురావల్సింది, విరిగి వుండదు. కొద్దిగా డిస్‌లొకేటయినట్టుగా అనిపిస్తోంది. ప్రొద్దుటినుండి చాలా బాధ పడి వుంటారు'' అన్నాడు.

శంకర్ కళ్ళనీళ్ళతో తల వంచుకున్నాడు. ''బావా ఈ రాత్రికి నేనిక్కడే వుంటాను. ఇంకేం భయంలేదు. అత్తయ్యకి నిద్రపట్టేసింది. నువ్వింటికెళ్ళు. అక్కడ నర్మదేం అఘాయిత్యం చేస్తోందో? నేను ఆవేశంలో నోరు జారాను క్షమించు'' అంది.

''క్షమించాల్సింది నువ్వు. ఆ రాక్షసి నిన్ను చాలా మాటలంది. ఏం చెయ్యను! చాతకానివాడ్ని'' తలవంచుకున్నాడు తప్పుచేసినట్టు.

సుధాకర్ శంకర్ భుజంమీద చెయ్యేసి ''ప్రొద్దుటే వద్దాం. పదండి'' అన్నాడు.

''శంకర్ అరుణ్‌కీ సింధుకీ కృతజ్ఞతలు తెలియజేసి తల్లినోసారి పిలిచి బదులు రాక పోయేసరికీ ''నిద్రపోతోంది పాపం! ఎన్నాళ్ళయిందో ఆవిడింత ప్రశాంతంగా పడుకుని'' అనుకుంటూ సుధాకర్‌తో కలిసి బయటికి నడిచాడు.

చిట్టెమ్మ ఇంటినుండి సింధుకి బట్టలూ, భోజనం మొదలయినవి తెచ్చింది. స్పెషల్ రూంలో అన్ని సౌకర్యాలూ వుండబట్టి హాయిగా వుంది. సింధు స్నానం చేసి భోజనం చేసింది.

తులశమ్మగారు కళ్ళు తెరిచి చూసింది. అంతా కొత్తగా వుంది. తెల్లని పక్కా, మెత్తని పరుపూ, చల్లని గాలీ హాయిగా వుంది. ముఖ్యంగా కోడలి చివాట్లూ, పిల్లల రణగొణధ్వనీ లేకుండా ప్రశాంతంగా వుంది. ఇది స్వర్గం కాదు గదా! నేను అప్పుడే చచ్చిపోయానా? అనుకుందో నిముషం.

''అత్తయ్యా లేచావా? జ్వరం జారింది, డాక్టర్ లైట్‌గా చారన్నం పెట్టమన్నారు. నోరు తెరు'' అంటోంది సింధు గిన్నె చెంచా పట్టుకుని.

ఆవిడకప్పుడు ఒక్కొటొక్కటిగా అన్నీ గుర్తుకురాసాగాయి. కోడల్నెదిరించి 'దిక్కులేనిది కాదావిడ' అన్నట్టుగా సింధు తీసుకురావడం, కొడుకు బాధపడ్తూ పశ్చాత్తాపంతో అన్న మాటలూ, అన్నీ గుర్తుకు రాగానే ''ఇది కలకాదు'' అనుకుంది.

సింధు స్పూనుతో పలచగా కలిపిన చారన్నం పెడ్తుంటే ''అనాథాశ్రమాలుంటాయటగా ముసలాళ్ళకి, అందులో పారెయ్యండీవిడ్ని. ఈవిడ మంచంలో పడితే నేచెయ్యలేనుబాబూ'' అన్న నర్మద మాటలు గుర్తుకొచ్చి దుఃఖ మొచ్చేసింది.

గిన్నె పక్కనపెట్టి ''వూరుకో అత్తయ్యా, నేనున్నాను నీకు. నువ్వెంటరిదానివి కాదు. మనది రక్తసంబంధం. నిన్ను నా దగ్గర పెట్టుకునే హక్కు నాకుంది. నిన్నా నరకంలోకి మళ్ళీ ఎన్నటికీ పంపను. బావ కావలిస్తే చూసెళ్తాడు'' అంటూ ఆవిడ చెక్కిళ్ళు రాస్తూ ధైర్యం చెప్పింది. దాంతో కాస్త వూరట చెంది మిగిలిన అన్నం కాస్త తిని, మందు మింగి తిరిగి నిద్రలోకి జారిపోయిందావిడ.

ఆవిడ్నలా చూస్తుంటే సింధుకెంతో తృప్తిగా, ఆనందంగా అనిపించిది. పుట్టిన ఇన్నాళ్ళకి మొదటిసారో మంచి పని చేసాను అనుకుంది.

★ ★ ★

శశిధర్‌కు ఉత్తరం రాసిన తర్వాత ఆశగా ప్రతిరోజూ పోస్ట్‌మేన్‌కోసం ఎదురుచూడడం జయ దైనందిన జీవితంలో ఒక పనిగా మారిపోయింది. 'రేపు శలవు పెడ్తున్నాను. నిన్ను చెకప్‌కి తీసుకెళ్ళి అట్నించి మా అమ్మా వాళ్ళి

్ళింటికి తీసుకెళ్తాను. వచ్చేటప్పుడు అమ్మమ్మ గారిని చూసొద్దాము అని చెప్పింది కావేరి.

అప్పటికి తులశమ్మగారెళ్ళి వారం రోజుల యింది. ఆస్పత్రినుండి రెండురోజుల్లో ఇంటికి పంపించేసారు. సింధు వాళ్ళింటికి తీసుకెళ్ళి పోయింది. వర్ధనమ్మ ఈ సంగతి విని చాలా సంతోషించింది. "అంతా ఆవిడ చేసే రామ నామం మహిమ" అంది.

వల్లీ, సీతా వాళ్ళ బామ్మకోసం బెంగపెట్టు కున్నారని మధ్యలో ఓసారి తీసుకెళ్ళి చూ పించి తెచ్చాడు శంకర్. నర్మద పరిస్థితి చెప్పనే అక్కరలేదు. ఇంట్లో రోజూ కురుక్షే త్రమే. శంకర్ని సాధించడం, పిల్లల్ని కొట్టడం ఎక్కువయిపోయింది. అలవాటు లేక ఏ పనీ చెయ్యలేక పోతోంది. "అమ్మ అన్నం వండితే బియ్యం లాగానే వుంటుంది. లేకపోతే జావ లాగా అయిపోతుంది. కూరల్లో ఉప్పో, కారమో, పసుపో ఏదో ఒకటెక్కువవుతుంది. అందుకే నాన్న రాత్రిపూట వంట చేస్తున్నారు" అని చెప్పిందోసారి వల్లి.

పనిమనిషిని పట్టుకుని రాపాడించేస్తే, "నే ను మీ అత్తలెక్క కన్పిస్తున్నానా? నోర్మూసుకుని పడుండనీకి, చెయిపించుకుంటే చెయిపించు కో, లేకుంటే లేదు. నేను గింతే చేస్తా" అని దబాయించి చెప్పేసింది. శంకర్ కూడా ఇదివ రకట్లా కాకుండా మాటకి మాటా చెప్తున్నాడు. పిల్లలు స్కూలునుంచి రాగానే పూజా, మధుల తోబాటు వాళ్లకి కూడా ఫలహారం పెడ్తోంది వర్ధనమ్మ. శంకర్ కూడా అడపాదడపా పలక రించి మాట్లాడ్తున్నాడు వీళ్ళతో.

జయని డాక్టర్కి చూపించి, అక్కడనుండి పుట్టింటికి తీసుకెళ్ళింది కావేరి. కాత్యాయిని ఆప్యాయంగా ఆహ్వానించింది. రామారావుగా రు "కులాసాగా వున్నావా తల్లీ" అని జయని పలకరించారు. సాయంత్రందాకా కబుర్లు చె ప్పుకుంటూ కూర్చున్నారు. మధ్యలో ఓ గంట జయని పడుకోమని పోరడంతో తప్పనిసరయి గదిలోకి పోయి పడుకుంది. చెల్లెలి ఆరోగ్యం గురించి తల్లి బాధపడ్తుంటే ధైర్యం చెప్పింది కావేరి. కాసేపు యమున పెళ్లి గురించీ ఆర్థిక ఇబ్బందుల గురించీ మాట్లాడుకున్నారు. యమున త్వరగానే వచ్చేసింది. కావేరికి చెల్లె ల్ని చూడగానే కళ్ళనీళ్ళు తిరిగాయి. "ఏమిటే ఇంత చిక్కిపోయావు? అన్నం తింటున్నావా? ఒంట్లో బావుంటోందా?" అని ప్రశ్నలు వేసింది.

యమున నవ్వింది. ఆ నవ్వులో జీవం లేనట్టుగా వుంది. "బాగానే వున్నాను. అమ్మ వూరికే ఖంగారు పడ్తోంది" అంది. జయని చూసి కుశల ప్రశ్నలు వేసింది. ఆ తర్వాత తలనెప్పిగా వుందని మంచం మీద వాలిపో యింది.

"రోజూ తలనెప్పంటున్నావుట. పద ఓ సారి డాక్టరుకి చూపిస్తాను" అంటూ ఎంత బల వంతం చేసినా అక్కగారి మాట వినలేదు యమున. "ఏం లేదు. బస్సుల్లో నిలబడి వచ్చేసరికి ఇలాగే వుండదూ!" అని కొట్టి పారేసింది.

"మా ఇంటికెప్పుడొస్తావు?" అనడిగింది జయ. "నువ్వు ఎంత త్వరగా పాపనో బాబునో ఇస్తావో అంత త్వరగా" అంటూ నవ్వుతున్న యమునని చూసి దీర్ఘంగా నిట్టూర్చింది కాత్యా యిని.

అక్కడినుండి సింధూ వాళ్లింటికెళ్లారు. సింధు అప్పుడే వచ్చినట్టుంది నైటీలోకి మారి టీ తాగుతూ మేనత్తతో కబుర్లు చెప్తోంది కావేరీవాళ్లని చూసి చాలా సంతోషపడింది. తులశమ్మగారు మంచం దిగలేకపోతోందింకా. పట్టీ విప్పడానికింకా వారం రోజుల పై ముందిట. ఆవిడ కోసం ప్రత్యేకం ఓ పిల్లని పనికి పెట్టింది సింధు. తులశమ్మగారు వర్ధన మ్మని చూడాలనుందని చెప్పింది. జయని దగ్గరకు పిల్చుకుని చెక్కిళ్లు నిమిరి ముద్దు పెట్టుకుంది. కావేరితో "నువ్వు నా పాలిటి దేవతవు. చల్లనివేళ దీవిస్తున్నాను. కలకాలం సౌభాగ్యవతిగా వుండు" అంది.

ఇంతలో సింధు కోసం ఎవరో వచ్చారు. "మీరు మాట్లాడ్తూ వుండండి" అని చెప్పి వాళ్ల దగ్గరకెళ్లింది.

కొడుకు గురించీ, మనవల గురించీ అడిగి తెలుసుకుంది తులశమ్మ. అంతా పూస గుచ్చి నట్టు చెప్పుకొచ్చింది జయ.

"ఏమిటో నెమ్మదిగా వుండే నీకు, గయ్యాళి

అత్తనీ, నాలాంటి దానికి ఇలాంటి కోడల్నీ ఇచ్చాడా దేముడు. దీని అంతరార్థమేమిటో ఎవరికి తెలుసు! అంతా పైవాడాడిస్తున్న నాటకం, ఎప్పటికి తెరదించుతాడో" అంటూ పైకి చూస్తూ దణ్ణం పెట్టిందావిడ.

అరుణొచ్చి "అరెరే! ఎంతసేపయిందొచ్చి, సింధు కలిసిందా? మాట్లాడిందా?" అనడిగాడు.

"మాట్లాడి ఇప్పుడే వెళ్లారు. ఇంక శలవిప్పించండి చాలా ఆలశ్యమవుతోంది" అని చెప్పి, సింధు దగ్గరకెళ్లి శలవు తీసుకుని ఇంటికి బయల్దేరారు.

★ ★ ★

"బావా హార్లిక్స్!" అంటూ గ్లాసు తీసుకునొచ్చి నిలబడిన శిరీషని గమనించకుండా ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నాడు శేఖర్. "బావా నిన్నే" గట్టిగా అరిచింది శిరీష. ఆమె వైపు విసుగ్గా చూస్తూ "నాకేం వద్దుగానీ అమ్మకేదైనా సహాయం కావాలేమో చూడు!" అన్నాడు చిరునవ్వుతో.

"అత్తమ్మకి కాళ్లూ చేతులూ అన్నీ సెంట్ పర్సెంట్ ఆర్డర్‌లో వున్నాయి. ఆవిడకి నా సహాయం అవసరంలేదు" అని నవ్వింది.

"భగవంతుడు నాకు మంచి శిక్షే వేశాడు. లాకప్‌లో పెట్టినట్టు, బాది పారేస్తున్నావు. పోయిన జన్మలో పోలీసు పక్షివైయ్యుంటావు" అన్నాడు నవ్వుతూ శేఖర్.

"ఏక్సిడెంటులో చెయ్యీ, కాలూ బాగా కొట్టుకుపోయి, కాలర్ బోన్ విరిగింది.

'కాలర్ బోన్ విరిగిన వాళ్లు అదృష్టవంతులు. ఎందుకంటే తేలిగ్గా అతుక్కుంటుంది' అని చెప్పాడు డాక్టర్.

'పెద్ద ప్రమాదం తృటిలో తప్పిపోయింది. అంతా మా శిరీష కాలమహిమ' అంటోంది అమ్మ" నిజమే. శిరీష ఈ టైమ్‌లో లేకపోతే తను మరీ బోరయిపోయేవాడు. కాలు మరీ పచ్చిపుండులా వుంది. మానడానికి చాలా టైమ్ పడ్తుంది. చేతికి పట్టీ వేశారు. చర్మం బాగా కొట్టుకుపోయిందేమో, కుడి చెయ్యి స్వాధీనంలోలేదు. యమునకి ఫోన్ చేసి మాట్లాడాలని ట్రై చేశాడు కానీ చెయ్యి పట్టివ్వలేదు.

"నేను చేస్తాను నెంబర్ చెప్పు బావా! ఎవరా వి.ఐ.పి" అని అడిగింది శిరీష.

"ఒక ఫ్రెండ్‌గానీ, ఇప్పుడొద్దులే" అన్నాడు.

శిరీష డిగ్రీ ఫస్ట్ ఇయర్ చదువుతోంది. బాబ్ కట్, మోడ్రన్ డ్రెస్సెస్‌తోపాటు వంట కూడా బాగా చేస్తుంది. హిందీ సినిమా పాటలు చాలా బాగా పాడ్తుంది. విసుగు రాకుండా కబుర్లు చెప్తుంది. పాలల్లో కుంకుమ కలిపిన రంగులో శిల్పంలా వుండే శిరీషకి తేనెరంగు కళ్లు స్పెషల్.

శకుంతలమ్మకి మేనకోడలంటే ప్రాణం. ఆమె అందం, చందం, పనీ, పాటా కొడుకు ముందు పొగుడ్తూ వుంటుంది. సూర్యారావుగారు కూడా "ఆడపిల్లలేని లోటు తీర్తోందే శిరీషొచ్చాకా" అంటున్నారు. శేఖర్ ఆమెని దూరంగా వుంచాలనీ, రిజర్వ్‌డుగా వుండాలనీ తెగ ప్రయత్నం చేసి చివరికి విఫలుడైయ్యాడు. యమునకి తెలియదుకదా! ఏక్సిడెంట్ విషయం. నా గురించేమనుకుంటోందో? అని ఆలోచిస్తున్నాడు. అసలామె నా గురించాలోచిస్తోందా? ఇన్నాళ్లయిపోయింది కనిపించడం లేదెందుకుని? ఆఫీస్‌కి ఫోన్ చేస్తే తెలిసేదే! చేసుండదు. ఇంటి నెంబర్ కూడా తనిచ్చాడు. అయినా చెయ్యలేదంటే మనసు మార్చుకుందేమో. యమున గడగడా మాట్లాడదు. కానీ లోతుగా అనుభవజ్ఞురాల్లా మాట్లాడ్తుంది. తననో చిన్నపిల్లాడిలా తీసి పారేస్తుంది. "నీకు జీవితం వడ్డించిన విస్తరిలాంటిది. ఇందులో వుండే కష్టనష్టాలు నీకు తెలియవు" అంది.

"నీతోబాటు అన్నీ పంచుకోడానికి నేను సిద్ధం" అంటే ఒక నవ్వునవ్వి మాట మారుస్తుంది.

యమున నవ్వు చూసి ఎన్ని రోజులయింది? ఒక్క రోజుకే గిలగిలలాడే నేను ఇన్ని రోజులెలా వున్నాననలు? నెమ్మదిగా ఆమెకి దూరమయిపోతున్నానా? అనుకుంటే ఆ ఊహకే ఒళ్లు గగుర్పొడిచింది. యమునతో జీవితం గురించి ఎన్ని కలలుగన్నాడు తను. ఎప్పుడూ ఆర్థిక ఇబ్బందులంటూ గిరి గీసుకునుండే యమునకి పెళ్లయ్యాకా ప్రపంచంలో వుండే ఆనందాలన్నీ చవిచూపించాలనుకునే వాడు. పెళ్లి కాకుండానే, తను పైసా ఖర్చుపెట్టినా

యమున గిలగిలలాడిపోయేది. యమున పుట్టిన రోజుకోసారి చీరకొంటాననంటే పెద్దగా గొడవ చేసేసింది. ఇలాంటివన్నీ నా కిష్టంలేదు. నా మనసు గాయపర్చదలుచుకుంటే చెయ్యి అది. తను మరి ఇక ఒత్తిడి చెయ్యలేదు. యమునకీ శిరీషకీ పోలికే లేదు. శిరీష గలగలా పారే సెలయేరైతే, యమున నిండుగా, నిశ్శబ్దంగా ప్రవహించే నది. తన కళ్లకి మాత్రం యమున సౌందర్య దేవత. మూతి బిగబట్టి కళ్లతో నవ్వడం, అలకలో వున్నప్పుడు జడ విసురుగా వెనక్కి వెయ్యడం, నీళ్లు నిండిన కళ్లతో బేలగా చూడడం ఇవన్నీ ఏ కావ్యనాయికకీ అందని కళలు. శిరీష చిత్రపటం లాంటిది. ఇంటి అలంకరణకి వుపయోగపడ్తుంది. యమున బాపు బొమ్మలా హృదయంలో వూయలూగుతూ అమృతం జాలువారుస్తుంది. పాలరాతి బొమ్మని తాకుతే మాసిపోతుందేమోనని భయంగా వుంటుంది. కానీ నల్లరాతితో చేసినా శృంగార దేవతలని తడిమి తడిమి చూడాలనిపిస్తుంది. గడ్డిలో పూసే రంగురంగుల పువ్వుల్ని ఎంతమంది గమనిస్తారు? కొన్ని అందాల్ని చూసి ఆనందిస్తాం కానీ స్వంతం చేసుకోవాలనిపించవు. కాఫీ తాగినట్టు గంట గంటకీ పాలు తాగడం అలవాటయిన వాళ్లు ఎక్కడా కనిపించరు. ఎంతో ఇష్టపడేవాడు కూడా రోజుకి రెండుసార్లే తాగుతాడు. కాలక్షేపం కోసం బటానీలూ, పల్లీలూ నవుల్తారుగానీ డబ్బుందికదా అని జీడిపప్పు ఎక్కువగా నవుల్తే వెగటు పుడ్తుంది. ఎంతో ఇష్టమయిన వాడు కూడా క్యాడ్‌బరీస్‌కొని చప్పరించినట్టు రోజూ పాలకోవా కొనుక్కుతినడు. యమున నీకెందుకిష్టం? అన్న ప్రశ్నకి ఒక్క మాటలో తను సమాధానం చెప్పలేడు. అన్నిటి కన్నా ముఖ్యమైనది స్పర్శ. మనిషికోరకం స్పర్శ, వాసనా వుంటాయని చాలామందికి తెలియదు. అవతలి మనిషిని తాకుతే వాళ్లు స్పందించిందీ లేనిదీ గమనించి చూస్తే మనకి తెలుస్తుంది. కొంతమందిని తాకితే చెయ్యి వెంటనే వెనక్కి లాగేసుకో బుద్ధవుతుంది. కొంతమంది స్పర్శ చాలా హాయిగా వుంటుంది. ఈ చేయి పట్టుకుని ఇలాగే బతుకంతా గడిపేయొచ్చు అనిపించేదిగా వుంటుంది. అలాగే వాసన కూడా! యమున భుజం మీద తలపెట్టుకుంటే అదో రకం సహజమైన సుగంధం ఆమె నుంచి వెలువడ్తుంది. ఎటువంటి పెర్‌ఫ్యూమ్స్ వాడని ఆమెని "ఇవాళ పసుపుతో నలుగు పెట్టుకున్నావు కదూ? నిన్న రాత్రి సన్నజాజులు పెట్టుకుని పడుకున్నావు కదూ?" అని అడుగుతుంటే ఆమె సిగ్గుపడ్తూ "అన్నీ గమనిస్తావు బాబూ, నీకు చతుష్పాదులకుండే శక్తులన్నీ వున్నాయి" అని ఎక్కిరిస్తుంది. నిజంగానే తనకు యమునని స్పృశించగానే ఆమె మూడ్ అర్థమయిపోతుంది. ఆమె మనసులో బాధపడ్తుంటే ఆ శరీరం చల్లగా అదోరకంగా వుంటుంది. ఆమె ఉత్సాహంగా వున్నరోజు నులివెచ్చగా మంచుకిరణం సోకిన మల్లెమొగ్గలా వుంటుంది. కోపంగా వున్నప్పుడు, ముట్టుకుంటే ఎక్కడ కాలుస్తుందో అనిపించే ఎండాకాలం గచ్చులా అనిపిస్తుంది. అంతగా ఆమె నాడీ, వాడీ తెలిసిన తను ఆమె లేకుండా బతకగలడా? ఇంపాజిబుల్ అనుకున్నాడు.



సంక్రాంతి శలవులిచ్చేసారు. ప్రభ ఇంట్లోనే వుంటోంది. కానీ ఈమధ్య తల్లిగారింటికి చీటికీ మాటికీ రావట్లేదు. ఆమె అత్తగారు హేమలత ఏలూర్లో గవర్నమెంట్ టీచర్‌గా పనిచేస్తుంది. ఇంకో నెల్లో రిటైర్‌మెంటు కూడా వుంది. వీళ్ల పెళ్లయిన దగ్గర్నుంచీ, శలవులకి వీళ్లు వెళ్లడమే కానీ ఆమెగారొచ్చి నాలుగు రోజులు కొడుకు దగ్గరున్నదిలేదు. అందుకే ఈసారో నెల రోజులుంటానని వచ్చింది.

ఆవిడ ఇంగ్లీషు టీచర్. అందుకే ఏమాత్రం

ఆవేశమొచ్చినా, ఆనందమొచ్చినా ఇంగ్లీషులో మాట్లాడ్తుంటుంది. ఆవిడ ఇంగ్లీషు విని విని సుధాకర్ ఆవిడకి హేమ్‌లెట్ అని పేరు పెట్టా డు. బావి దగ్గర పీటేసుకుని కూర్చుని జయ బట్టలుతుకుతుండగా హేమలతమ్మ వచ్చింది. "అదేమిటి జయా! నౌ యుఆర్ ప్రెగ్నెంట్ అలా గొంతు కూర్చుని పని చెయ్య కూడదు వెరీస్ యువర్ మైడ్?" అనడిగింది.

"రాలేదత్తయ్యగారూ, అమ్మొకత్తే చేసు కుంటోంటే సహాయం చేస్తున్నాను" అంది జయ.

"యూనిటీ ఈజ్ స్ట్రెంత్, నేనొప్పుకుంటాను. కానీ ఈ పరిస్థితుల్లో కాదు నాట్ ఇన్ దిస్ సర్‌కమ్‌స్టెన్సెస్" అందావిడ.

"వదినగారా! రండి కూర్చోండి" అని పిలిచి పీటవేసింది వర్ధనమ్మ.

"జయా ఈజ్‌వెరీ స్వీట్" అందావిడ. "ఏమిటీ స్వీటా, కాజాలున్నాయి తింటారా?" అడిగింది అమాయకంగా ఆవిడ.

"అది కాదండీ, జయ చాలా మంచి తీపిపిల్ల అంటున్నాను" అంది అనువదిస్తూ.

"దానికేం జబ్బేదీ లేదు, తొమ్మిదోనెల వస్తుంది కదా! అందుకే కాస్త వుబ్బుగా కని పిస్తోంది" అంది గాభరాగా.

"మైగాడ్! మీ అమ్మాయి చాలా మంచి పిల్ల! ఇంగ్లీషులో అలా తియ్యని పిల్ల అంటా రు" అని విడమర్చి చెప్పింది.

"మనుషుల్లో తీపీ, కారం వుంటాయా?" అని నవ్వింది వర్ధనమ్మ.

"అక్కేం చేస్తోందీ?" అడిగింది జయ.

"క్లీనింగ్ డిషెస్" అందావిడ.

"అంటే?" కుతూహలంగా అడిగింది వర్ధన మ్మ.

"అంట్లు తోముతోందిట" అంది జయ.

"దానికి కూడా అంత చక్కని పేరు పెట్టాడా తెల్లవాడు? మనమూ అలాగే అనుకుందామె ఇప్పట్నించీ" అని సరదా పడింది వర్ధనమ్మ.

"ఫెస్టివల్ స్పెషల్సేమిటి? పండక్కి ఏం చేస్తున్నారూ?" అనడిగిందావిడ.

"స్టాంపింగ్ బాల్స్" అంది ఠక్కున జయ.

"అవేమిటి? నెవర్ హెర్డ్" అని ఆశ్చర్యపో యిందావిడ.

"తొక్కుడు లడ్లు" అని కిసుక్కున నవ్వింది జయ.

"యూఆర్ నాటీ" అని ఆవిడ కూడా నవ్వింది.

"మీరేం చేద్దామనుకుంటున్నారూ?" అడి గింది వర్ధనమ్మ.

"ఏం చేస్తాను కొడంగ్" అంది విసుగ్గా ఆవిడ.

"అదేదో కొత్త స్వీటేమో కనుక్కోవే జయా! పెద్ద పండగనాడు చేసుకుందాము" అనగానే హేమలతమ్మ, జయా పడీపడీ నవ్వసాగారు. అదేమిటో తెలుగులో చెప్పాకా ఆవిడ కూడా నవ్వేసింది.

ఇంతలో స్కూల్‌నుండి పిల్లలొచ్చారు. మధు జయ దగ్గరకు పరిగెత్తుకుంటూ వచ్చి "నీ కోసమేం తెచ్చానో చెప్పుకో!" అన్నాడు.

"చాక్లెట్" అంది జయ.

వాడు కాదని తల అడ్డంగా వూపాడు.

"రేగివండ్లు" అంది. వాడు మళ్లీ తల అడ్డంగా వూపాడు.

"ఆఁ... సంపెంగపూలు" అంది.

"కాదు, నువ్వోడిపోయావు కాబట్టి నేచె ప్పింది చెయ్యాలి" అన్నాడు వాడు.

"అబ్బా అదేమిటో త్వరగా చెప్పు, గుంజీలు తియ్యమంటే మాత్రం నావల్ల కాదు" అంది.

"అదేం కాదులే! చింతపండూ, జీలకర్రా, వుప్పూ దంచి వుల్లకి చుట్టి పెట్టు, బట్టలు మార్చుకునొస్తా" అన్నాడు.

"ఇంతకీ నాకేం తెచ్చావు?" అనడగగానే వాడు నుదురు కొట్టుకుని "మర్చిపోయాను ఇదీ.." అంటూ ఓ ఇన్‌లాండ్ కవరిచ్చాడు. "పోస్ట్‌మేన్ దార్లో కనిపించి ఇచ్చాడు, ఇంటి నెంబర్ కూడా సరిగ్గా వెయ్యకుండా జయప్రద అని రాసేస్తే వచ్చేస్తుందా? వాడు వారంనించీ తిరుగుతున్నాడట. ఇవాళ నేనే అడిగాను దార్లో కనిపిస్తే, జయప్రద పేరు మీదేమైనా ఉత్తర మొచ్చిందా? అని. నా కాళ్లు పట్టుకున్నంత పని చేసి మరీ ఇచ్చాడు" అన్నాడు వాడు.

వాడికి తన మీదున్న అభిమానానికి కళ్లల్లో

నీరు తిరిగింది జయకి. వాణ్ణి దగ్గరకు తీసుకుని ముద్దుపెట్టుకుంది.

"నయమే! లెటర్ పోస్ట్‌మేన్ తెచ్చివ్వలేదు" అంది హేమ్‌లెట్ వెంటనే.

మధు చప్పట్లు కొడ్తూ పెద్దగా నవ్వేడు.



అర్థం కాకపోయినా పూజా, వర్ధనమ్మగారూ నవ్వేశారు.

"ఆంటీ ఈజ్ వెరీ నాటీ" అంటూ జయ ఉత్తరం తీసుకుని డాబా మీదికెళ్తుంటే" నా చింతపండూ, పుల్లా" అని గుర్తు చేశాడువాడు.

"అలాగే, అలాగే" అంటూ వెళ్లిపోయింది.

జయకి పెళ్లయ్యాక శశిధర్ రాసిన మొదటి ఉత్తరం అది. నెమ్మదిగా విప్పి పెదవుల కాన్చుకుంది. శశిధర్ మీసాలు గరుగ్గా తగిలిన ట్టనిపించి "ఛీ పాడూ" అని నవ్వుకుంది.

"జయా! నీ ఉత్తరం చూడగానే కోపమొచ్చింది తెలుసా!"

"ఎందుకబ్బా!" అనుకుంది.

"నేనిక్కడ నానా కష్టాలూ పడ్తుంటే హాయిగా వున్నావా?"

ఓహో! అబ్బాయిగారికి పెళ్లాం లేకపోతే పడేపాట్లు తెలిసొచ్చాయి కాబోలుననుకుంది.

"ఒక్క షర్టు వారం రోజులు వేసుకుంటున్నాను"

"ఛీ" అనుకుంది ముక్కు చిట్లించి.

"గడ్డం అసలు నువ్వు వెళ్లాక చేసుకోలేదు"

"నాకేం బాధ" అని నవ్వుకుంది.



''పక్క బట్టలు మార్చే దిక్కేలేదు. అన్నం రోజూ చల్లగా అయిపోయి, సరైన ఆధరువులు లేక ఏడుపొస్తోంది''

''అయ్యయ్యో'' అని జయ మనసు విలవిలలాడింది.

''మొన్నేం జరిగిందో తెల్సా! చూసుకోకుండా చిరిగిపోయిన షర్టేసుకెళ్లాను. కాఫీ వెచ్చపెట్టుకుంటుంటే పట్టకారు పట్టియ్యక చేతిమీద పడిపోయింది. చిన్న బొబ్బే వచ్చిందనుకో! బుజ్జిగాడు పుట్టకముందే నన్ను సతాయించేస్తున్నాడు. పుట్టాకా అసలు నన్ను పట్టించుకోవేమో నువ్వు. మొగపిల్లాడైతేనే మంచిదిలే. అమ్మ సణక్కుండా వుంటుంది. అక్కా, అమ్మా రోజూ వంట గురించి పోట్లాటే, నువ్వుంటే పాపం తెలిసేది కాదు. మొన్నెప్పుడో ఓ తెలుగు సినిమా చూశాను. అందులో హీరో భార్య కడుపుతోటుంటే ఎంతో అపురూపం చేశాడు. అన్నం కలిపి తినిపించాడు, జడవేశాడు, చివరికి చీర కూడా... నేను నీకు కనీసం పల్లీలు కూడా కొని తినిపించలేదని నాకప్పుడు గుర్తుకొచ్చింది. ఇంకోసారి నేను కూడా అవన్నీ చేస్తాలే. ఇప్పుడు నాకు కొత్తకదా!''

జయకి పకపకా నవ్వొచ్చేసింది.

''మీ ఇంట్లో వాళ్లందర్నీ అడిగానని చెప్పు. మా అక్కా వాళ్లల్లా టీవీలూ సినిమాలూ ఎక్కువ చూడకు! పుట్టేవాడికి కూడా అ బుద్ధులే వస్తాయి. ఇంట్లో ఎప్పుడు చూసినా జాతరలా వుంటుంది. అందుకే నేను ఎక్కువ సేపు బైటే వుంటున్నాను. ఫిబ్రవరి మొదట్లో కదా డాక్టరిచ్చిన డేటు, అలాగే వస్తాలే. ఔను మర్చేపోయాను. నువ్వు మందులవీ సరిగ్గా వేసుకుని, రెస్టదీ తీసుకుంటున్నావా? అయినా మీ వదినకన్నీ తెలునులే! ఆవిడ చూసుకుంటుంది. నేనెప్పుడూ ఉత్తరాలు రాయలేదు అందుకని తప్పులుంటాయి. ఎవ్వరికీ చూపించకు నవ్వుతారు. ఇంక ఆపేస్తున్నాను. తొందరగా జవాబురాయి'' అని సంతకం చేశాడు.

ఒకటికి పదిసార్లు చదువుకుంది జయ. ఫర్వాలేదు ఈయనకి కూడా కొన్ని తెలుస్తున్నాయి అనుకుంది.

క్రిందినుంచి ''అత్తా'' అన్న మధుగాడి పిలుపు వినిపించి ''అయ్యయ్యో! వాడడిగింది చేసివ్వనేలేదు'' అనుకుంటూ కిందికొచ్చింది. అప్పటికే వాడు ఫ్రెండ్స్‌తో ఆటకెళ్లిపోయాడు.

''పిచ్చి వెధవ! నే వచ్చేవరకూ ఆగలేదు'' అంది బాధగా. ''టామెరెండ్ స్టిక్స్ నేచేసిచ్చాలే'' అంది హేమ్‌లెట్.

★ ★ ★

''ఆడపిల్లకదా! సక్రాంతి పండక్కి రమ్య చేత బొమ్మలు పెట్టించు. బోలెడున్నాయిగా'' అంది తులశమ్మ, మంచం మీద కూర్చుని.

''చిట్టెమ్మతో చెప్పత్తయ్యా'' అని బైటికెళ్లిపోయింది సింధు.

''ఏమిటీ పిల్ల! పిల్లకొళ్లు కాలుతోందంటే చిట్టెమ్మతో చెప్పమంటుంది. అబ్బాయి ఎవర్నో ఇంటికి పిలిచాడుట... అంటే చిట్టెమ్మతో చెప్పమంటుంది. మీ ఆడబొడుచూ వాళ్లొస్తారట... అంటే చిట్టెమ్మతో చెప్పమంటుంది'' అనుకుంది.

తులశమ్మగారింకా ఇంట్లో అటూ ఇటూ తిరగట్లేదు కానీ చేతికర్ర తీసుకుని బాత్రూం కదీ వెళ్లొస్తోంది. అరుణ్ తల్లి ఓ రోజొచ్చింది. బాగానే మాట్లాడింది. సాయంత్రం సింధు రాగానే చెప్పి వెళ్లిపోతానంది. ''వొద్దు బామ్మా, మా ఇంట్లో వుండు, ఈ అమ్మమ్మకి తోడుగా'' అని పిల్లలు ఏడ్చారు.

''వుండండి, పిల్లలడుగుతున్నారుగా'' అంది సింధు. ఏమనుకుందో వుండిపోయిందావిడ. అరుణ్ రాత్రి ఆలశ్యంగా ఇంటికొచ్చాడు. తల్లిని పలకరించి, తులశమ్మగారి ఆరోగ్యం గురించి ప్రశ్నలు వేసి గదిలోకెళ్లాడు. ఇంతలో సింధు కోసం బిలబిలలాడుతూ పదిమంది స్టూడెంట్స్ వచ్చారు. తన స్టడీ రూంలోకి తీసుకెళ్లి, వాళ్లతో బిజీ అయిపోయింది సింధు. చిట్టెమ్మ వచ్చి భోజనానికి పిలిచింది. ''నాకు ఆకల్లేదు'' అని చెప్పి ఓ గ్లాసెడు మజ్జిగ తీసుకుని తాగొచ్చిందావిడ. తులశమ్మ రాత్రి పూట అన్నం మానేసిందీమధ్య. ఆవిడకి రెండు పుల్కాలూ, పాలూ రోజూ రాత్రి ఇమ్మన్నాడు డాక్టర్. పిల్లలకన్నాలు పెట్టి తను తిని,

అన్నీ మూతలు పెట్టేసి పడుకుంది చిట్టెమ్మ.

తొమ్మిదయిపోయినా వచ్చిన స్నేహితులు వెళ్లడం కనిపించలేదు. అరుణ్ పది వరకూ చూసి కాస్త అన్నం పెట్టుకుని తిని పడుకున్నాడు. సింధు వాళ్లని పంపించేటప్పటికి పదకొండున్నరయింది. లోపలికొచ్చి కాంప్లాన్ కలుపుకుని తాగింది.

''అన్నం తిన్నావుటే?'' అడిగింది తులశమ్మ.

''వద్దు'' అని వెళ్లి మళ్లీ చదువుకోసాగింది.

వాళ్లత్తగారు తులశమ్మ గదిలోనే పడుకుంది. ''ఇదమ్మా సంగతి! వాడక్కడా, ఈవిడక్కడా, రోజూ ఇంతే! ఓ అచ్చటా ముచ్చటాలేదు వాడి ముఖాన. ఏం వయసు మించిపోయిందని చెప్పండి? ఇవన్నీ చూస్తే నా తల్లి ప్రాణం తట్టుకోలేదు'' బాధగా చెప్పిందావిడ.

''ఇవేళ అమ్మాయికి కాస్త పనెక్కువగా వున్నట్లుంది'' సమర్థించుకుంది తులశమ్మ.

''ఏనాడు తక్కువుందిగనక? పెళ్లయిన ఓ నెల రోజులు సరదాగా గడిపారేమో అంతే. ఆ తర్వాత నించీ ఇదే కథ!'' విరక్తిగా చెప్పిందావిడ.

''అందరూ ఇలాగే హైరాన పడుతున్నారా? కాలేజీ నుంచొచ్చాకా కూడా ఇలా హడావిడి పడడం ఎందుకమ్మా? తనకు మాత్రం ఇలా ఎంతకాలం ఓపికుంటుందీ?'' అంది మళ్లీ.

తులశమ్మకేం చెప్పాలో తోచలేదు. సింధుని తప్పుపట్టలేదు. అలా అని ఆవిడన్న దానిలో ఏం తప్పు కనిపించటం లేదు. అరుణ్ విషయంలో అసలు వంక పెడ్దామన్నా కనిపించటంలేదు. అతని వినయం, అణుకువా ఆమెనాకర్షించాయి. అప్పుడప్పుడు సింధు రేగి గట్టిగా ఏమైనా అన్నా అతను పెదవి తొణకడు. గదిలో ఒంటరిగా ఏమైనా అంటాడేమో మరి తెలియదు. ఇక ఇంట్లో అంతా చిట్టెమ్మదే రాజ్యం.

మర్నాడు ప్రొద్దుటే ఆవిడ మడిగట్టుకుని పూజ చేసుకుని, వంటకుపక్రమించింది. సింధు ఇంకా లేవలేదు. ఆవిడ బియ్యం కడిగిపెట్టగానే, చిట్టెమ్మొచ్చి మూతతీసి గరిటెతో కలియబెట్టసాగింది.

''అయ్యయ్యో, నువ్వెందుకు ముట్టుకున్నావు? మడితో వండుకుంటుంటే'' అనరిచిందావిడ.

''నాకివేం తెలియవు. పిల్లలెళ్లే లోపల వంట కావాలి. మీరు కావలిస్తే అంత పనీ అయ్యాకా మళ్లీ మడిగట్టుకుని చేసుకోండి'' అంది.

''నేను తర్వాత వండుకోవాలా? ఎంత ధైర్యం నీకామాట అనడానికి? అసలు నువ్వెవరా మాట చెప్పడానికి? ఇది నా కొడుకిల్లే'' అరిచిందావిడ.

''మీరెప్పుడో ఒక్కరోజొచ్చిపొయ్యేవాళ్లు. నేను నిత్యముండేదాన్ని. ఇక్కడి పద్ధతులూ, పనీపాటలు నాకు తెలుస్తాయి కానీ మీకు కాదు'' అంది గట్టిగానే.

''పని దానివి నీకెంత అలుసైపోయాను? ఎప్పుడో ఒక్క రోజొచ్చిపోయేదాన్నా? అవును, మంచి మాటే అన్నావు. నిజంగానే నాకెక్కడుందీ ఇంట్లో స్థానం'' అనావిడ ఏడవసాగింది.

ఈ గొడవకి అరుణ్, సింధూ లేచి బైటికొచ్చారు.

నాకేం తెల్సమ్మా కొత్త పద్ధతులు, నేను మామూలుగా పిల్లలెళ్లే వేళకి వంట చెయ్యాలని వంటింట్లోకొచ్చాను. ఈ అమ్మగారు గొడవ గొడవగా మాట్లాడ్తున్నారు. పని దానివి అంటూ ఎత్తి పొడుస్తున్నారు. నన్ను తక్కువగా చూస్తే నేను నిమిషం కూడా ఇక్కడ వుండను. మేమూ బాగా బతికిన వాళ్లమే. ఆ సంగతి తెలుసుకుని అమ్మగారూ, అయ్యగారూ నన్ను చాలా గౌరవంగా చూస్తారు. ఒక్క మాట కూడా అనరు'' అంది.

''ఎందుకు చూడరూ! అయిన వాళ్లకు ఆకుల్లో కాని వాళ్లకి కంచాల్లో పద్ధతికదా ఈ ఇంట్లో'' అందావిడ కసిగా.

ఈ మాట తులశమ్మ గుండెల్లో వాడిగా గుచ్చుకుంది. సింధు తలెత్తి సూటిగా అరుణ్ కళ్లలోకి చూసింది.

అతను వెంటనే చూపులు మరల్చుకుని ''పోనీలేమ్మా, చిన్న విషయానికింత గొడవెందుకు? చిట్టెమ్మా ఈ రోజుకి పిల్లలకి బ్రెడ్,

జామ్ పెట్టి పంపించూ, వెంటనే వెళ్లి నీ పని చూసుకో! అమ్మా నీ పని నువ్వు చూసుకో! నువ్వున్నంత వరకూ చిట్టెమ్మ వంటింట్లోకి రాదు. సరేనా!'' అన్నాడు.

దాన్నొక్క మాటైనా అనకుండా నన్నిన్ని మాటలంటావా? నేను గొడవ చెయ్యడానికొచ్చానురా? వుండమన్నారని ఒక్క పూట వున్నాను కానీ, లేకపోతే నేనుంటానా? నాకు తెలియదూ! ఏమాత్రం స్వతంత్రముందో నీ ఇంట్లో'' అని కొంగుతో కళ్లు తుడుచుకుంటూ ఆవిడ గదిలో కెళ్లిపోయింది.

అరుణ్ మనసులో దేవేసింది. అమ్మ రాత్రి కూడా అన్నం తినలేదు. ఆవిడ చాదస్తం ఆవిడదీ. ఈ చిట్టెమ్మ కెందుకంత నోరు. పనిమనిషంటే తప్పేమిటి? మేమందరం పని మనుషులం కాదా? ఎక్కడో ఒక చోట పనిచేస్తున్నప్పుడు పని చేసేవాళ్లు అంటే తప్పేమిటి?'' అనుకున్నాడు. కానీ ఆ మాటలు బయటికంటే వాటి పర్యవసానం తనూహించగలడు. చిట్టెమ్మ మానేసినా మానేస్తుంది. దాంతో సింధు శివాలెత్తిపోతుంది. అటు బయటా ఇటు ఇంట్లో చేసుకోలేక సింధు ఎంత మథనపడిపోయేదో తనకు తెలుసు. రాత్రుళ్లు పిచ్చిపిచ్చిగా కలవరించేది. ఈ మధ్యనే పనెక్కువగా వున్నప్పటికీ మనశ్శాంతిగా వుంటోంది. చిట్టెమ్మ మీద మొత్తం ఇంటి పని భారమంతా వేసేసింది. ఈ పరిస్థితుల్లో చిట్టెమ్మ మానేస్తే ఇంకేమయినా వుందా? మళ్లీ ఇలా పని చేసే మనిషి దొరకకపోవచ్చు. దాంతో సింధు విసుగూ, రుసరుసలూ మళ్లీ మొదలు. అందుకని ఏమీ అనకపోవడమే ఉత్తమం. కానీ మరి తల్లి పరిస్థితేమిటి? ఇన్నాళ్లనించీ అలవాటైన పద్ధతులు మానుకోవడం, ఆవిడ తరం కాదు. ఆ మాటకొస్తే ఎవ్వరి తరం కాదు. అందుకే అక్కింట్లో వుంటోంది. బావగారు చాలా మంచి వారు. దేవుడని చెప్పుకోవచ్చు. తన తల్లిలాగే చూసుకుంటారు అమ్మని. ఆ విషయంలో ఆవి డదృష్టవంతురాలు. అక్క కూడా ఆవిడెలా చెప్తే అలా నడుచుకుంటుంది. ఇక్కడ తననే మైనా అన్నా భరించదు. ''చిన్నవాడు వాడ్నేం దెప్పకు, ఈ వచ్చేది కూడా మానేస్తాడు అంటూ వెనకేసుకొస్తుంది. తననే కాదు సింధుని కూడా చాలా వెనకేసుకొచ్చి మాట్లాడ్తుంది. ''ఎంత పెద్ద ఉద్యోగమో నీకేం తెల్సు! అంత పెద్ద హోదా వూరికే వస్తుందా? అందుకు తగ్గ పని కూడా చెయ్యాలిమరి. లేకపోతే గౌరవముండదు'' అని తల్లికి చెబుతూ వుంటుంది.

సింధు పద్ధతులు సింధువే తను మారదు.

అమ్మ పద్ధతులు అమ్మవే. ఆవిడ మారదు.

మధ్యలో ఇరుకునపడి నలిగిపోతున్నది నేనేగా అనుకున్నాడు బాధగా.

''ఇల్లన్నాకా ఏవో గొడవలొస్తూనే వుంటాయి. వెళ్లిపోకండమ్మా'' అంది తులిశమ్మ బుట్ట సర్దుకుంటున్న అరుణ్ తల్లితో. ''నాకిది మొదటిసారి కాదండీ, కొడుకుమీద మమకారంతో పుట్టెడాశ పెట్టుకుని రావడం, భంగపడి వెళ్లిపోవడం నా కలవాటే. పిల్లలు వుండమని వలపలాడ్తారుగదాని వుంటే ఇదిగో ఇలాగే వుంటుంది. ఇంత జరిగినా ఆ అమ్మాయి ఏమైనా నోరువిప్పి మాట్లాడిందా! చూడండి ఆ నిర్లక్ష్యం'' అని కొంగుతో కళ్ళొద్దుకుంది.

''అనుభవం లేకపోవడంవల్ల ఇలా జరుగుతోంది. మనసులో ఆపేక్షలు లేకకాదు. మీరిలా వెళ్లిపోతే నాకెంత సిగ్గుగా వుంటుందో ఆలోచించండి. నిజానికి మీరుండాల్సిన స్థానమిది. చూసే దిక్కులేకుండా అక్కడ పడున్నానని తీసుకొచ్చింది సింధు'' అందావిడ సిగ్గుపడ్తూ.

''మిమ్మల్ని గురించి నేనేమన్లేదు, మీకు బాధ కలిగితే క్షమించండి, నన్నాపకండి, వెళ్ళనీయండి'' అంటూ బుట్ట పట్టుకుని హాల్లోకొచ్చింది.

''బామ్మా వెళ్ళిపోతున్నావా?'' అంటూ వచ్చి చుట్టుకుంది రమ్య.

''అవునమ్మా వెళ్ళాలి, అక్కడ పనుంది'' అందావిడ దాన్ని ముద్దు పెట్టుకుంటూ.

''వెళ్ళడానికి వీల్లేదు. వుండాల్సిందే'' అంటూ ఆవిడ బుట్ట పట్టుకుని గుంజి హఠం చెయ్యసాగాడు తేజా.

ఆవిడకి కళ్లనిండా నీళ్లొచ్చేశాయి. ''పదండి పదండి, ఆటో వచ్చేస్తుంది'' అంటూ చిట్టెమ్మ తేజని బలవంతంగా ఎత్తుకుని, రమ్యని లాగుతుండగా ''అంతా నీవల్లే, మా బామ్మని ఏదో అన్నావ్, ఎందుకన్నావు?'' అంది కోపంగా

రమ్య.

చిట్టెమ్మ మొహం గంటుపెట్టుకుని వెళ్ళి సింధుతో "పాప కూడా కేకలేస్తోంది నామీద. నేనేం తప్పు చేశానమ్మా? జీతమిస్తున్నారు. జీతానికి తగ్గపని చేస్తున్నాను. టైమయిపోతుందని గబగబా రమ్మన్నాను అది కూడా తప్పేనా?" అని అడిగింది.

సింధు వెంటనే "రమ్యా వెళ్లు, వెళ్లి తయారవ్వు, పెద్ద పెద్ద మాటలూ, చేతలూ ఎక్కువయ్యాయి ఈమధ్య" అంటూ కోప్పడింది.

రమ్య ఏడుస్తూనే చిట్టెమ్మతో వెళ్ళిపోయింది. "ఎందుకమ్మా పెద్దవాళ్లమీద కోపం చిన్నపిల్లలమీద చూపిస్తావు? వాళ్లనేడిపిస్తే నేచూసూర్కోలేననేగా" అందావిడ డగ్గుత్తికతో గొంతు పూడిపోతుంటే.

"ఏమిటండీ మీరు మరీ! వచ్చినప్పుడల్లా కళ్లనీళ్లు పెట్టుకునే వెళ్తారెందుకు? ఇప్పుడేం జరిగిందనీ? తనవని తను చూసుకుందామని గభాల్న వంటింట్లో కొచ్చిందేమో తను. చెప్పి పంపించేస్తే సరిపోయేదానికింత గొడవ చేశారు. మిమ్మల్నెవరో నిర్దయగా వెళ్లగొట్టినట్టు మీరేడ్చి, పిల్లల్నేడిపించి, మమ్మల్ని బాధపెట్టి వెళ్తారు" అంది విసురుగా సింధు.

"సింధూ" అన్నాడు అరుణ్ కోపంగా.

సింధు మరిమాట్లాడకుండా గదిలో కెళ్లిపోయింది.

"పదమ్మా, నిన్ను దింపేస్తాను" అని బుట్ట తీసుకుని నడిచాడు. ఆవిడ తులశమ్మవైపు తిరిగి "వెళ్లొస్తాను" అని చెప్పి కొడుకు వెంట వెళ్లిపోయింది. వెక్కిళ్లు పెడ్తూ "టాటా బామ్మా" అన్నారు పిల్లలిద్దరూ. యుద్ధంలో ఓడిపోయిన సైనికుడిలా తలకిందికి వొంచుకుని నడిచాడు అరుణ్.

సింధు దిండులో తలదాచుకుని వెక్కి వెక్కి ఏడ్చింది. "ఆ చిన్నారుల మనసుల్లో తల్లిమీద ఎంత కసేర్పడుతుందీ? పిలిచి అవమానించినట్లయిందా మేనత్తని. కొడుకింట్లో ఒక్కపూట అన్నం తినకుండా చేసినట్లుందా తల్లిని. నెలకిన్ని వేలు సంపాదిస్తూ కూడా తల్లిని ఇంట్లో వుంచుకునే అర్హత లేనివాడిలా అయింది అరుణ్ పరిస్థితి. బావకీ అరుణ్‌కీ ఏమిటి తేడా? బావ నర్మదకి భయపడి మరీ అధ్వాన్నంగా ప్రవర్తించాడు. అరుణ్ అంతకాదు. అత్తయ్యకి కొడుకు తప్ప ఎవరూ లేరు కాబట్టి ఇన్నాళ్లనించీ అక్కడే పడివుంది. తనత్తగారికి కూతురుండబట్టి అక్కడ గడుపుకుంటోంది. తనకి నర్మద ప్రవర్తనమీద ఎంత అసహ్యం కలిగింది? అలాగే ఇవన్నీ తల్లెళ్లి చెప్తే వసుధకి కూడా తనమీద అసహ్యం కలుగుతుంది కదా! ఒక్కపూట అన్నమైనా పెట్టకుండా పస్తు పెట్టి పంపించారు అంటుందికదా. ఛీ, ఛీ, తన సంస్కారం, తన చదువూ ఏమైపోయాయి? తనెందుకసలు అలా మాట్లాడింది? చిట్టెమ్మ మానేస్తే మానేసిందని నాలుగు తిట్టుండాల్సింది. ఆవిడ ఎలా చెబితే అలా చెయ్యి. ఎదిరించకు అని కోప్పడాల్సింది. ఇప్పుడివన్నీ అనుకునేం లాభం! అరుణ్ ఎప్పుడో అన్నాడు. నిన్ను చేసుకున్నందువల్ల తల్లికి రుణం తీర్చుకోలేని మాతృద్రోహినయ్యాను. కొడుకుండీ లేనివాళ్ళల్లో జమకట్టి నా తల్లి పరాయివంచన పడివుందని. ఇప్పుడు కూడా తనవైపెంత ఏవగింపుగా చూశాడనీ! ఎందుకిలా జరుగుతోంది? పరిస్థితుల ప్రభావమా లేక తనలో లోపముందా? తనొట్టి స్వార్థపరురాలా? నర్మదకీ తనకీ తేడా లేదా? భర్తకంటే ఎక్కువ సంపాదిస్తున్నానని తనకి కూడా అహంకారమా? అరుణ్ ఏమీ అనలేనివాళ్ళా ఎందుకూర్కుంటాడు? ఒకవేళ తనని ఆవిడ ముందే దులిపేసి 'మా అమ్మ ఇక్కడే వుంటుంది. ఆవిడ చెప్పినట్టు విను' అంటే తను సహించగలదా? ఈ పరిస్థితులలా సాగవలసినవేనా?"

ఆ పూట ఆ ఇంట్లో ఒకే విస్తరి లేచింది. అది చిట్టెమ్మది.

★ ★ ★

"వదినా ఏం చేస్తున్నారు?" అంటూ వచ్చింది ఎదురింటి మీనాక్షి.

వొత్తులు చేస్తున్న కాత్యాయిని "రండొదినా, ఇప్పుడే పనయింది" అని పిలిచింది.

"నాలుగురోజుల బట్టీ వద్దామనుకుంటున్నాను, కుదరట్లేదు. ఇదిగో ఈరోజు తీరిక చేసుకుని మరీ వచ్చాను. నీతో ఓ విషయం మాట్లాడాలనీ" అంది.

"ఏమిటొదినా?" ఖంగారుగా అడిగింది. "అంతగా ఖంగారుపడాల్సిందేమీ కాదు కానీ, మన యమున పెళ్లి విషయం ఏం చేశారూ? మా మేనమామ మనవడు ఈ వూళ్లోనే బ్యాంక్‌లో ఉద్యోగం చేస్తున్నాడు. నెలకు మూడువేలకు పైగా సంపాదిస్తున్నాడు. మన యమునకు ఈడుజోడుగా వుంటాడు. అంటుండగా-

"అంతలేసి సంబంధాలు మనకందుతాయా? మేమేమీ ఇచ్చుకోలేమని నీకు తెలుసుగా" అంటూ అశక్తత వ్యక్తం చేసింది కాత్యాయిని.

"వాళ్లకు ఒక్కపైసా కట్నం కూడా అఖ్ఖరలేదమ్మా!" అని కాసేపాగి

"అబ్బాయికి పెళ్లయిన ఆర్నెల్లకే భార్య పోయింది. అదొక్కటే లోపం" అని చల్లగా చెప్పింది.

"ఆ... రెండో సంబంధమా?" అంది బాధగా కాత్యాయిని. "అదేవిటమ్మా పిల్లా, జెల్లా? బాదరబందీ లేని చక్కని సంబంధం. ఇదే సంబంధం ఈ కాస్త మచ్చా లేకపోతే మీ కందుబాటులో వుండేదా? లక్షకి తక్కువ గాకుండా అడుగుతారు. మొదటిసారి కట్నం తీసుకుంటే అచ్చిరాలేదని గానీ, వీడికి మళ్లీ ఇవ్వరని కాదు. ఇంత మంచి సంబంధం తీసుకురావాలంటే మీ తరంకాదు. ఏదో మీ మీదున్న అభిమానంకొద్దీ ఇంతలా చెప్తున్నాను. అన్నయ్యగారితో చెప్పు. నీకాట్టే అనుభవం లేక అలా మాట్లాడ్తున్నావు" అని జ్ఞానబోధ చేసింది.

"అమ్మాయేం అంటుందో... అంది కాత్యాయిని.

"సరే! ఇదిగో అబ్బాయి వివరాలు" అంటూ ఓ కాయితం అందించి "పిల్ల ఇదివరకు ఎంత బావుండేదనీ! ఈమధ్య చిక్కిపోయి బుగ్గల్లోపలికిపోయి, కళ్ళూ, ముక్కూ మాత్రమే కన్పిస్తున్నాయి. ఇంకో ఏడాదిపోతే ఈ రూపూ వుండకపోవచ్చు. ఏ వయసులో ముచ్చట ఆ వయసులో అన్నారందుకే పెద్దలు. దాని వయసువాళ్ళందరూ పెళ్ళిళ్ళయి ఏడాది తిరిగేలోపుగా బిడ్డల్నందుకుంటుంటే దానికెలా వుంటుందో ఆలోచించు! మరబొమ్మలా ఆ ఉద్యోగం, ఇంట్లో చాకిరీ తప్ప ఏం అనుభవిస్తోందీ వయసులో? ఇంక వాళ్లకి వాళ్ల ఇల్లు, సంసారం అనేవి కావాలన్పిస్తాయమ్మా. పరువు గల ఇంటి ఆడపిల్లలు ఆమాట బైటికి చెప్ప లేక, లోలోపలే మధనపడి చిక్కిపోతారు. ఈ వయసులోనే మనం జాగ్రత్తపడాలి. వస్తా, చాలా పనుంది" అని చెప్పి లేచి వెళ్లిపోయింది. ఆమె ఎప్పుడెళ్ళిపోయిందో కూడా గమనించలేదు కాత్యాయిని.

మీనాక్షి మాటలు బుర్రలో గిరగిరా తిరగసాగాయి. "అవును, నేను కనుక్కోలేకపోయాను. యమునీమధ్య చాలా చిక్కిపోయింది. ఇదివరకటి ఉత్సాహమే లేదు అనుకుంది.

ఆ రాత్రి రామారావుగారూ, యమునా, శరత్ అందరూ కూర్చుని అన్నాలు తింటుండగా ఎదురింటావిడ చెప్పిన సంబంధ విషయం చెప్పేసింది కాత్యాయిని. "పెళ్లయిన ఆర్నెల్లకేకదా! అంత అభ్యంతర ముండదనుకుంటాను యమునకి" అంది మీనాక్షి. "పిల్లాడు బావుంటాడట. గొప్పవాళ్లుట కూడానూ. మనలా అన్నింటికీ తడుముకో నక్కరలేదుట" అని చెప్పి ఆగి ఒక్కసారి అందరి వైపూ చూసింది.

యమున మౌనంగా తింటోంది. శరత్ తినడమాపి తల్లివైపే చూస్తున్నాడు. రామారావుగారు తనని కాదన్నట్టు "ఆ చారుగిన్నె ఇలా పెట్టు" అన్నారు.

"ఏమిటీ మాట్లాడరూ!" అంది.

"చారు బావుంది" చెప్పాడాయన.

"అదికాదండీ నేచెప్పిన విషయం..."

"కొత్తిమీర వెయ్యలేదా? వేస్తే ఇంకా దివ్యంగా వుండేది"

"అబ్బబ్బా, నేనేం అంటున్నానో పట్టించుకోకుండా మీ ధోరణి మీదేగదా" నెత్తి కొట్టుకొంది కాత్యాయిని.

"చింతపండూ, నీళ్ళూ, ఉప్పూ, పోపూ అన్నీ కలిస్తేనే చారవుతుంది. కొత్తిమీరలాంటి చిన్న విషయం మర్చిపోయినా అది చారే అవుతుంది. కానీ కొంచెం రుచి కోల్పోతుంది. అలాగే జీవితం కూడా. వరుడు డబ్బున్నవాడూ, చదువున్నవాడూ, గుణమున్నవాడూ

అయితే చాలనుకుంటాము మనం. కానీ తన భర్త అన్నీ వున్నా కొత్త పెళ్లికొడుకు కాడు. ఇదివరకోసారి దాంపత్య జీవితం అనుభవించి నవాడే అని తలుచుకుంటే ఆడపిల్లకంత ప్రియంగా వుండకపోవచ్చు. అయినా ఎవరి రుచులు వాళ్ళవీ, ఎవరి ఇష్టాలు వాళ్ళవీ, మనమేం చెప్పగలం, ఎవరికి వాళ్లే తేల్చుకో వాలి?'' అన్నాడాయన మజ్జిగ గిన్నందు కుంటూ.

''దాని మొహం! దానికేం తెలుసు? కావేరిని మాత్రం మనమడిగామా? నీకిష్టమా? కాదా అని'' అందావిడ.

యమున లేచి వెళ్లిపోయింది.

''అదేమిటే మజ్జిగ పోసుకోలేదూ!'' అనడి గింది.

''మీ ఆడవాళ్లు కంచంలో అన్నం పెట్టి, గుండెల్లో రైళ్లు పరిగెత్తే విషయాలు చెప్తారు. ఎదురింటావిడ కోడలు నీళ్లోసుకుందని చెప్పి నంత తేలిగ్గానూ, వెనక వీధిలో గుర్నాధం గుండాగి చనిపోయాడనీ చెప్పగలరు'' అన్నా రాయన చెయ్యికడుగుతూ.

శరత్ నవ్వుతూ లేచెళ్లిపోయాడు.

చెయ్యి తుడుచుకోడానికాయనకి తుండు గుడ్డిస్తూ ''అది కాదండీ...'' అని సందేహంగా ఆగిపోయింది. ఆవిడ మనసులో మీనాక్షి చె ప్పిన విషయాలన్నీ ఆయనతో చెప్పాలనీ, యమున పరిస్థితి తనకర్థమయింది కాబట్టి వివరించాలనీ వుంది. కానీ ఆ కాలంవాళ్ళకి భర్త దగ్గర అంత చనువెక్కడిదీ?

''ఇంతకూ నువ్వనేదేమిటీ?'' అనడిగాడా యన వాలుకుర్చీలో కూర్చుంటూ.

''వయసు మించిపోతే మనంతట మనమే రెండో సంబంధాల కోసం తిరగాల్సొస్తుందేమో ఆలోచించండి'' అంది.

''ఇందాకే చెప్పాను, నేనేం చెయ్యలేను, నువ్వు దాని ఉద్దేశం కనుక్కో, తల్లివిగా నీకు కాకపోతే ఎవరితో చెప్తుంది మనసువిప్పి'' అన్నాడాయన తాపీగా.

''నరే నాకు తప్పుతుందా?'' అంటూ లోపలి కెళ్ళిందావిడ.

ఈ మాటలన్నీ తలుపు వెనకనించి వింటూనే వుంది యమున. ''మనసువిప్పి తల్లితో కూడా చెప్పలేని పరిస్థితి. ఏమని చెప్తుంది? శేఖర్ వెంట పడినప్పుడు కాదు పొమ్మంది. ఇప్పుడతను ఐపూ అజా లేడు. తన సంబంధం తనే చూసుకున్నానని చెప్తుందా? లేక అతని వైపునుంచి మళ్ళీ రెస్పాన్సు రాకుండానే ఏదో ఒక నిర్ణయం తీసేసు కుంటుందా? ఇంతలో కాత్యాయిని లోపలికొ చ్చేసి- ''ఏదో ఒకటి తేల్చి చెప్పమ్మా, మూగనో ము పట్టక'' అంది. యమున తలెత్తి తల్లివైపు చూసింది. ''నీ కిష్టం లేకపోతే రేపావిడతో చెప్పేస్తాను'' అంది బెదురుగా.

''తమ్ముడి చదువైపోయేదాకా నా పెళ్లి గు రించెత్తద్దమ్మా'' అని మంచంమీద వాలిపడు కుంది. ''నిద్రొస్తోందమ్మా, ప్లీజ్ లైటార్పెయ్యి'' అంది.

యమునకి నిజంగా నిద్రరావట్లేదు. ఆ మాటకొస్తే నిద్రపట్టి చాలా రోజులయింది. శేఖర్ పార్కులో తనని విడిచి వెళ్ళిపోయినప్పు డే తన నిద్ర కూడా తనకు దూరమయింది. ప్రతిరోజూ శేఖర్ దగ్గర్నుంచి ఫోనొస్తుందేమో నని ఆశగా చూడడం, రాకపోయేటప్పటికి నిరాశగా తిరిగి రావడం మామూలయిపో యింది. ఆఫీసొదలగానే వచ్చి గేటు దగ్గరో ఐదునిమిషాలు ఎదురుచూడడం మానలేకపో తోంది. ఎన్నోసార్లు ఫోన్ చేద్దామనుకుంది. కానీ ఆరోజు ''నాకోసం ఆగలేకపోతే నీ ఇష్టం, మేనరికమే చేసుకుంటావో, పై సంబంధమే చేసుకుంటావో!'' అని తనంటే ''నిన్ను తప్ప ఎవర్నీ చేసుకోలేను'' అని అతను అనలేదు. దాంతో తన అభిమానం గాయపడింది. పైగా చాలా మాటలని వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు. ఇటువంటి సమయంలో తను ఫోన్ చేస్తే తన ఆత్మాభిమానం ఏమవుతుందీ?

ఇటువంటి పరిస్థితొకటొస్తుందని తన మన సుని సంసిద్ధం చెయ్యలేదు. అందుకే పిచ్చి మనసు తట్టుకోలేకపోతోంది. యమునకి తెలి

యకుండానే చెంపలమీదినుండి కన్నీరు జార సాగింది.



చల్లని పిల్లగాలి ఒక్కసారి ఒళ్లంతా తడిమి వెళ్లిపోతుంటే... "ఈ స్పర్శ ఎందుకు యమునని గుర్తుచేస్తోంది" అనిపించింది శేఖర్‌కి.

ఆరోజే పట్టీ విప్పారు. "నా జైలు జీవితం ముగిసింది, రేపట్నుంచి నేను ఫ్రీ బర్డ్‌ని" అన్నాడు.

"మోటర్‌సైకిల్ మాత్రం ఇచ్చేది లేదు" అంది శిరీష.

"నువ్వెవరు చెప్పడానికి?" అడిగాడు ఉక్రోషంగా.

"ఈ ఊరు చూసే ప్రోగ్రామ్ నీ ఏక్సిడెంట్ ధర్మమా అని మూలపడింది. ఇంక వారంరోజుల్లో కాలేజీ తెరుస్తారు అందుకే చకచకా చూపించేస్తే నిన్నొదిలి బిరబిరా వెళ్ళిపోతాను"

"సరే ఐతే పద"

"ఇప్పుడా రాత్రి పదవుతోంది" అంది ఆశ్చర్యంగా.

"పదమంటుంటే" అని చెయ్యి పట్టుకుని గుంజి డాబామీదికి తీసుకెళ్లాడు. నక్షత్రాలు పిల్లల్ని పెట్టినట్లు దూరంగా గుంపులు గుంపులుగా లైట్లు మెరుస్తున్నాయి. "అదిగో వూరు, నిద్రపోతోంది, బాగా చూడు! చూశాకా పొద్దుటే లేచి బండెక్కు" అన్నాడు.

శిరీష సీరియస్‌గా చూసి "జోక్ బావుంది" అంది.

శేఖర్ పకపకా నవ్వేడు.

"నీలాగే నీ నవ్వు కూడా బావుంది" అంది అదే సీరియస్‌నెస్‌తో.

"థాంక్స్" అన్నాడు ఎగిరిపోతున్న జుట్టుని అరచేత్తో నొక్కిపెట్టూ. శిరీష పట్టుకుచ్చులాంటి జుట్టు గాల్లో ఎగురుతోంది. ఆమె సౌందర్యం ఒంపుల్ని బహిర్గతం చేస్తూ పల్చని నైటీ రెపరెపలాడ్తోంది. దానిమ్మ మొగ్గల్లాంటి పెదవులూ, పాలమీద మీగడలాంటి బుగ్గలూ, సన్నజాజి మొగ్గలాంటి నాసికా ఆపైన మెరుస్తూ చీకట్లో మరింతగా ప్రకాశిస్తున్న తేనెకళ్లు.

శేఖర్ ఒక్క నిముషం విచలితుడయ్యాడు. తనకేమవుతోంది? "పద కిందకెళ్దాం, చలిగా వుంది" అన్నాడు.

"చలికూడా ఇంత బావుంటుందని నాకిప్పుడే తెల్సింది" ఆమె పెదవులేవో మంత్రాన్ని ఉచ్చరిస్తున్నంత వేగంగా కదిలాయి. ఆమె పెదవులకన్నా వేగంగా ఆమె తనువు కదిలి తనతో పెనవేసుకుంది. మెత్తని స్పర్శ, అలవాటులేనివాడు ఫోమ్ బెడ్‌మీద పడుకోగానే ఠక్కున లేచి కూర్చున్నట్లుగా కదిలాడు శేఖర్ "శిరీషా".

"బావా ప్లీజ్! నీకిష్టం లేకపోయినా సరే, నన్ను వదిలి వెళ్ళిపోకు" అంటూ పెదవుల్ని అతని గరకు బుగ్గలకి రాసింది.

అతని చేతులు నెమ్మదిగా కదిలాయి నన్నని ఆమె నడుం మీదనుంచి భుజాలవరకూ, ఆ తర్వాత ఆమెని ఒడిసిపట్టి

దూరంగా నిలబెట్టి చేతులు జోడించి చెప్పాడు, "నన్ను బలహీనుణ్ణి చెయ్యకు, స్త్రీ ముందు పురుమడు చాలా అల్పుడు. ఎంత అందమైన పురుమడి సాన్నిహిత్యంలోవున్నా మనసిస్తే తప్ప స్త్రీ చలించదేమో. కానీ పురుమడలా కాదు. ప్రకృతి పక్షపాతం చూపింది. నీలాంటి సౌందర్య దేవత ముందుకొచ్చి తనంతతాను అల్లుకుపోతే, ఆ వెల్లువలో పడి కొట్టుకుపోవాల్సిందే తప్ప వాడికి తీరం చేరే యోగం పట్టదు. ప్లీజ్! నేను యోగిని కాదు, సిద్ధుణ్ణికాదు. మామూలు మగవాణ్ణి. నన్ను పరీక్షించకు. ఈ క్షణం నిన్ను గెల్చుకుని నా జీవితంలో నేను ఘోరంగా ఓడిపోయేటట్లు చెయ్యకు. చిన్నదానివైనా నీకు చేతులెత్తి మొ

క్కుతాను. నన్ను చలింపచెయ్యకు. తద్వారా నువ్వు నన్ను సాధించినా నా మనసుని పొంద లేవు. అది ఎప్పుడో మరొకరికిచ్చేశాను''

''బావా?'' ఆశ్చర్యంతో ఆమె పెదవులు విచ్చుకున్నాయి. దానిమ్మ మొగ్గలు విచ్చి పూవులై ఆ తర్వాత దానిమ్మ గింజలవంటి పల్వరస తళుక్కున మెరిసింది. ''నీ ప్రేమ చాలా గొప్పది! ఆమె చాలా అదృష్టవంతురాలు. తను కనుచూపు మేరలో లేకున్నా నిన్ను శాసించింది. బలహీనుడవకుండా ఆత్మబలం ప్రసాదించిందీ అంటే నీ మీద ఆమెకెంత ఆధిపత్యముందో అర్థమవుతోంది. మనసా వాచా కర్మణా మరో ఆడదాన్ని తాకలేనంతగా నీ మనసులో ఆమె మూర్తిని ప్రతిష్ఠించుకున్నావంటే ఆమెలో ఎంత గొప్పదనముందో తెలుస్తోంది. నా అందం మీద నాకెంతో నమ్మకం. ఒకరకంగా గర్వం. నా కనుచూపు కోసం ఎన్నో పాట్లు పడ్తుంటారు చాలామంది. నేను మాట్లాడితే పొంగిపోతుంటారు. నవ్వితే తమ జన్మ ధన్యమయిపోయిందనుకుంటారు. నా వెన కాల నడవడానికే పోటీ పడ్తుంటారని అంద రూ అంటుంటారు. అటువంటి నన్ను ఓడించేసింది బావా నీ మెహబూబా! నువ్వన్నట్టు నువ్వు అల్పుడివి కాదు. అరుదైన మగవాడివి. స్త్రీ వాంఛతోటో మరో ఆశతోటో నువ్వు ప్రేమించ లేదామెని. మనస్పూర్తిగా ప్రేమించావు. శరీరం మీద నీ మనసు పరిపూర్ణమైన పట్టుతో వుంది. అది ఆమె గొప్పదనం కూడా. నేను నిన్ను చాలా ఆలశ్యంగా కలిశాను'' అంటూ కాలిమువ్వలు తెగి కింద జలజలా రాలినట్లు నవ్వింది.

''అలాగే నవ్వాలి శిరీషా! అపరంజి బొమ్మలా నూరేళ్లు బతకాలి'' ఆమె తలని నిమురుతూ చెప్పాడు శేఖర్ కళ్లనీళ్లతో.

''ఎవరు బావా? ఆమె ఎలా వుంటుందీ? ఎక్కడవుందీ ఏం చేస్తోందీ?'' అంటూ అతని చెయ్యిపట్టి ఊపుతూ అడిగింది శిరీష.

''తినబోతూ రుచెందుకు? రేపు చూపిస్తాగా'' చెప్పాడు శేఖర్ నవ్వుతూ.

''నిజంగా!'' అడిగింది.

''చాలా పొద్దుపోయింది వెళ్లి పడుకో'' చెప్పాడు చెయ్యి పట్టుకునే.

''బావా ఆమె నాకన్నా అందగత్తేనా?'' అడిగింది కళ్లల్లోకి చూస్తూ.

చిన్న నవ్వునవ్వి ''వెన్నెల్లో తాజ్‌మహల్ లాంటి దానివి నువ్వు... పెరట్లో తులసి కోట లాంటిది యమున'' చెప్పాడు.

''ఫరవాలేదు నీలోనూ కవిత్వం పెల్లుబుకుతోందే!'' అంటూ పారిజాతాలన్నీ ఒకేమారు రాలినట్టు నవ్వింది శిరీష.

మర్నాడు చాలా హుషారుగా లేచి తయారయ్యాడు శేఖర్. ''శిరీ... శిరీ'' అంటూ ఆమె గది దగ్గరకొచ్చి చూసేసరికి ఇంకా ముసుగుపెట్టుకుని నిద్రపోతూ కనిపించింది. ''ఏయ్ మొద్దూ లే!'' అంటూ భుజం మీద తట్టేసరికి పెనంలా కాలుతోందనిపించింది. ''ఇంత వేడిగా వుందేమిటి? శిరీ!'' అంటూ వెల్లకిలా తిప్పి నుదుటిమీద చెయ్యేసి చూసేనరికి నుదురు కాలిపోతోంది. అతని చేతి స్పర్శకి నెమ్మదిగా కళ్లు తెరిచింది శిరీష.

''అమ్మా... అమ్మా'' అంటూ ఖంగారుగా కేకలు వేస్తున్న అతన్ని చూసి నవ్వుతూ ''గుడ్ మాణింగ్'' అంది.

''ఏం గుడ్, గాడిదగుడ్! జ్వరం తెచ్చుకుని ప్రోగ్రాం అంతా కాన్సిల్ చేశావు'' కినుకుగా చెప్పాడు.

నుదిటి మీద బొటన వేలు రాసుకుంటూ విధిలిఖితం అన్నట్టు చూపించి నీరసంగా నవ్వింది. ఇంతలో ''ఎవరికిరా జ్వరం?'' అంటూ హడావిడిగా శకుంతలమ్మ వచ్చేసింది. ''ఇంకెవరికీ నీ ముద్దుల మేనకోడలికి'' చెప్పాడు చూపిస్తూ.

''అయ్యయ్యో ఒళ్లు కాలిపోతోంది. రాత్రి దాన్ని తీసుకెళ్లి మంచులో నిలబెట్టావంత సేపు. అదనలే ఏడు మల్లెపూలెత్తు. ముందు డాక్టర్ దగ్గరకి తీసుకెళ్లు. లేమ్మా లేచి మొహం కడుక్కొని కాస్త వేడివేడిగా పాలు తాగు'' అంటూ ఆవిడ ఆదుర్దా పడసాగింది.

''సరే!'' అంటూ శేఖర్ శిరీషని లేపి కూర్చోబెట్టి ''బట్టలు మార్చుకో'' అంటూ బయటికెళ్లాడు.

కాసేపట్లో ఇద్దరూ డాక్టర్ దగ్గరకి బయల్దేరా

రు. నీరసంవల్ల శిరీష శేఖర్ భుజంమీద వాలిపోయింది.

"జాగ్రత్త గట్టిగా పట్టుకో బావని" అని మరోమారు హెచ్చరించింది తల్లి. మోటర్ సైకిల్ మలుపు తిరిగిపోయాక ఆమె భర్తతో అంది "చూశారా! వాడొక్క నిమిషం దాన్నొదిలి పెట్టట్లేదు. వచ్చేవరకూ కన్ను బుస్సుమన్నాడు" అంది ముసిముసిగా నవ్వుతూ.

సూర్యారావు కూడా నవ్వుతూ "ఇంకాలశ్యం దేనికీ పిల్లలిద్దరూ బాగా అతుక్కుపోయారని మీ అన్నయ్యకి కబురు చెయ్యి. ముహూర్తాలు పెట్టుకుందాం" అన్నారు.

★ ★ ★

రయ్యిమని పక్కనుంచి మోటర్ సైకిల్ దూసుకుంటూ వెళ్లిపోతుండగా హఠాత్తుగా తలతిప్పింది యమున.

శేఖర్...

ఆనందంగా "శేఖర్" అనబోతుండగానే అతని వీపుకి బల్లిలా అతుక్కుపోయి కూర్చున్న ఒక అందాల బొమ్మ కనిపించింది. నోట్లో పిలుపు నోట్లోనే ఆగిపోయింది. మోటర్ సైకిల్ జన ప్రవాహంలో కలిసిపోయింది. ఆ లోపలే వెనకాల కూర్చున్న అమ్మాయి నిమిషంలో వెయ్యోవంతుసేపు యమున వైపు చూసి తల తిప్పుకుంది. 'ఛక్'మని మెర్క్యురీ లైటు కంట్లో పడినట్టనిపించింది యమునకి. పాలరాతి శిల్పంలాంటి ఆమె చిలకాకు పచ్చని షర్టూ, తెలుపు ప్యాంటూ వేసుకుని అటో కాలూ, ఇటో కాలూ వేసుకుని కూర్చుని అతని వీపుకంటుకుపోయి కూర్చుంది. ఎంత ధీమాగా కూర్చుందీ. తన ఆస్తి, తన స్వంతం అన్నంత ధాటిగా అనిపించింది. శేఖర్‌కి చాలా హాయిగా వుండి వుంటుంది. అవును అంత అందమైన పిల్ల వీపుకి అంటుకుపోయి కూర్చుంటే ఆనందంగా వుండదా! తననెప్పుడూ "అమ్మమ్మలా మునగదీసుకుని కూర్చోకు. కాస్త తగులుతూ కూర్చో. నా నడుం పట్టుకో" అనేవాడు. కానీ తనెప్పుడూ అలా చెయ్యలేకపోయింది. ఆ అమ్మాయెంత ధైర్యంగా కూర్చుందీ? పసుపు టీ షర్ట్ వేసుకుని శేఖరెంత అందంగా కనిపించాడూ! ఆ అమ్మాయి శేఖర్ పక్కనుంటే తప్పకుండా చూసినవాళ్లు 'మేడ్‌ఫర్ ఈచ్ అదర్' అనుకుంటారు. నేను అతని పక్కన నడుస్తుంటే బహుశా కాకి ముక్కుకి దొండపండులా...

ఆ పైన వూహించలేకపోయింది. కళ్లనిండా నీళ్లొచ్చాయి. నేనెంత పిచ్చిదాన్ని! అతను నా స్వంతం అనుకున్నాను. అతను తన వెంట తిరుగుతుంటే జీవితాంతం ఇలా తోడునీడగా వుండే భర్త దొరకబోతున్నాడు అని ఎంత సంతోషపడిందీ? అవన్నీ కల్లలయిపోయాయి. అతను మరో స్త్రీతో... వుప్పెనగా ఏడుపొచ్చేస్తోంది. గబగబా కళ్లు తుడుచుకుని వెళ్లి ఆటోలో కూర్చుని ఎడ్రెస్ చెప్పింది.

శిరీషని డాక్టర్‌కి చూపించి బయటికి తీసుకొచ్చాక "యమునని సర్‌ప్రైజ్ చేద్దామా?" అడిగాడు శేఖర్.

శిరీష కన్నులు ఓపికలేదు. తల తిరిగిపోతోంది. చాలా నీరసంగా అనిపిస్తోంది. అయినా అతని కళ్లల్లో మెరుపూ గొంతులో హుషారూ చూసి కాదనలేకపోయింది. తల వూపింది.

ఇద్దరూ మరో ఐదు నిమిషాల్లో యమున ఆఫీస్ ముందున్నారు. "పద!" అంటూ లోపలికి తీసుకెళ్లి, రిసెప్షన్‌లో అడిగాడు యమున కావాలని. అక్కడా రోజు నిర్మలే వుంది. శేఖర్‌ని గుర్తుబట్టి మాట్లాడింది. "ఈమధ్య కనబళ్లేదేమిటీ?" అడిగింది కుతూహలంగా, శిరీషని ఆపాదమస్తకం పరీక్షిస్తూ,

"చిన్న ఏక్సిడెంటయిందిలెండి. అందుకని రావడానికి కుదర్లేదు. యమునని పిలుస్తారా?" అనడిగాడు.

"అదీ రోజు లీవ్‌పెట్టిందండీ. వాళ్లక్కయ్య ఇంటికెళ్తుందిట. బహుశా! పెళ్లి చూపులు" అంది నవ్వుతూ.

"వ్వాట్!" అరిచినట్టుగా అడిగాడు శేఖర్.

"నిన్న వాళ్ల బావగారొచ్చి ఏవో పెళ్లికొడుకు వివరాలు చెప్తుంటే విన్నాన్లెండి. సరిగ్గా తెలియదు" అంటూ ఏదో ఫోనొస్తే "ఎక్స్యూజ్‌మీ" అని అది ఎంటెండ్ అవసాగింది.

"వెళ్లొస్తాను" అని చెప్పి శిరీష దగ్గరకొచ్చి "పద" అన్నాడు. రెండడుగులు వేసేసరికి కళ్లు తిరిగి అతని భుజం మీద వాలిపోయింది శిరీష. "శిరీ, ఎలా వుంది?" అంటూ ఆమెన

లాగే పొదివి పట్టుకుని తీసుకొచ్చి బైక్‌స్టార్ట్ చేసి "గట్టిగా పట్టుకుని కూర్చో" అని చెప్పాడు.

ఇంటికెళ్లి శిరీషని దింపి, తిరిగి యమునా వాళ్లింటికెళ్లి విషయం కనుక్కోవాలని ఆరాటంగా వుంది శేఖర్‌కి. కానీ ఇంటికొచ్చేసరికి శిరీష పరిస్థితి తీవ్ర రూపం దాల్చింది. లోపలికి ఎత్తుకు తీసుకు రావల్సొచ్చింది. ఆపైన గజగజా వణుకుతూ, పళ్లు పటపటా కొరుకుతూ పరుపు మీద మెలికలు తిరగసాగింది. శకుంతలమ్మ గుండెలు బాదుకుంటూ "ఒరేయ్! డాక్టర్‌కి ఫోన్ చెయ్యి! ఈ పిల్లకేదైనా అయితే ఆ తండ్రికేం చెప్పను? నాకు కాళ్లూ చేతులాడ్డం లేదు" అంటూ ఏడవసాగింది.

"నువ్వు గొడవ చెయ్యకు!" అని చెప్పి డాక్టర్‌కి ఫోన్ చేసి ఆయనొచ్చేలోపుగా ఆమెకి తల్లిచేత స్పాంజ్ బాత్ ఇప్పించసాగాడు చల్లనీటితో. డాక్టర్ వచ్చేదాకా శేఖర్ కూడా చాలా గాభరాపడ్డాడు. ఆయనొచ్చి ఏదో ఇంజెక్షనిచ్చి, "హైఫీవర్‌వల్ల తట్టుకోలేక అలా కన్‌వల్షన్స్ వచ్చాయి. ఏం ఫరవాలేదు. ఈ టాబ్లెట్సు వాడుతూ, గంట గంటకీ టెంపరేచర్ నోట్ చెయ్యండి" అని చెప్పి ఫీస్ తీసుకుని వెళ్లిపోయాడు. శకుంతలమ్మ శేఖర్ చెయ్యి పట్టుకుని "నువ్విక్కడే వుండరా. నాకు చాలా భయంగా వుంది! నేను అన్నయ్యకి ట్రంకాల్ చేసి రమ్మంటాను" అంది. శేఖర్ సరేనని అక్కడే కూర్చుండిపోయాడు. గంట గంటకీ టెంపరేచర్ నోట్ చేస్తూ, తడిబట్టతో తుడుస్తూ శిరీష పక్కనే వుండాల్సొచ్చింది.

★ ★ ★

ఆటోలో వెళ్తున్నంత సేపూ యమున ముక్కుకి కొంగడ్డం పెట్టుకుని ఏడుస్తూనే వుంది. ముందురోజు బావగారు ఆఫీస్‌కొచ్చి పెళ్లి సంబంధం విషయం ఎత్తారు. "అది కాకపోతే ఇంకొకటి చూద్దాం. ఇంక చూడవలసిన టైమొచ్చేసింది. నీ మనసులో ఎవరైనా వుంటే చెప్పు!" అన్నారు.

తను అసహాయురాల్లా చూసింది.

"ఇప్పుడు కాదు. రేపు నాకు ఆఫ్! మీ అక్కని కూడా లీవ్ పెట్టమంటాను. మాట్లాడుకుందాం. తప్పకుండా రావాలి. ఎదురు చూస్తూ వుంటాను" అన్నారు.

ఆయన మాట తీసెయ్యలేక లీవ్ లెటర్ ఇచ్చింది నిర్మలకు. "పెళ్లి చూపులా!" అనడిగింది. యమున దిగ్గున తలెత్తి చూసింది.

"మీ బావగారంటుంటే వినిపించిందిలే! అయినా మనలో మనమాట నీ లవర్ ఈమధ్య మొహం చాటేసేదేమిటి?" అనడిగింది ఆరాగా.

తనకి దుఃఖమొచ్చేసి ఏమీ మాట్లాడకుండా వచ్చేసింది. ఛీ...ఛీ ఎంత అలుసైపోయింది అందరికీ! నోరు తెరచి బావగారితో శేఖర్ విషయం చెప్తే? తీరా ఆయన వెళ్లేసరికి "నాకు కుదిరిపోయింది సారీ!" అని శేఖర్ అంటే, ఇంక తను అక్కకీ, బావకీ, మిగిలిన ప్రపంచానికీ మొహం చూపించగలదా? నయమే తొందరపడి ఎప్పుడూ ఎవరితోటీ అన్లేదు. ఈ రహస్యం తనలోనే దాచుకోవాలి! మరి ఈ పెళ్లి చూపుల ఉపద్రవం ఎలా తప్పించుకోవడం? తను మరో మగవాడి ముందు కాబోయే భార్య స్థానంలో కూర్చోగలదా? శేఖర్ని తప్ప మరొకర్ని భర్తగా వూహించగలదా? లేదు తన వల్లకాదు. ఏం చెయ్యాలి? శేఖర్ని కలిసి అడిగేస్తే? ఆ రోజు నువ్వే చెప్పావుగా చేసుకో, నేను తప్పుపట్టనని, అని మాటకి మాటా చెప్పేస్తే, మొహం ఎక్కడ దాచుకోవాలి?

ఆటో ఆగేటప్పటికి ఈ లోకంలోకొచ్చి డబ్బులిచ్చి లోపలికొచ్చింది యమున.

"రా, రా నీ కోసమే ఎదురు చూస్తున్నాం" చెప్పాడు సుధాకర్.

"రామ్మారా, మొహంలో అప్పుడే పెళ్లికూతురి కళ కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. కావేరీ మీ చెల్లెల్లొచ్చింది" అంటూ పిలిచింది వర్ధనమ్మ.

లోపల్నుండి కావేరి వస్తూనే "ఏమిటే మొహం అలా పీక్కుపోయింది? ఒంట్లో బాలేదా?" అంటూ భుజం మీద చెయ్యేసి ప్రేమగా అడిగింది.

యమున మాట్లాడకుండా వంటింట్లోకి నడిచింది. చెల్లెలి వెనకే వస్తూ "ఏమిటా నిర్లిప్తత? ముందటి చలాకీతనమే లేదు. అసలేమయింది నీకు?" అంది కాస్త కోపంగా.

బిందెలోంచి మంచినీళ్లు ముంచుకుని

తాగి గ్లాసుకిందపెట్టు "ఏమీ కాలేదక్కా. మీ రందరూ అనవసరంగా ఖంగారు పడ్తున్నా రు" అంది శాంతంగా.

"అవును! ఏమీ కాలేదు. ఆ పాలిపోయిన చెక్కిళ్లూ లోతుకిపోయిన కళ్లూ చెప్తూనే వున్నాయి నిక్షేపంలా వున్నావని. అమ్మానాన్నా ఎంత బాధపడ్తున్నారో, నీ మౌనం చూసి. ఒకవేళ ఒంట్లో ఏదైనా నుస్తీ అయితే నాతో చెప్పు డాక్టర్ దగ్గరకెళ్దాం లేక ఏదైనా..." అంటూ ఆగిపోయింది.

"లేక నీ అనుమానమేంటీ?" లోపలికెప్పుడొ చ్చాడో, గుమ్మంలో నిలబడి అడిగాడు సుధా కర్. "లేక ఎవరితోనైనా ప్రేమలో పడిందేమో ననీ" అంది కావేరి.

"ఏమిటి యమునా! మీ అక్కేదో అంటోంది. ఒకవేళ అలాంటిదేదైనా వుంటే చెప్పమ్మా" అన్నాడు ప్రేమగా సుధాకర్.

నెమ్మదిగా కళ్లెత్తి దీనంగా చూసింది యమున. ఏదో చెప్పాలనీ, చెప్పలేకా మధనప డుతున్నట్టు కనిపించింది సుధాకర్‌కి ఆమె మొహం. వెంటనే మాట మారుస్తూ "మీ అక్క ఇవాళ అవడలు బ్రహ్మాండంగా చేసింది. ఒక పట్టుపడ్దాం పద! కావేరీ మా ఇద్దరికీ టిఫిన్ పెట్టు" అన్నాడు.

కావేరి ప్లేట్లో అవడలు పెట్టి తెచ్చిస్తూ "మా జయ కోరిందివాళ. నువ్వు కూడా వస్తున్నావు కదా అని చేశాను" అంది.

"జయేదీ?" అడిగింది యమున ఒకటి తీసుకుని కొరుకుతూ.

"ప్రభ' వాళ్లింటికెళ్లింది. ఈ మధ్య మా ప్రభకి రావడానికి కుదరట్లేదు. వాళ్లత్తగారొ చ్చింది పూర్నుండి. ఆవిడ చాలా స్నేహశీలి. నిన్ను చూడాలని చాలా సార్లంది. వాళ్లింటికి కూడా వెళ్లొద్దాం" అంది కావేరి భర్తకి కూడా టిఫిన్ పెట్టి.

యమునకెక్కడికీ వెళ్లాలనీ, ఎవర్నీ కలవా లనీ లేదు. ఇంటికెళ్లి పడుకుని దిండు తడిసి పోయేటట్టు ఏడవాలని వుంది. ఒకటి తిని రెండోది వదిలేసి "ఆకలిగా లేదక్కా!" అంది.

"అదేమిటే..." అని కావేరేదో అనబోతుంటే సుధాకర్ వెనకనించొచ్చి ఆమె భుజం నొక్కి ఏమీ అనొద్దన్నట్టు సైగ చేశాడు. "యమునా గదిలో కూర్చుందాం రా!" అని పిలిచాడు.

యమునలేచి బావగారి వెనకాలే నడి చింది.

"కూర్చో" కుర్చీ వేశాడు తను మంచం మీద కూర్చుంటూ. "కావేరీ నువ్వు కూడా రా" అని పిలిచాడు. కావేరి వచ్చి భర్తపక్కన కూర్చుంది. అతను గొంతు సవరించుకుని "చూడు యమునా! నాన్నగారిదివరకట్లా లేచి తిరగలేకపోతున్నారు. వయసు బాగా మీదపడి పోయింది. మీ అమ్మగార్ని చూస్తే, ఆవిడ ఆరోగ్యం అంతంత మాత్రం. ఇక శరత్ అంటావా? తెలివైన వాడూ వృద్ధిలోకొస్తాడు. నువ్వేం అతని చదువు గురించి బెంగపడొద్దు. నా చెల్లెళ్ల పెళ్ళిళ్ల విషయంలో మీ అక్క నాకు చేయూతిచ్చి సహాయం చేసింది. మీ తమ్ము డు తన కాళ్లు మీద తను నిలబడే వరకూ నేను చేయూతిస్తాను. నువ్వా బెంగలన్నీ వదిలేసి నీ పెళ్లి విషయం మాట్లాడు. మీ అమ్మగారు చెప్పిన సంబంధం నీకు నచ్చకపోతే ఫరవాలే దు. మరోటి చూద్దాం! మా కొలీగ్ తమ్ముడున్నా డు. ప్రైవేట్‌దైనా మంచి లిమిటెడ్ కంపెనీలో ఎకౌంటెంట్‌గా చేస్తున్నాడు. నువ్వు సరేనంటే ఆదివారం పెళ్లి చూపులేర్పాటు చేస్తాను. మా చెల్లెళ్లని నేను అడగకుండానే పెళ్లి సంబంధా లు చూశాను. కానీ నీ విషయంలో అంత స్వతంత్రం తీసుకోలేకపోతున్నాను. ఈ మాత్రం స్వతంత్రం కూడా నువ్వొద్దంటే తీసుకో ను. ఏమంటావు?"

ఏమీ మాట్లాడకుండా కన్నీళ్లతో చూసింది యమున. "దానికి మీరీ మాత్రం స్వతంత్రం తీసుకోవడం కూడా ఇష్టం లేనట్టుంది" నిష్ఠూ రంగా అంది కావేరి.

"అక్కా!" దెబ్బతిన్నట్టు చూసింది యమున.

"నువ్వూరుకో! అనవసరంగా ఆవేశపడకు! ఏమంటావు యమునా? పెద్దవాడిగా ఆది వారం పెళ్లి చూపులు ఏర్పాటు చెయ్యదలుచు కున్నాను సరేనా! నీకో అన్నయ్యున్నా ఈ విధంగానే నిర్ణయం తీసుకునేవాడమ్మా. నీకంతగా ఇష్టం లేకపోతే చెప్పేసెయ్యి. కానీ

ఎందుకొద్దో ఆ కారణం కూడా విపులంగా చెప్పాలి'' అన్నాడు షరతు పెడ్తున్నట్టు.

''చెప్పవే!'' కావేరి లేచొచ్చి చెల్లెలి గడ్డం పట్టుకునెత్తి అడిగింది. ఆ కళ్లల్లో ఆర్తి చూసి కాదనీ ఒద్దనీ అని అక్కని నొప్పించలేకపోయింది యమున. తల సరేనన్నట్టు ఊపింది.

''హమ్మయ్యా! ఒప్పుకుందండీ ఎలాగైతేనేం! త్వరలో మా చెల్లెలు పెళ్లి కూతురవబోతోంది'' అంటూ సంతోషంతో కంటనీరు తిరుగుతుండగా యమునని గుండెలకి హత్తుకుంది కావేరి.

అక్కగారి గుండెల్లో ఒదిగిపోగానే ఒక్కసారిగా ఉప్పెనలా దుఃఖమొచ్చేసింది యమునకి. ''పిచ్చిమొద్దూ'' అంటూ వీపు నిముర్తున్న కావేరి, పెళ్లంటే ఇది ఎందుకో భయపడ్తోంది అనుకుంది.

ఇద్దరూ కలిసి ప్రభావాళ్లింటికెళ్లారు. ''వెల్‌కమ్, వెల్‌కమ్'' అంది హేమ్‌లెట్ నవ్వుతూ. ఆవిణ్ణి పరిచయం చెయ్యగానే యమున వినయంగా నమస్కరించింది. జయ యమున చెయ్యిపట్టి లాగుతూ ''మా అపర్ణ కోసం బొమ్మలు పెడ్తున్నాను. వచ్చి ఏదైనా సలహా ఇయ్యి'' అంది.

జయ లోపలికెళ్తూ ''ప్రభ ఎక్కడ?'' అనడిగింది.

''ఔట్ ఆఫ్‌డోర్స్'' ఠక్కున చెప్పింది హేమ్లెట్. ఈలోగా ప్రభ దొడ్డివరండాలోంచి ''వదినా అవడలు చాలా బావున్నాయి. ఇంకొంచెం పంపాల్సింది'' అంది. ''టూ బేడ్, వచ్చినప్పటినుండీ చూస్తున్నాను. ఆ అమ్మాయి ఏదో ఒకటి చేసి పంపడం తప్ప, నువ్వేమీ పంపడం కనపళ్లేదు'' అని కోడలిని మందలించిందావిడ.

''ఏం సరిపోలేదా అందరికీ?'' అనడిగింది కావేరి.

''నో, నో మౌంటింగ్ ఎండ్ స్టాంపింగ్'' అని అయోమయంగా చూస్తున్న కావేరితో ఎక్కీతక్కీగా సరిపోయాయి'' అందావిడ.

ఆవిడ ట్రూట్రాన్స్‌లేషన్‌కి చాలా నవ్వొచ్చింది కావేరికి.

''ఇంతకీ మీ చెల్లెలు మేరేజ్‌లుక్స్ ఎప్పుడూ?'' అడిగిందావిడ.

''ఆదివారమనుకుంటున్నాము'' చెప్పింది కావేరి.

యమున పరధ్యానంగా జయ చెప్పే కబుర్లు వింటోంది. అపర్ణ బొమ్మలన్నింటిలోకీ పెళ్లి కొడుకూ, పెళ్లికూతురూ పల్లకీలో కూర్చున్న కొండపల్లి బొమ్మ చాలా నచ్చింది యమునకి. ''ఎంతో దూరం లేదులే ఊరేగడానికి! ఆదివారం పెళ్లిచూపులటగా'' అడిగింది నవ్వుతూ జయ.

ఖంగారుగా బొమ్మను క్రింద పెట్టేసింది యమున.

''ఎందుకంత ఖంగారూ?'' పకపకా నవ్వింది జయ.

యమున కళ్లల్లో మళ్లీ మోటార్ సైకిల్‌మీద శేఖర్ అతని వీపుకంటుకుపోయి కూర్చున్న ఆ అమ్మాయీ కనిపించారు. మనసు మరల్చుకుని మరేదైనా ఆలోచిద్దామన్నా అదే గుర్తుకొస్తోంది పదేపదే! పల్లకీలో నుదిటి మీద బాసికం, బుగ్గన చుక్కా, నామం పెట్టుకొని, పట్టుపంచెలో శేఖర్, అతని ఎదురుగా మోకాళ్ల మీద గడ్డం ఆన్చుకుని కూర్చున్న ఆ అమ్మాయి కనిపించసాగారు

''డ్రీమ్‌లాండ్‌లోంచి కాలు కిందపెట్టమ్మా'' అంటూ కాఫీ కప్పులతో వచ్చింది ప్రభత్తగారు.

గబుక్కున ఉలిక్కిపడి ''కాఫీ ఒద్దండీ'' అంది.

''నోనో కాఫీ ఒద్దంటే మనిషిగా మరో జన్ముండదు. అని నమ్ ఎల్డర్స్ చెప్పారు'' అని బలవంతంగా కప్పు చేతికందించిందావిడ నవ్వుతూ. యమున కాఫీ గుటక వేస్తుండగా ''ఇంతకీ అబ్బాయి ఎలా వుంటాడూ?'' అడిగిందావిడ. ఏ అబ్బాయో తెలియక గమ్మున పలకమారింది యమునకి. ఆపుకోలేక సతమతమవుతూ దగ్గుతున్న యమున నెత్తిమీద చిన్నగా మొట్టుతూ ''నో ప్రాబ్లమ్ కాస్త స్లేట్ ఛేంజయింది'' అంది ఆవిడ. అందరికీ ఆవిడ ట్రాన్స్‌లేషన్స్ అలవాటయిపోవడంతో నవ్వారుకున్నారు.

''నేనూ చూళ్ళేదు. బానేవుంటాడట'' అంది

కావేరి.

కాసేపు జరగబోయే పెళ్ళిచూపుల గురించి మాట్లాడుకున్నారు. "పండక్కి మీరంతా అక్కడికే రండి, రాత్రి ఆయనొచ్చి అన్నయ్యగారిని పిలుస్తారు. జయా వాళ్ళాయన కూడా వస్తారు" అంది కావేరి.

"మా అమ్మాయి బొమ్మలు పెట్టుకుందిగా ఎలా వస్తాం?" అంది ప్రభ.

"భోగికి వాళ్ళింటికెళ్దాం. బిగ్ ఫెస్టివల్ ఎవరింట్లో వాళ్ళు చేసుకొని కనుమనాడు వాళ్ళు మనింటికొస్తారు. ఎప్పుడూ ఆ అమ్మాయికే ఇంటా బయటా చాకిరీ పాపం!" అంటూ హేమలతమ్మగారు జాలిపడింది.

"యమునా నువ్వు కూడా రారాదూ! ఎలాగో తర్వాత రోజేగా పెళ్లిచూపులూ" అంది జయ.

"ఔనే! నేను మరిచేపోయాను" అంది కావేరి.

"వద్దు, అమ్మ ఒక్కత్తీ చేసుకోలేదు. రావడానికి కుదరదక్కా" అని గబగబా చెప్పేసింది యమున. ఇంకెవరూ బలవంతం చెయ్యలేకపోయారు. కాసేపయ్యాకా బయల్దేరొచ్చేశారు అక్కాచెల్లెళ్ళిద్దరూ. యమునని బస్‌స్టాప్‌లో దింపి "ఆదివారం పొద్దుటే వచ్చెయ్యండంతా, ఆలస్యం చెయ్యొద్దు" చెప్పాడు సుధాకర్. సరేనని తలూపింది. మనసులోమాత్రం 'ఆ ఆదివారం రాకపోతే ఎంత బావుంటుంది?' అనుకుంది.

★ ★ ★

ఇంటికొచ్చేటప్పటికి ఏడుపొచ్చేసింది నర్మదకి.

పిల్లలు దిక్కులేనివాళ్ళల్లా వీధిలో కూర్చునివుంటారు. తలుపు తీయడంతోటే ఆకలాకలని ఏడుస్తారు. చెప్పులు విప్పి వెంటనే వంటగదిలోకెళ్ళాల్సొస్తోంది. గోపీగాడు పట్టించుకునేవాళ్ళెవరూ లేక చాలా పాడయిపోయాడు. అలగావాళ్ళతో చేరి ఆటలూ, చెడ్డమాటలూ. ఏమైనా అంటే ఎదిరిస్తున్నాడు. వాడు అమిత గారాబంవల్ల పాడయిపోయాడు. తండ్రి కూడా బుద్ధిచెప్పకుండా "నువ్వేగా నెత్తికెక్కించుకుని, అమ్మని నానా మాటలూ అనేదానివి" అంటున్నాడు. అలవాటే లేక వంట అన్నలు చేతకావట్లేదు. మొన్నటికి మొన్న సీత "బామ్మెళ్ళిపోయాకా మాకీ ఇంట్లో కడుపునిండా తిండి కూడా లేదు. నీకేం చాతకాదుగానీ అందర్నీ తిట్టి ఇంట్లోంచి వెళ్ళగొట్టడంమాత్రం వచ్చు" అంటూ నానా మాటలూ అంది. పనిమనిషి కూడా ఏడిపించేస్తోంది. తనెళ్ళే టైముకి రాదు. సాయంత్రం ఎదురుచూసి, ఎదురుచూసి తను అన్నీ తోముకున్నాకా వస్తుంది. ఏమైనా అంటే 'ఇప్పుడే నాకు కుదుర్తుంది' అని రాత్రి బట్టలుతికి పోతుంది. అవేమో ఆరవు! ఒకటే ముచ్చువాసన. శంకర్‌తో చెప్దామంటే అతను రాత్రుళ్ళు చాలా ఆలస్యంగా వస్తున్నాడు. అత్తగారున్నప్పుడు అతను ఎక్కడ గొడవవుతుందో అన్నట్టు ఒదిగి ఒదిగి వుండేవాడు. ఇప్పుడలా కాదు. అసలు తనని కేర్‌చెయ్యట్లేదు. "నన్నేమైనా అంటే నేను కూడా మా అమ్మలాగే ఇల్లొదిలి పారిపోతాను. ఇన్నాళ్ళూ అమ్మ గురించని నోర్మూసుకుని పడున్నాను" అని చెప్పేశాడు. ఈమధ్య రాత్రిళ్ళు డ్రింక్ చేసి వస్తున్నట్లుగా కూడా అనుమానంగా వుంది. తనామాటెత్తితే "పిల్లల గురించి ఇంటికొస్తున్నాను, నువ్వు గొడవచేస్తే అదీరాను" అనేశాడు. అత్తగారున్నప్పుడు తను ఏడుగంటలకి లేచేసరికి కాఫీకప్పు రెడీగా వుండేది. తను తయారవడం, భోంచెయ్యడం తప్ప మరో పనుండేది కాదు. వచ్చాకా కూడా హాయిగా భర్తతో షికార్లూ, సినిమాలూ, హొటళ్ళూ తప్ప మరోపని ముట్టుకునేది కాదు తను. ఇప్పుడు తెల్లవారగట్ల ఐదుగంటలకి లేస్తే వెళ్లేవరకూ పని. పిల్లల్ని తయారుచెయ్యడం, రెండురెళ్ళు నాలుగు జడలు వెయ్యడం, టిఫిన్‌బాక్స్‌లు కట్టడం. ఒక్క నిముషం ఊపిరి పీల్చడానికి ఉండట్లేదు. సాయంత్రం ఇంక వచ్చాకా చెప్పనే అక్కర్లేదు. ఇల్లంతా సంతలా చేస్తారు పిల్లలు. ఇల్లు సర్దుకోడం వాళ్ళని చదివించడం, వంటా, మర్నాటి వంటకి చూసుకోడం... ఇలా రాత్రి పదింటిదాకా పనే వుంటోంది. అన్నింటికన్నా ముఖ్యమైనది ఎప్పుడు ఏదయిపోతుందో తెలియట్లేదు. రోజుకోటయిపోతుంటే చాలా విసుగ్గా వుంటోంది. అదే ఆవిడుంటే ఎప్పుడూ తనకా ఇబ్బంది కలగలేదు. ఒక్కనాడు నెల మధ్యలో ఇది కావాలి అని అడిగేది కాదు. తనెంత

నిశ్చింతగా వుండేదనీ? ఆ రోజులు పోయాయి. పిల్లలకి బాలేదనీ, చాకిరీవల్ల తనకి నీరసంగా వుండీ అన్ని లీవులూ వాడేసింది. శంకర్‌తో చేసుకోలేకుండా వున్నానంటే "హాయిగా ఉద్యోగం మానేసి ఇంటిపట్టునుండు. నేను తెచ్చినదాంతో పొదుపుగా సంసారం చెయ్యి. అసలు నీలా ఓర్పులేనివాళ్ళకి ఉద్యోగాలనవసరం. కనీసం పిల్లలకి కడుపునిండా తిండిపెట్టడం నేర్చుకో" అని హితబోధ చేశాడు. చూస్తూ చూస్తూ ఇంత మంచి ఉద్యోగం ఎలా వదిలెయ్యగలదు? అసలు ఉద్యోగం ఉండబట్టేకదా తనకంత గర్వంగా వుంటోంది. మానేస్తే ఇంకేమయినా వుందా? ఇప్పుడేంచెయ్యడం? అయిపోయిందేదో అయిపోయిందని అత్తగార్ని వెళ్లి బతిమాలుకుని తీసుకొస్తేనో? అనుకుంది. కానీ సింధూపట్ల తన ప్రవర్తన గుర్తుకొస్తే మొహం చెల్లట్లేదు. ఏమాటకామాటే! పక్కింటివాళ్లనెప్పుడూ తను విసుక్కుంటూ చులకన చేసి మాట్లాడేది. కానీ వాళ్లే ఇప్పుడు పిల్లలకి దిక్కయ్యారు. వల్లి ఆడుతూ, ఆడుతూ రాయిమీద పడి నెత్తి చిట్లితే, కావేరి భర్త వెంటనే బండిమీదెక్కించుకుని తీసుకెళ్ళి కుట్లేయించి తీసుకొచ్చాడు. వాళ్ళాడబడుచు తను వినేటట్లుగా "వాళ్ళమ్మ ఊళ్ళోవాళ్ళకి పనీపాటా లేదు, మా ఇంటిసంగతులు పట్టించుకోవడం తప్ప! అంటుందేమో వదినా!" అంది తనొచ్చాక.

"అలా అని పసిపిల్లనలా వదిలేస్తే ప్రమాదంకదూ! పిల్లలెవరైనా పిల్లలేకదా!" అంది కావేరి. తనకు బయటికెళ్ళి థాంక్స్ చెప్పడానికి కూడా మొహం చెల్లలేదు. గతంలో తను వాళ్ళని నానా మాటలూ అందిగదా!

"ఎక్కడ్రా మీ అమ్మా, బైటికి రమ్మను. పెద్ద దొరసానిలా ఉందే! ఉద్యోగం చేస్తేనేం! ఊళ్ళేలితేనేం! పిల్లల్ని నక్కంగ సాకాలి. అది చాతకానప్పుడు కనకుండా నిమ్మళంగుండాలి" అంటూ పెద్దపెద్ద అరుపులు వినిపించి, హడలిపోతూ బైటికొచ్చింది నర్మద.

వీధిచివరుండే నూకాలమ్మ పూనకమొచ్చినట్లు ఊగిపోతోంది. ఒకచేత్తో గోపీగాడి రెక్కుచ్చుకొని ఉంది.

ఆమెను చూడగనే నర్మద ప్రైప్రాణాలు పైనే పోయాయి. నూకాలమ్మ మర్రిమానంత మనిషి. ఎప్పుడూ తాంబూలచర్వణంచేత గారపట్టిన పళ్ళూ, జీడిపిక్క రంగులో వుండే నుదిటమీద ఎర్రటి కాసంత కుంకుమబొట్టూ పెట్టుకుని వీధిచివర్న ఒక చిన్న బడ్డీకొట్టు పెట్టుకుని కూచుంటుంది. దాని నోరు ఒక్క క్షణం మూయ్యకుండా ఎప్పుడూ ఎవర్నో ఒకర్ని తూర్పారబడ్తుంటుంది.

"ఏమయింది?" అంది నర్మద ధైర్యం తెచ్చుకుని.

"ఆ... ఏమయిందా?" అంటూ తుపుక్కున ఉమ్మింది. ఆ ఉమ్మి తన ముఖంమీదే ఉమ్మినట్లు అనిపించింది నర్మదకి.

"నీ కొడుకు నాకొట్లో కన్నమేసి జీళ్ళవీ ఎత్తుకుపోతున్నాడే" అంది చేతులు తిప్పుతూ.

"మాటలు తిన్నగా రానీ, నువ్వెంత నీ బతుకెంత? నన్ను ఏవే అంటావా?" అంది రోషంగా.

"నువ్వేమిటో నీ బతుకేమిటో ఈ వీధిలో అందరికీ తెలుసే వొన్నెల విసినికర్ర! మొగుడ్ని కొట్టి మొగసాలకెక్కేదానివనీ, ముసలత్త మూలపడిందని ఇంట్లోంచి ఎల్లగొట్టినదానివనీ, పిల్లల్ని కని బజార్న పడేసి, టింగురంగాయని ఊరేగేదానివనీ ఇంకా ఎన్నెన్నో తెలుసే!" అందది ముందుముందుకొస్తూ.

"పిల్లాడేదో తీస్కుంటే ఇలా ఇంటిమీదికొచ్చి ఇంత గొడవచేస్తావా? ఏం తీసుకున్నాడో చెప్పు డబ్బులు నీ మొహాన కొడ్తాను" అంది వెనక్కి వెనక్కి అడుగులేస్తూ నర్మద.

"ఓయబ్బో మగారాణీ! డబ్బులు నా మొకాన కొట్టుద్దండీ, ఈ యవ్వారం ఎన్నాల్లకెల్లి జరుగుతుందో ఎవరికి ఎరుక? ఈనాడు నాకల్ల పడింది" అంటూ గోపీగాడ్ని రెండుచెంపలూ వాయించి నర్మదవైపు తోసింది.

నర్మద తల్లి పేగు పెరపెరమంది. "పసిపిల్లవాడ్ని కొట్టడానికి నీకు చేతులెలా వస్తున్నాయి" అంది ఏడుపు బిగబట్టూ.

"ముసల్దికాలుజారి పడితే నానా తిట్లూ తిట్టి ఎల్లగొట్టడానికి నీకు రాలే చేతులు. అలాగే వచ్చాయే. దరమాత్ముఁరాలిని ఎంత రొష్టుపెట్టావో మేమంతా చూస్తూనేవున్నామే. ఇంతకా

లానికి నీ పిలక నా చేతిలో చిక్కి ఇట్టా వచ్చాను'' అంది నర్మద మీదికొస్తూ.

"అయితే ఇప్పుడేమంటావు? నా ఇంటి విషయాలన్నీ ఎత్తి నా పరువు బజారుకీడ్చి న్యూసెన్సు చేస్తున్నావని, పోలీసు కేసు పెడ్తాను'' అంది భయంతో వణికిపోతూ.

"ఏంటీ! నామీదపోలీసుకేసెడ్తావా" అంటూ నర్మద జడ అందిపుచ్చుకుని ఒక్క గుంజు గుంజింది.

నర్మద కెవ్వుమని అరిచింది.

"పిలవ్వే ఎవరొస్తారో చూద్దాం! పోలీసోడ్ని పిలుస్తావో లేక ఇంకెవడ్నన్నా పిలుచుకుంటావో?'' అంటూ అంతకంతకూ రెచ్చిపోతూ బుగ్గలు పొడిచింది నూకాలమ్మ.

"ఏయ్ ఏమిటది? మంచీ మర్యాద వుండక్కర్లేదా?'' అన్న గద్దింపు వినబడి నూకాలమ్మ నర్మదని విడిచి వెనక్కి తిరిగింది. చీరె పైకెగ్గట్టి బిరబిరా వచ్చింది కావేరి. నూకాలమ్మకీ నర్మదకీ మధ్య వచ్చి నిలబడుతూ, "ఏం జరిగిందలా రెచ్చిపోతున్నావు?'' అనడిగింది కోపంగా.

"నీకెందుకమ్మా మధ్యలో! నువ్వుండు! దీని పిల్లగాడు నా కొట్టంతా కొల్లగొడ్తుంటే నేవూరుకుంటానా?'' అంది నూకాలమ్మ

"చిన్న పిల్లాడు తెలియక తీస్తే మందలించాలి, తల్లిదండ్రులకి చెప్పాలి. ఆ తర్వాత నీ నష్టమెంతో అది తీసుకుపోవాలిగానీ ఇలా యాగీ చేస్తావా?'' అంది వురిమి చూస్తూ.

"ఏటమ్మా నువ్వు ఈ యమ్మ తరపున మాటాడ్తన్నావు? దీనికెంత పొగరో నీకు తెల్దు'' అంటూ ఏదో చెప్పబోతుండగా

"నువ్వేం లోకోద్ధరణ చెయ్యక్కర్లేదు. నీ పని నువ్వు చూసుకో" అంది.

"ఏదో కోపం ఆపుకోలేక నాలుగూ వాగాను. అంతేగానీ నాకేవన్నా ఇరోదమా?'' అంటూ తల గోక్కుంటూ వెనక్కడుగేసి, "ఏటీ ఇంట్లో వన్లు మానేసి జాతర చూస్తున్నారు. వెదండెహె!'' అంటూ జనాన్ని చెదరగొడ్తూ, నణుక్కుంటూ "నువ్వు సెప్పావని పోతున్నానమ్మో'' అంటూ బొడ్లోంచి ఆకు తీసి సున్నం రాసేసుకుంటూ వెళ్ళిపోయిందది.

నలుగురిలో జరిగిన అవమానానికి నర్మద కుమిలి కుమిలి ఏడ్వసాగింది. కావేరి నెమ్మదిగా ఆమె భుజంమీద చెయ్యేసి "బాధపడకండి. దాని నోరంతే! అనడమేకాని అవతలివాళ్ళెంత బాధపడ్తారో ఆలోచించలేని అజ్ఞాని'' అంది.

నర్మద వెంటనే ఆమె చెయ్యి గట్టిగా పట్టుకుని "అంటే ఎంత బాధగా వుంటుందో నాకిప్పుడే తెల్సింది కావేరీ! ఇన్నాళ్ళూ నేనొకళ్ళనడమే కానీ నన్నెవరూ మొహంమీదిన్ని మాటలనలేదు. అందుకే ఆ అవమానం, బాధా నాకు తెలియలేదు. నాకిప్పుడే తెలిసింది. నా నోటివల్ల ఇతర్లెంత బాధపడ్డారో!'' అంటూ ఇంక మాట్లాడలేక వెక్కివెక్కి ఏడ్చింది.

"ఊర్కోండి! మీరిలా బాధపడ్తూ కూర్చుంటే ఎలా? లేచి పిల్లల్ని చూసుకోండి. వాళ్ళసలే బిక్కచచ్చిపోయున్నారు. గోపీగాణ్ణి దగ్గరకు తీసుకుని నెమ్మదిగా సముదాయించండి. వాడు భయపడిపోయాడు. మీరీ పూట వంట కూడా చెయ్యొద్దు. నేనే పంపిస్తాను. ఆయనొచ్చేవరకూ వంటరిగా వుంటే ఏవేవో ఆలోచన్లొస్తాయి. తాళం పెట్టి మా ఇంటికొచ్చెయ్యండి... పదండి'' అంటూ బలవంతపెట్టి పిల్లల్నీ నర్మదనీ ఇంటికి తీసుకొచ్చింది కావేరి.

"రామ్మా రా!'' అంటూ ఎదురొచ్చి ఆప్యాయంగా ఆహ్వానించింది వర్ధనమ్మ. పిల్లల్ని తీసుకుని "రండి మనం అప్పచ్చులు తిందాం'' అంటూ లోపలికి తీసుకెళ్ళింది జయ. కావేరి వేడివేడిగా కాఫీ తెచ్చిచ్చి, "మొహమాటపడొద్దు. అయినా ఇరుగుపొరుగన్నాక ఒకరి కష్టంలో ఒకరు పాలుపంచుకోవాలి'' అంది.

"మీ మంచితనంతో నన్ను చెప్పుపెట్టి కొట్టిన దానికంటే ఎక్కువ శిక్ష వేస్తున్నారు. ఇన్నాళ్ళ పరిచయంలో నేనెప్పుడూ మీతో ఒక మంచిమాట కూడా మాట్లాడలేదు. పైపెచ్చు సమయం దొరికినప్పుడల్లా నొప్పించాను. క్షమించండీ అని అడగడానికి కూడా నాకర్హత లేదు'' అంది ఏడుస్తూ.

"క్షమించడానికి నువ్వేమంత తప్పు చేశావ

మ్మా! మమ్మల్ని కాదుకానీ ఆ మహాతల్లిని, దేవతలాంటి మనిషిని నువ్వు తప్పకుండా క్షమార్పణడగాలి. ఆఖరిరోజుల్లో ఆమె తృప్తిగా నీ చేతుల్లో కన్నుమూసే భాగ్యాన్ని ఇవ్వమ్మా. పరాయివాళ్ళు పంచభక్ష పరమాన్నాలు పెట్టి రాజవైభవంగా చూసినా అయినవాళ్ళదగ్గర పచ్చడిమెతుకులు తిన్న సాటిరాదు. తల్లి కొడుకు నెత్తిన రాయెత్తాడని కదూ, నెత్తిమీద పెట్టి పెంచుకుంటుంది'' అంది వర్ధనమ్మ.

''పిన్నిగారూ! ఇంక చెప్పకండి. నాకు సిగ్గుతో చచ్చిపోవాలనిపిస్తోంది'' అంది రెండు చేతులతో మొహం కప్పుకుని.

''రేపు మనం సింధూవాళ్ళింటికెళ్తున్నాం..వచ్చేటప్పుడుఅమ్మమ్మగారితో వస్తాం'' చెప్పింది కావేరి ఆమె తల నిమురుతూ.

''తప్పకుండా!'' అంటూ కౌగలించుకుంది కావేరిని.



''నువ్వు చేసిన పని బాగాలేదమ్మా! అలా వచ్చెయ్యకుండా వుండాల్సింది'' అంది వసుధ తల్లితో.

''నువ్వు కూడా అలా అంటావేంటే, నాముందే ఆ అమ్మాయి వాణ్ణి తీసిపారేసి మాట్లాడ్తుంటే నాకెలా వుంటుందీ? అత్తగారిగా నాకెలాంటి గౌరవం లేకపోయినా భర్తగా వాణ్ణైనా గౌరవించద్దూ! తనెంత చదువుకుందో వాడూ అంతే చదువుకున్నాడుగా'' అని ఆవిడ అంటుంటే ''మీ అమ్మాయెంత చదువుకుందని నామీద ఆధిత్యక చూపిస్తోందండీ!'' అన్నాడు చక్రధర్ వెనకనించి.

అనుకోని సంఘటన ఎదురైనట్టు తెల్లబోయి చూసిందావిడ.

''అక్కడున్నది చదువుకాదు! చనువు'' అన్నాడు అతను నవ్వుతూ.

''స్కూల్‌ఫైనల్ చదివిన మీ అమ్మాయి డాక్టరేట్ చేసిన నన్ను తీసిపారేసి 'అబ్బా మీకేం తెలియదు! మీరూరుకోండీ!' అని రోజు కెన్నిసార్లంటుందో గుర్తుచేసుకోండి. అది నిజానికి తీసిపారెయ్యడమో లేక నన్ను అవమానించడమో అంటే హాస్యాస్పదంగా లేదూ? అది నామీద తనకున్న ప్రేమా, చనువువల్ల అలా మాట్లాడ్తుంది. తనకంటే తక్కువ చదువుకున్నవాడయినా పక్కింటాయన్ని నా భార్య విసుక్కుంటుందా? స్వంత భర్తని కాబట్టే నన్ను విసుక్కుంటుంది. అది నాకేం బాధనిపించదు కూడా! కానీ ఈ ఇంట్లో నా తల్లి కూడా వుంటే ఆమె మనోభావాలెలా వుండేవో మిమ్మల్ని చూస్తే తెలుస్తోంది. మనలో మనమాట! మీరెప్పుడైనా వసుధతో 'అలా భర్తనెదిరించి మాట్లాడకూడదమ్మా, తప్పు!' అని చెప్పారా?''

ఆవిడ జవాబు చెప్పలేనట్టు చూసింది.

''చెప్పలేదు. ఎందుకంటే అది తప్పని ఎప్పుడూ మీకనిపించలేదు. వసుధ చెప్పేది నిజమేకదా! ఇంటివిషయాలు ఆ అబ్బాయికేం తెలుస్తాయి, అనిపిస్తుంది మీ కూతురు కాబట్టి. అదే మీ కోడలయితే 'తనకి తెలిసినా వాడు చెప్పేది విని సరేనంటే ఏంపోతుంది' అనిపిస్తుంది. అది మీ తప్పుకాదు. మీ కాలానికీ ఈ కాలానికీ సామాజికంగా ఎన్నో మార్పులొచ్చాయి. వాటిని మీరు మీ కిష్టమైనంతవరకూ జీర్ణంచేసుకుంటారు. మిగతావి అజీర్ణంచేసి మిమ్మల్ని బాధపెడ్తాయి. ఉద్యోగం చెయ్యకపోయినా ఇంట్లో పనీ, బాధ్యతలూ ఎక్కువయినప్పుడు ''నేను చెయ్యలేకుండా వున్నాను బాబూ, ఛీ, ఛీ, ఆడదానిగా మరోజన్మలో చచ్చినా పుట్టను' అంటూ వుంటుంది వసుధ. మరి అలాంటిది ఎవరి సహాయం లేకుండా ఇంట్లోనూ, బైటా కూడా కష్టపడుతున్న ఆ అమ్మాయి కష్టం గమనించరేం?''

''కొంత ఆ అమ్మాయి చేతులారా చేసుకుంటుంది బాబూ! ఎందుకనవసరంగా

అంత కష్టపడడం? ఒక టైమూ పాడూ లేకుండా స్టూడెంట్లూ, సెమినార్లూ అని తిరుగుతూ ఆరోగ్యం కూడా పాడుచేసుకుంటుంది. ఆదివారాలు కూడా రెస్టు తీసుకోకుండా వెళ్ళిపోతోందీమధ్య'' అంటుంటే అడ్డుతగిలి, ''నేను కూడా వెళ్తానుగా, ఒక్కోసారి పండగరోజుల్లోనూ, ఆదివారాలూ కూడా వెళ్ళాల్సొస్తుంది. ఊరు విడిచి కూడా వెళ్తుంటాను. మా ఇద్దరి ఉద్యోగాలూ, వృత్తిధర్మాలూ ఒకేలాంటివి. మగవారికి వేరుగానూ, ఆడవారికి వేరుగానూ వుండవు. జీతభత్యాలు సమానమైనప్పుడు, పని కూడా సమానంగా చెయ్యాలిగా'' అన్నాడు.

''నువ్వు మగవాడివి. ఇంట్లో బాధ్యతగా చూసుకునీ, చేసుకునే భార్యుంది కాబట్టి తిరుగుతావు. అదే ఆడదలా పనిమనుమలమీద పిల్లల్నొదిలేసి, ఇల్లు పట్టకుండా తిరుగుతుంటే ఆ సంసారం గతేమవుతుందో ఆలోచించు''

''పిల్లల్ని పెంచడం విషయంలోనూ, ఇంటి పన్ల విషయంలోనూ ఇద్దరిదీ సమానమైన బాధ్యతే. అరుణ్‌కి మీరెప్పుడైనా, వసుధతో చెప్పినట్లు ఇలాకాదు అలా అనీ, సంసారం ఈవిధంగా చేసుకోండీ అని చెప్తారా? పోనీ సింధుతో ఆప్యాయంగా 'నీ ఆరోగ్యం విషయం జాగ్రత్త, పిల్లల్ని ఇలా వదిలిపెట్టకూ' అంటూ నిదానంగా చెప్పి చూశారా? ఒక తల్లిగా, అత్తగారిగా మీరెంతవరకూ మీ విధులు సక్రమంగా పాటించారు? చిన్నచిన్న విషయాలకే మనసు కష్టపెట్టుకుని వచ్చేస్తారు. అవే విషయాలు ఇక్కడా జరుగుతాయి. వసుధకీ మీకూ కూడా అభిప్రాయబేధాలు వస్తూనే వుంటాయి కానీ కూతురు కాబట్టి మీరు సర్దుకుపోవడమో లేక వసుధని చనువుగా చివాట్లు వేసి అలాకాదు ఇలానే చేద్దాం అని చెప్పడమో చేస్తుంటారు! అవునా?'' అడిగాడు నవ్వుతూ.

ఆవిడేం మాట్లాడలేకపోయింది.

''సింధుది కాస్త ముభావంగా వుండే టైపు తప్ప చెడ్డదికాదు. వెళ్తే ప్రాణంపెడ్తుంది. ఇంక పనిమనిషి విషయమంటావా! పోయినసారి మనం పంపిన వంటమనిషిని ఏదో అందనీ, అది వెళ్ళిపోయిందనీ, ఆ అమ్మాయికి నోరెక్కువ, కాస్త సర్దుకుపోతేకానీ పనివాళ్ళతో పన్లు చేయించుకోలేం' అని నువ్వే అన్నావుగా. అందుకే అలా మాట్లాడకుండా వూరుకుని వుంటుంది. అయినా అసలు నువ్వు పర్మనెంట్‌గా అక్కడే వుండి పిల్లల్ని చూసుకుంటే ఈ పనిమనుమలూ గొడవా వుండదుగదా! వుంటూవుంటే నీకూ అలవాటవుతాయా పద్ధతులూ అవీ. క్రమేణా సాన్నిహిత్యం పెరిగి ఒకరిమీదొకరికి ప్రేమానురాగాలు కూడా వృద్ధవుతాయి. ఇక్కడ వుండబట్టికదా, మా ఆయన మీద నీకంత ఆప్యాయత. ఎప్పుడూ 'అత నందర్లాంటివాడూ కాదు దేవుడు' అని చెప్తూ వుంటావు'' అంది వసుధ తల్లిభుజంమీద చెయ్యేసి.

''అలా అని మీరు మాకు బరువనీ వెళ్ళిపొమ్మనీ కాదు మా అభిమతం. ఇది మీ ఇల్లే, నన్నో కొడుకులా చూస్తున్నందుకు నాకెంతో సంతోషంగా వుంటుంది. కానీ ఆ సంతోషం మీ కొడుకు కూడా పొందాలికదా! అతను 'నా తల్లిని నేను చూసుకోలేకపోతున్నాను' అనే బాధలోనే బతుకంతా గడిపెయ్యాలా?'' అన్నాడు చక్రధర్ అనునయంగా.

ఆవిడేం మాట్లాడలేక కంటతడి పెట్టింది.

''పోనీ కోడలు చెడ్డదే అనుకుందాం! అయినా పిల్లలలా ఎవరిమీదో ఆధారపడి వుండడంకన్నా నువ్వు చూసుకుంటూవుంటే ఆ తృప్తి వేరుకదా! నువ్వొచ్చేస్తున్నప్పుడల్లా పిల్లలెలా ఏడుస్తారో, నీకోసం ఎంతలా మొహంవాచి వుంటారో నీకు తెలియంది కాదు'' అని వసుధ అంటుంటే ఏడుస్తున్న రమ్యా, తేజాల మొహాలు గుర్తుకొచ్చి వెంటనే పరిగెత్తుకుంటూ వెళ్ళి వాళ్ళని చూడాలనిపించింది.

''నువ్వు బాధపడి వాళ్ళని బాధపెడ్తున్నావే తప్ప నిజానికిలాంటి సమస్యలో సమస్యలే కావు. వడ్లగింజలో బియ్యంగింజలాంటివి అన్ని కుటుంబాల్లోనూ వున్నవే'' అంది మళ్ళీ వసుధ.

''మీదగ్గర నాకున్న చనువుకొద్దీ ఏదో మాట్లాడాను. ఏమైనా నొప్పిస్తే మీ కొడుకే అనుకొని క్షమించండి'' అన్నాడు చక్రధర్.

''లేదు నాయనా! నువ్వన్న మాటల్లో నిజముంది. నేనెప్పుడూ నాకోణంలోంచే తప్ప

అటునుంచి ఆలోచించలేదు. నిజమే! నేనొచ్చే స్తున్నప్పుడల్లా పిచ్చినాయన! ఎంత దిగాలుప డిపోయి చూస్తాడనీ. ఆ అమ్మాయిమీద నోరు కూడా చేసుకున్నాడు మొన్న. పిల్లలు ఎంతో ఏడ్చారు. అది తల్చుకుంటే నేనెంత నిర్దయు రాల్నో అనిపిస్తోంది. పనిమనిషి విషయంలో నేను పేచీపడకుండా ముందురోజే సింధుతో మనసువిప్పి 'నేనే మడిగా వంటచేస్తాను, దాన్ని వంటింట్లోకి రావద్దని చెప్పు' అంటే పోయేది. నాకు తోచిందికాదు. ఈసారి అరుణ్‌తో వాళ్ళింటికి వెళ్ళగానే సింధుని కూర్చోపెట్టి నా పద్ధతులూ, పనిపాటలూ ఇవి అని చెప్తాను. ఆ అమ్మాయి ఇలాకాదు అలా అని ఏదైనా సలహా ఇస్తే వింటాను. ఇద్దరం మనసులు విప్పి మాట్లాడుకుని సమస్యలు పరిష్కరించుకుంటాము'' అంది ధృడనిశ్చ యంతో.

★ ★ ★

''ఛీ, ఛీ అలా ఏడవకూడదు. తప్పు లే'' అని తన కాళ్ళమీద తలపెట్టి ఏడుస్తున్న కోడల్ని లేవనెత్తి అక్కున చేర్చుకుంది తులశ మ్మ.

''నేను రాక్షసిని, నిర్దయురాలిని. హృద యంలేని శిలని. మిమ్మల్ని అనరాని మాటల న్నాను. ఎంతో కష్టపెట్టాను. మీరు పెద్దమన సుతో నన్ను క్షమించినా, ఆ దేవుడు నన్ను క్షమించడు'' అంటూ వెక్కివెక్కి ఏడ్చింది నర్మద.

''తెలియనితనంవల్ల నువ్వు చేసిన తప్పు లన్నీ పశ్చాత్తాపంతో కడుక్కుపోయాయి. వూర్కో'' అంది తులశమ్మ.

సింధూ, కావేరీ ప్రేక్షకుల్లా చూస్తుంటే ''ప దండత్తయ్యా మనింటికెళ్ళిపోదాం, పిల్లలెదు రుచూస్తుంటారు'' అని ఆవిడ చీరలూ రవికె లూ మడతపెట్టసాగింది నర్మద.

''వెళ్ళిపోతావా అత్తయ్యా?'' అంది సింధు!

తులశమ్మ లేచి సింధు తలమీద చెయ్యేసి నిమురుతూ ''ఎక్కడికెళ్ళిపోతున్నాను, మళ్ళీ వస్తూనే వుంటాను నా బంగారుతల్లి దగ్గరకి'' అని తల మీద ముద్దు పెట్టి, ''సింధూ! నువ్వు నన్ను మహారాణిలా చూశావు. ఇసుమంత కష్టం కలగనివ్వలేదు. నువ్వేకాదు ఆ అబ్బా యికూడా కన్న కొడుక్కన్నా ఎక్కువగా చూశా డు. మీ ఆదరణా, ఆప్యాయతా నేను పోయేదా కా మరిచిపోను. ఇదే ఆదరణా ఆప్యాయతా నా కొడుకు దగ్గర దొరికితే ఎంత బావుంటేదని ప్రతిరోజూ ఏడ్చేదాన్ని. ఎందుకంటే మొదటి నుంచీ కొడుకు దగ్గరుండడం విధాయకం అని మన రక్తంలో జీర్ణించుకుపోబట్టి. అలాగే మీ అత్తగారికీ వుంటుంది తల్లీ! మనవల మీదా, కొడుకు మీదా మమకారం లాగుతుంది. పేగు సంబంధం కదా! పెద్దవాళ్లం, చాద స్తంగా ఏదో అంటుంటాము. పట్టించుకోకూడ దు. 'నొప్పించక తానొవ్వక తప్పించుకు తిరుగు వాడు ధన్యుడు'అన్నట్లుగా వుండాలి'' అంటూ అటూ ఇటూ చూసి చిన్న గొంతుకతో ''జీతానికి పని చేసేవాళ్లకి డబ్బు మీద తప్ప, మన మీదేం ఆపేక్ష వుండదమ్మా! నీ అత్తగారికి, నీ పిల్లల మీదున్నంత ప్రేమ పనిమని షికుంటుందా? పైగా ఇంకో విషయం కూడా వెళ్లిపోతున్నాను కాబట్టి చెబుతున్నాను. నేను మంచంలో వున్నంతకాలం మీ చిట్టెమ్మ బాగానే వుందికానీ ఈమధ్య నేనింట్లో తిరగడ మొచ్చాక, అదీ, ఇదీ, అలా చేస్తావెందుకూ? ఇన్ని కొన్నావెందుకూ? అనడుగుతుంటే దానికి కంటక ప్రాయమైపోయాను. 'మీకిన్ని ఆరా లెందుకూ? మా అమ్మగారే అడగరు' అంటూ మొహం ముడుచుకుంటోంది. ఒక్కోసారి పిల్ల ల్ని కూడా నానా మాటలూ అంటోంది. నువ్వేం పట్టించుకోవుగానీ నీ ఇంట్లో నెలకి ఏడెనిమి దొందలు నష్టమవుతోంది. షాపులో ఫస్టునాడు డబ్బు కట్టడమేకానీ ఏది ఎంతెంత ఇల్లు జేరుతోందో నీకక్కర్లేదు. ఇంట్లోంచి ఏ వస్తువు మాయమవుతోందో కూడా నువ్వు చూసు కోవు. నీకు తీరుబడిలేదు. దానికిది బాగా అలుసైపోయింది. నేను కానీ మీ అత్తకానీ వుంటే దాని ఆటలు సాగవేమోనని భయం. అంచేత ఏదో ఒక పోట్లాట పెట్టుకుని ఆవిడ్నీ నన్నూ కూడా వెళ్లగొట్టాలని ప్రయత్నిస్తోంది. పిల్లలు కూడా చిట్టెమ్మ షాపు దగ్గర ఏవేవో కొని ఎవరెవరికో ఇచ్చిందీ. కూరలుకొని ఎక్కడో ఇచ్చి వచ్చిందీ అని చెప్తున్నారు! మీరా లోన్లవీ తీసి బంగళా కట్టుకున్నవాళ్లు. సంపాదనంతా రెక్కలు ముక్కలు చేసుకుని సంపాదించినదే

కానీ వెనుక ఆస్తిపాస్తుల మీదొస్తున్న రాబడి కాదు. ఇంట్లో ఖర్చు అధికం! కాస్త కానుకో. నీకు టైముండదు! మీ అత్తగారుంటే దానికి పగ్గం వేసినదానివవుతావు. అదీకాక అబ్బాయి కూడా తల్లి వెళ్లిపోయాక చాలా బాధపడ్తున్నాడు. మెత్తనివాడు. నోరు తెరచి ఏమీ అనడుకానీ ఇదివరకటిలా లేడు. మన ముందు అమ్మా అమ్మా అంటూ వగలొలకబోసే ఈ పనివాళ్లే వెనకాతల, ఆ మొగుడంటే లెఖ్ఖలేదు. అత్తని వెళ్లగొట్టింది అని ఇరుగూ పొరుగూ వాళ్లకి ప్రచారం చేస్తారు. ఇంట్లో విషయాలు బజార్న పడెయ్యడం వాళ్లకో సరదా. ఇంతగా ఎందుకు చెబుతున్నానంటే నా సింధు బంగారు తల్లి. దాన్ని గురించి ఎవరైనా చెడుగా అనుకుంటే నేను భరించలేను. దేవతబొమ్మ మీద ఏ రంగో ఒలికిపోతే ఎంత బాధగా వుంటుందీ? అలాగే వుంటుందమ్మా, పుట్టింటివాళ్లకు ఆడపిల్ల మీద మాటొస్తే. నేనెన్నోసార్లు గమనించాను ఆ చిట్టెమ్మ ఏమైనా అలా కాదు ఇలా అని చెబితే నువ్వు వింటావు. ఒక్కోసారి దానికి కోపమొస్తుందేమోనని చాలా నెమ్మదిగా సమాధానపరుస్తూ మాట్లాడతావు. ఎందుకంటే అది పని మానేసి వెళ్లిపోతుందేమోనని నీకు భయం. కానీ అదే అణుకువా, నెమ్మదితనంలో సగం నీ అత్తగారి దగ్గర చూపిస్తే గనుక ఆవిడెక్కడికీ వెళ్లదు. నిన్నూ పిల్లల్నీ కనిపెట్టుకుని ఇక్కడే వుంటుంది. సొంత మనిషి సాటి పరాయివాళ్లెప్పుడూ రారు. డబ్బు కోసమో మరింకే ఆశతోనో కాక ప్రేమతో పేగుపాశంతో చేసే వాళ్లు దొరకడం బహు కష్టం! డబ్బు పెట్టినా నా వాళ్లూ అనే మనుమలు దొరకరమ్మా. ఎంతో జీవితాన్ని చూసి ఆఖరి మజిలీలో వున్న అనుభవంతో చెప్తున్నాను విను'' అంది.

''నువ్వన్నది నిజమే అత్తయ్యా! నేను నువ్వొచ్చినప్పటినించీ ఎంత బిజీగా వున్నా తీరుబడి చేసుకుని నీతో ఒక అరగంటైనా గడుపుతున్నాను. కానీ ఆవిడతో ఎప్పుడూ అలా గడపలేదు. మనసు విప్పి మట్లాడలేదు. ఏ మాటంటే ఏమనుకుంటారో అని నేనూ, ఆవిడా కూడా గిరి గీసుకుని కూర్చుంటాం. నిజమే! కలిసి మాట్లాడుకుంటుంటే మనకింతలేసి సమస్యలుండవనిపిస్తోంది. నేను నా పొరపాట్లు దిద్దుకోవడానికి ప్రయత్నిస్తాను. నా అంతట నేనే వెళ్లి ఆవిడ్ని తీసుకొస్తాను. కోడలిని చూడగానే నీ కళ్లల్లో కనిపించిన ఆనందం ఆవిడ కళ్లల్లోనూ చూడాలి. పిల్లలూ, అరుణ్ నన్నో దోషిలా చూస్తున్నారేమో అనిపిస్తోంది. త్వరగా నా తప్పులు దిద్దుకోవాలి'' అని స్థిరంగా చెప్తున్న సింధుని దగ్గరకు తీసుకుని నుదుటిమీద చుంబించింది తులశమ్మ.

నర్మదా, కావేరీ తులశమ్మని తీసుకుని వెళ్లిపోయాక ఇల్లంతా ఒక్కసారిగా బావురుమనిపించింది సింధుకి. నాలుగు రోజులే వుండి వెళ్లిపోయినప్పటికీ తులశమ్మ బాగా అలవాటయిపోయింది పిల్లలకి. ఎప్పుడూ బిజీగా వుండే తల్లిదండ్రులతో తీరని సరదాలన్నీ ఆవిడ దగ్గర తీర్చుకునేవారు. రోజా రాత్రుళ్లు చెరోపక్కనా కూర్చోపెట్టుకుని కథలు చెప్తుంటే ఇంతింత కళ్లు చేసుకుని వినేవారు. తనొచ్చినప్పటినుండీ రమ్యకి జుట్టు కత్తిరించనివ్వలేదు తులశమ్మ. ఒపిగ్గా జడేసి సాయంత్రం పూట దొడ్లో పూసిన పువ్వులు మాలకట్టి పెట్టేది. 'వీరీవీరీ గుమ్మడి పండూ..' అని ఆవిడ కళ్లు మూసి ఆడిస్తుంటే పిల్లల సంతోషం చెప్పనలవికాదు. ''అమ్మమ్మా ఇక్కడే వుంటావుకదూ! ఎక్కడికీ వెళ్లవుగా'' అని రోజా అడిగేవారు. ఇంటికొస్తూనే ''అమ్మమ్మా, అమ్మమ్మా'' అంటూ ఆవిడ గదిలోకెళ్తారు. ఆవిడ లేదని తెలిస్తే ఇల్లు పీకి పందిరేసేస్తారు. రమ్య రాగం మొదలెడ్తే ఆపదు. ప్రొద్దుటే రమ్యనీ తేజానీ తీసుకుని బజారుకెళ్లాడు అరుణ్. వాళ్లొచ్చేలోపల తను అత్తగారిని తీసుకురావాలి. వాళ్లకి ప్లెజంట్ సర్‌ప్రైజ్ ఇవ్వాలి అనుకుంటూ సింధు గబగబా తయారయి బయల్దేరింది.

మధ్యాహ్నం ఒంటిగంటవుతుండగా అరుణ్, పిల్లలూ వచ్చారు. పిల్లలు వస్తూనే ''అమ్మమ్మా, నీకోసం పండ్లు తెచ్చాం'' అంటూ గదిలోకి పరిగెత్తుకుంటూ వెళ్లారు. అక్కడ తులశమ్మ లేదు ''అమ్మమ్మేదీ?'' అంటూ చిందులేస్తూ వచ్చారు. సింధు ఎదురొచ్చి ''ఆలశ్యమయిపోయింది, డాడీని త్వరగా భోజనానికి రమ్మనండి''అంది. ''ముందు అమ్మమ్మెక్కడో చెప్పు'' అంది రమ్య. సింధు వేలు పెట్టి వంటింటివైపు చూపించింది. రయ్యిమని లోపలికెళ్లిన రమ్య ఆశ్చర్యపోయింది. అక్కడ చిట్టె

మ్మ బదులు నానమ్మ అప్పడాలు వేయిస్తూ కనిపించింది.

"నా బంగారు తల్లే! మా బంగారు తండ్రే" అంటూ ఆవిడ వచ్చి ఇద్దర్నీ కౌగలించుకుని ముద్దుపెట్టుకుంది.

"బామ్మా! ఎప్పుడొచ్చావు?" ఆనందంతో ఉక్కిరిబిక్కిరయిపోతూ అడిగింది రమ్య.

"మళ్లీ ఎప్పుడెళ్లిపోతావు?" దిగులుగా అడిగాడు తేజా.

ఆవిడ నవ్వి "ఇంకెక్కడకీ వెళ్లను! ఇక్కడే మీ దగ్గరే వుండిపోతాను" అంది.

బట్టలు మార్చుకుని డైనింగ్ టేబిల్ దగ్గరకొచ్చి కూర్చున్నాడు అరుణ్. పప్పు వడ్డించి, నెయ్యి వేస్తుండగా ఒద్దు అంటూ చెయ్యి అడ్డుపెట్టాడు. "రెండు గరిట్లకేనా! ముందా చెయ్యి అడ్డు తీసి శుభ్రంగా కడుపునిండా తిను" అన్న మందలింపు వినిపించింది.

ఆశ్చర్యంగా తల ఎత్తేసరికి తల్లి కనిపించింది. "అమ్మా, నువ్వా?"

"ఔనురా" అంటూ చేత్తో తల మీద నిమిరి "నా చేత్తో కడుపునిండా తినిపించాలని బుద్ధి పుట్టి వచ్చేశాను" అంది.

"అత్తయ్యా, గోంగూర పచ్చడి ఇక్కడే మరిచిపోయారు" అంటూ వంటింట్లోంచొచ్చింది సింధు.

"దాంట్లోకి, రెండుల్లిపాయలు తరుక్కురామ్మా, వాడికిష్టం" అందావిడ.

సింధు నవ్వుతూ అరుణ్ వైపు చూసి "అలాగే అత్తయ్యా" అంటూ లోపలికెళ్లింది. అరుణ్‌కి ఒక్క నిముషం అది కలో నిజమో తెలియలేదు. "అసలు... నువ్వెప్పుడు..." అని అరుణ్ అడుగుతుంటే "నీకు నేను రావాలని లేకపోయినా మా కోడలొచ్చి తీసుకొచ్చింది ఏమంటావు?" అందావిడ.

"ఎప్పుడూ ఆయన పనే ఆయనది కానీ, వెళ్లి తల్లిని తీసుకొద్దామని ధ్యాసేలేదు. ఎన్నాళ్లని ఓపిక పట్టను! అందుకని ఇక్కడెన్నాళ్లుంటారూ. మనింటికెళ్లిపోదాం. రండి, అని తీసుకొచ్చేశాను" అంది సింధు అరుణ్ వైపు క్రీగంట చూస్తూ.

"ఏమిటీ మాయ!" అంటుంటే అత్తాకోడళ్లిద్దరూ నవ్వసాగారు. పిల్లలు చప్పట్లు చరచసాగారు.

సింధు తులశమ్మ వెళ్లిపోవడం, తనెళ్లి అత్తగార్ని తీసుకురావడం అంతా పూసగుచ్చినట్టు చెప్పింది. రమ్య వెంటనే "ముల్లాపోయి కత్తీ వచ్చే ఢాంఢాం... అన్నట్లు అమ్మమ్మా వెళ్లి నానమ్మా వొచ్చే ఢాంఢాం, ఢాం" అనగానే అందరికీ నవ్వొచ్చేసింది.

★ ★ ★

శిరీషకారోజు జ్వరం నార్మలుకొచ్చింది.

"హమ్మయ్యా!" అనుకున్నాడు శేఖర్. జ్వరంలో ఫిట్సు రావడంతో అందరూ తెగ ఖంగారుపడిపోయారు. మేనమామ వచ్చి "నాకేదో భయంగా వుందిరా! నువ్విక్కడే వుండు" అంటూ శేఖర్నసలు కదలనివ్వలేదు. శేఖర్‌కి కూడా అసలు శిరీష మామూలు మనిషయ్యేదాకా మనసు నిలవలేదు. మధ్యలో ఓసారి యమునకి ఆఫీసుకు ఫోన్ చేస్తే రాలేదన్నారు. శిరీషని ఇంటికి పంపించేయగానే యమునా వాళ్లంటికెళ్లి సంగతేమిటో తేల్చెయ్యాలి! అనుకున్నాడు. బయల్దేరే రోజున "ఏమ్మా బావంటే నీ కిష్టమేకదూ!" అనడిగాడు తండ్రి శిరీషని.

"చాలా ఇష్టం నాన్నా!" అంది శిరీష.

అదిరిపడి తలెత్తాడు శేఖర్.

శిరీష నవ్వుతూ "కానీ పెళ్లి చేసుకునే ఇష్టం కాదు నాన్నా. బావ నాకో మంచి స్నేహితుడు అంతే!" అంది.

"అదేమిటే?" అంది శకుంతలమ్మ తెల్లబోతూ.

"అవునత్తయ్యా! మేనరికాలవీ మంచివి కావు తెలుసా? చదువుకున్న వాళ్లం, తెలిసి, తెలిసీ తప్పెందుకు చెయ్యాలి? కావాలంటే బావ నడుగు" అని శేఖర్ వైపు చూసింది.

"ఇలా అవుతుందనుకోలేదు. ఎన్నెన్ని ఆశలు పెట్టుకున్నాను? త్వరలో కోడలొచ్చి నట్టింట్లో తిరుగుతుందని ఎంత సంబరపడ్డాను?" అంది శకుంతలమ్మ కళ్లనీళ్లతో.

"కోడళ్లకేం తక్కువే, మరోటి చూద్దాం! పిల్లల అభిప్రాయాలకి విలువ నియ్యాలి. వాళ్లంటున్న దాంట్లోనూ పాయింటుంది"

అన్నారు సూర్యారావు.

శేఖర్ తల మీద నుంచేదో బరువు దిగిపోయిన ఫీలింగు కలిగింది. శిరీషకి మరోసారి కళ్లతో కృతజ్ఞతలు తెలుపుకున్నాడు. సాయంత్రానికి శిరీషని తీసుకుని తండ్రి వాళ్ల వూరు వెళ్లిపోయాడు. వెళ్లేటప్పుడు "నీ తుల సికోటని చూడ్డం పళ్లేదుకానీ త్వరలో ముహూర్తాలు పెట్టించు కలుద్దాం" అంది నవ్వుతూ.

శేఖర్ ఏం చెప్పలేక ఆమె చెయ్యి పట్టుకుని నొక్కి వదిలేసాడు.

★ ★ ★

కావేరికి క్షణం తీరుబడి లేకుండా వుంది. అప్పటికీ నాలుగు రోజులు శలవు పెట్టింది. అత్తగారు అరిశలు పిండివంట పెట్టుకుని కూర్చున్నారు. సుధాకరప్పటికి నాలుగుసార్లు పిలిచాడు. "అబ్బబ్బా వస్తున్నానండీ!" అంటూ వంటింట్లోంచొచ్చింది.

"రేపే పండగ, బట్టలు తేవాలి. ఇప్పుడిదాకా నీకు తీరుబడే దొరకలేదు" హడావిడిగా చెప్పాడు.

"అత్తయ్యగారొక్కరూ చేసుకుంటుంటే ఎలా రాను? నేనొస్తే జయ పన్లోకి దిగుతుంది, నా భయానికలా కూర్చుందిగానీ. పోనీ జయని తీసుకెళ్లండి బజారుకి" అంది.

"నువ్వొస్తేగానీ నాకేం కొనాలో ఎలా కొనాలో ఏం తెలుస్తుందీ?" అన్నాడు చిరాగ్గా.



"వెళ్లిరా వొదినా. నేనేం చెయ్యనులే" అంది జయ. తప్పదని బయల్దేరింది కావేరి.

ఈసారి నర్మద కూడా శలవుపెట్టి పండగ పన్లు చేస్తోంది. పిల్లలు మంచి హుషారుగా వున్నారు. తులశమ్మగారు మంచం మీద కూర్చునే కోడలికి కాజాలు ఎలా చెయ్యాలో నేర్పిస్తున్నారు. శంకర్ చాలా సంతోషంగా వున్నాడు. తల్లికీ పిల్లలకీ బట్టలు తెచ్చాడు. "అమ్మాయికేదీ?" అడిగింది తులశమ్మగారు. "తనకి నేను కొంటే నచ్చదమ్మా!" అన్నాడు. "చాల్లే సంబడం! వెళ్లి అమ్మాయికి కూడా తీసుకురా. ఇన్నాళ్లు కాపురం చేశావు తన ఇష్టాఇష్టాలు నీకు తెలియవూ!" అని మందలించిందావిడ.

కాసేపయ్యాక శంకరొచ్చి నర్మద వెనకాల నిలబడి "నీ కోసం చీర తెచ్చాను, నీకు నచ్చుతుందో లేదో?" అన్నాడు బెరుకుగా.

"ఏదీ" అంది.

ప్యాకెట్టులోంచి పాలపిట్టరంగు ప్లైన్ సిల్కు చీర తీసి "నీ ఒంటిరంగుకిది బావుంటుందనిపించింది. నీకు నచ్చకపోతే ఎక్స్‌చేంజ్ చేస్తాను" అన్నాడు.

"చాలా బావుందండీ! ఇప్పటినుండీ కొన్ని పన్లు నన్నడక్కుండా చేస్తుండండి" అంది నవ్వుతూ.

రెండు వాటాల పిల్లలూ కలిసి ఇంటి ముందు ఆడుకుంటున్నారు. ఇంతలో ఆటో ఆగింది. అందులోంచి శశిధర్ దిగి లోపలికొస్తుండగా "ఎవరు కావాలి?" అంటూ వల్లి నిలేసింది.

"జయ కావాలి" అన్నాడు ఖంగారుపడి వెంటనే.

"అత్తా! నువ్వు కావాలని ఎవరో వచ్చాడు" అంటూ అది రయ్యిన లోపలికెళ్లింది.

"ఎవరే" అంటూ గమ్మున లేవబోయిన జయ నడుంలో నెప్పిగా అనిపించి ఒక్కక్షణం అక్కడే కూర్చుంది. ఇంతలో హేమ్‌లెట్ వస్తూ "హూమ్ డూయూ వాంట్?" అనడిగింది శశిధర్‌ను.

"సుధాకర్‌గారిల్లు" అంటే "ఇదేఇదే కూర్చోండి" అని కూర్చోపెట్టి లోపలికెళ్లి "నెవర్ బిలీవ్ ఏ స్ట్రేంజర్ అన్నారు పెద్దలు. అందుకే సుధాకర్ కోసమెవరో వస్తే బయట కూర్చోపెట్టి వచ్చాను" అంది జయతో.

"అన్నయ్య కోసమా!" అంటూ మళ్లీ తన పన్లో మునిగిపోయింది జయ. "వదినగారూ! ఏం చేస్తున్నారు" అంటూ వంటింట్లోకెళ్లిపోయింది హేమ్‌లెట్.

షాపింగ్ పూర్తి చేసుకుని బట్టల ప్యాకెట్లూ, కూరలూ, పండ్లూ సంచులనిండా మోసుకుంటూ లోపలికొచ్చిన కావేరీ, సుధాకర్లకు ముందు గదిలో కుర్చీలో నిద్రపోతున్న శశిధర్ కనిపించాడు.

"అయ్యయ్యో! ఇదేవిటిలా పడుకున్నారు" అనుకుని "జయా జయా!" అంటూ లోపలికెళ్లింది కావేరి. కూర్చుని తీరుబడిగా ముగ్గులేసుకుంటున్న జయని చూడగానే "అదేమిటే! అలా ముందుగదిలో ఆయన్ని ఒంటరిగా వదిలేసి.." అనగానే "అత్తయ్య మాట్లాడకూడదంటేనూ..." అని నసిగింది తన ధోరణిలో ముగ్గుని తదేకంగా చూసుకుంటూ.

అలా ఎందుకు చెప్పారూ! అదేమన్నా ఆచారమేమో అనుకుంటూ వంటింట్లోకెళ్లింది కావేరి. "జయా వాళ్లాయనతో దాన్ని మాట్లాడద్దన్నారా?" అంది హేమ్‌లెట్‌తో.

"జయ హస్‌బెండా?" అందావిడ ఆశ్చర్యంగా.

ఆవిడ ద్వారా జరిగిన పొరపాటు తెలుసుకుని నవ్వాపుకోలేకపోయింది కావేరి.

సుధాకర్ జయ గదిలోకెళ్లి "శశిధర్ అలిగి వెళ్లిపోయాడు" అన్నాడు దిగులుగా మొహం పెట్టి.

జయ ఉలిక్కిపడి "ఆయనెప్పుడొచ్చారూ?"అంది.

"చాలా సేపయిందిట. నువ్వు పలకరించను కూడా పలకరించలేదని కోపమొచ్చి వెళ్లిపోయాడు" అన్నాడు.

జయకి కళ్లల్లో నీళ్లు తిరిగాయి. "అదేమిటన్నయ్యా! నువ్వైనా చెప్పద్దూ" అంటూ వాకిట్లోకి పరిగెత్తింది. కుర్చీలో నిద్రపోతున్న భర్తని చూడగానే నవ్వూ, జాలీ కలిసివచ్చాయి.

"ఏమండీ!" అంది ప్రేమగా.

అదాటుగా లేస్తూ "నువ్వెప్పుడొచ్చావు?" అన్నాడు. "ఖర్మ! నేను కాదు మీరే వస్తే. అయినా జయ భర్తనని చెప్పి లోపలికి రావచ్చుగా" అంది అలకగా.

"ఏమో అలా చెప్పడానికి నాకేమిటో సిగ్గేసింది" అన్నాడు బిడియంగా.

"భార్యని భార్య అని చెప్పుకోడానికి కూడా సిగ్గేనా! సరే లోపలికి రండిక, అన్నయ్యకీ సంగతి చాలు నన్ను ఎప్పుడూ ఏడిపించడానికి" అంటూ అతని బ్యాగ్ తీసుకుని లోపలికి దారి తీసింది.

"నేను క్వశ్చన్ వేస్తే నువ్వు ఆన్సర్ చెప్పకుండా రిఫరెన్స్ మొదలుపెట్టావు. అందుకే పానవడానికి కాస్త గ్రేస్ కావల్సొచ్చింది. ఏమనుకోకు నాయనా!" అంది హేమ్‌లెట్.

సాయంత్రం ఐదింటికి ప్రభ వచ్చి వాళ్లమ్మాయి బొమ్మలు పెట్టుకుందని పిలిచింది. "పొద్దుటినుంచీ ఒకటే పని. అలసిపోయానే బాబు, ఏమైనా పంపించు, నేనన్నమొకటే వండుకుంటాను" అంది.

"అది మాత్రమెందుకు! మాతోబాటే మీరూనూ, పిల్లలలెలాగూ ఇక్కడే వున్నారు. వుండిపొండి" అంది కావేరి.

"అంతమాత్రానికే 'సెవన్ జాస్మీన్స్ హైట్'లా నువ్వలసిపోతే, వాళ్లు మాత్రం తక్కువ పని చేసుకుంటున్నారనుకున్నావా?" అడిగింది హేమ్‌లెట్ కాస్త కోపంగా కోడల్ని.

"ఫరవాలేదులెండి! ఏదో దగ్గరగా వున్నాం కాబట్టి..." అంటూ అందుకుంటున్న వర్ధనమ్మతో "స్టేదేర్ అక్కడే ఆగిపోండి వదినగారూ, ఇలా మీరు అలవాటు చెయ్యడం ఏమీ బాగాలేదు. పగలంతా ఆఫీసులో చాకిరీ చేసుకొచ్చి ఇంట్లో మళ్ళీ క్షణం విశ్రాంతి తీసుకోకుండా చేస్తున్న కావేరీ, తొమ్మిది నెలలొచ్చి కూడా ఒకచోట నిముషముండకుండా తిరుగుతూ చేస్తున్న జయాలాంటిదే కదా తను కూడా! నీ ఇంట్లోపని నీకు బరువేంటీ చేసుకో అని మీరు మందలించుంటే ఇలా తయారయ్యేది కాదు. మీరున్నంతవరకూ అన్నీ చేస్తారు ఫరవాలేదు కానీ రేపు తన పిల్లలు పెద్దవాళ్లవుతారు. పెళ్లిళ్లు, పేరంటాలు ఎన్నెన్నో చెయ్యాలి. పని రాకపోతే ఎంత కష్టం? నలుగురిలో నగుబాటు కాదూ!" అంటూ నిష్టూరమాడింది.

వర్ధనమ్మేమీ మాట్లాడలేకపోయింది. కూర్చుని బియ్యమేరుతున్న జయ చేతిలోంచి పళ్ళెంతీసి ప్రభకిస్తూ "మీ అక్క ఏర్తుందిగానీ నువ్వెళ్లి మీ ఆయనకేం కావాలో చూడు! అసలే చాలా పైవరుడిలా వున్నాడు" అంది.

ప్రభ మారుమాట్లాడకుండా బియ్యం ఏరసాగింది.

జయ గదిలోకెళ్ళేసరికి నగమల్లిన స్వెట్టర్ని పట్టుకుని చూస్తున్న శశిధర్ కనిపించాడు. "ఏమిటి చూస్తున్నారూ?" అనడిగింది.

"ఇన్నిరోజులూ నాకు దూరంగా వుండి, దీనికి దగ్గరగా వున్నావుకదా! అందుకని ఆ విశేషాలన్నీ తెలుసుకుంటున్నాను" అన్నాడు చెంపకి చేర్చుకుని.

"చాలా నేర్చుకునొచ్చారే!" అంది నవ్వుతూ.

"నువ్వుంటే నీతో మాట్లాడ్తూ వుండేవాణ్ణి. నువ్వు లేకపోబట్టి పుస్తకాలు చదవడం అలవాటు చేసుకున్నాను. అసలు పుస్తకాలు చదవడం ఎంతమంచి అలవాటో తెలుసా జయా! మనింట్లో మనం కూర్చుని ప్రపంచాన్ని చూడొచ్చు. నేనెన్నో మంచి మంచి పుస్తకాలు కొనివుంచాను. నువ్వొచ్చాకా చదువుదువుగానీ, ఇంకొక గమ్మత్తయిన విషయం. అమ్మకి కూడా చదవడం అలవాటు చేసేశాను. దాంతో మధ్యాహ్నంపూట పెత్తనాలన్నీ మానేసి పుస్తకం పట్టుకుని కూర్చుంటోంది. అస్సలు ఆవిడ నోరు వినిపించడంలేదు. అయినా అత్తలేని కోడలుత్తమురాలు కదా"

జయ నవ్వింది అతని మాటలకు. "వదినగారూ వాళ్ళూ బావున్నారా?"

"ఆ వాళ్ళు వేరే ఇల్లు చూసుకున్నారు. ఇవాళ రేపట్లో మారిపోతామన్నారు" అన్నాడు.

"అమ్మో! ఎందుకలా?" అంది బాధగా జయ.

"అమ్మ వంట అవీ సరిగ్గా చెయ్యడం లేదని సాధించారు. దాంతో ఈవిడకి ఒళ్లు మండి "కూర్చుని తినడంకాక సాధింపు

కూడానా? అయినా నేనూ నా కోడలూ మీకు జీతం, భత్యంలేని నౌకర్లమా?'' అనడిగింది. దాంతో మా అక్క ''నీ కంత బరువుగా వుంటే వెళ్ళిపోతాం, వంట చెయ్యాల్సిన అగత్యం నాకేమిటీ? వేరేగా వుండి వంటమనిషిని పెట్టుకుంటాను'' అని రోషంగా వెళ్ళి ఇల్లు కుదుర్చుకుంది. నేను కానీ అమ్మకానీ వుండమని అడగలేదు. పైపెచ్చు ఇంట్లో న్యూసెన్సు తగ్గిపోతోందని సంతోషించాము'' అన్నాడు నవ్వుతూ.

''ఈ రెండు నెలలో శశిధర్ ఎంతో మారిపోయినట్లనిపించింది జయకు. ''నేను లేకపోతే మీకేమనిపించిందీ?'' అనడిగింది.

''చాలా బాగా అనిపించింది'' అన్నాడు దగ్గరకి తీసుకుంటూ.

''ఎందుకూ?'' బుంగమూతి పెట్టి కోపంగా అడిగింది.

''నువ్వున్నప్పుడు నీ గురించి ఆలోచించనే లేదెప్పుడూ! కానీ నువ్వు లేనప్పుడు రోజూ నీ గురించే ఆలోచించాను. నీలోటు తెలిసొచ్చింది. దూరంగా వున్నప్పుడే మనిషి విలువ తెలుస్తుందనిపించింది. అందుకే అప్పుడప్పుడూ భార్యాభర్తలు దూరంగా వుంటూ వుండాలి. బహుశా! ఈ ఆచార వ్యవహారాలు అందుకోసమేర్పరిచినవే కాబోలు'' అన్నాడు.

''నిజంగా నాలోటు తెలిసొచ్చిందా?'' అడిగింది తృప్తిగా.

''బాగా తెలిసొచ్చింది. ఈసారి నువ్వొచ్చాకా చూస్తావుగా నిన్నెంత బాగా చూస్కుంటానో'' అన్నాడు మరింత దగ్గరకి తీస్కుంటూ.

''ఇప్పుడిలాగే చెప్తారు. పాపో, బాబో పుట్టగానే అన్నీ మరిచిపోయి వాళ్ళే లోకమనుకుంటారు, వెనకొచ్చిన కొమ్ములు వాడికదా'' అంది నవ్వేస్తూ.

''అత్తగారి దగ్గర సామెతలు బాగానే నేర్చుకున్నావు కానీ, పిల్లలు పుట్టాకే భర్తకి భార్యంటే ప్రేమ మరింతగా పెరుగుతుంది. బహుశా తండ్రిని చేసినందుకు కృతజ్ఞతవల్ల కాబోలు'' అన్నాడు. జయ రెప్పవాల్చకుండా శశిధర్‌నే చూడసాగింది.

''అంతలా చూడకు! దిష్టితగులుతుంది'' అంటూ అరచేత్తో ఆమె కళ్ళు మూసి, పెదవుల మీద ముద్దు పెట్టాడు.



సింధు సోఫాలో కూర్చుని రమ్య చేత బొమ్మలు పెట్టిస్తోంది. అరుణ్ చిన్న చిన్న వెదురుబద్దలతో బోను చేసి అందులో చిన్న చిన్న జంతువుల బొమ్మలు పెట్టి 'జూ' తయారుచేస్తున్నాడు. తేజా వంటింట్లో బామ్మతో కలిసి చేగోడీలు చేస్తున్నాడు.

''బామ్మ నాకు రేపు పూలజడకుట్టుంది తెలుసా?'' అంది రమ్య కళ్ళు పెద్దవి చేసి.

తేజ ''నాకూ కుట్టుంది'' అన్నాడు వెంటనే.

''నీకెక్కడ కుట్టుందీ?'' అంది ఏడిపిస్తూ రమ్య. ''కుట్టాల్సిందే, కుట్టాల్సిందే'' అంటూ చిందులు తొక్కసాగాడు ఏడుస్తూ వాడు.

''ఆడపిల్లలకేరా ఆ జడలూ, ముచ్చట్లూ. మనకి వేరేవున్నాయి. ఇదిగో అంటూ పతంగీ, చక్రీ చూపించాడు అరుణ్. ''నేనెగరేస్తా. ఎగరేస్తా'' అంటూ సంతోషంగా చప్పట్లు చరుస్తూ తండ్రి వెంట మేడమీదికెళ్ళిపోయాడు వాడు.

''చూడమ్మా డాడీ! మధ్యలో ఒదిలేసి వెళ్ళిపోయారు'' అంటూ ఏడుపుమొహం పెట్టిన రమ్యతో ''నేను చేస్తాలే'' అంటూ వచ్చికూర్చుంది సింధు.

ఇంతలో చిట్టెమ్మ చేతులు నులుపుకుంటూ వచ్చి నిల్చుంది. ''ఏమిటీ?'' అడిగింది సింధు తలెత్తకుండానే. ''నాకు జీతం గిట్టుబాటవట్లేదమ్మా...!'' అంది నెమ్మదిగా.

''ఇంకో యాభై పెంచుతాన్లే''

''అయినా కష్టమే అమ్మా!''

సింధు తలెత్తి నవ్వుతూ "ఎంత పెంచినా నీకింక గిట్టుబాటవుదులే! సరే, నీ ఇష్టం" అంది.

అక్కడినుండి వెళ్లిపోయింది చిట్టెమ్మ. కాసే పటికి అత్తగారొచ్చి "సింధూ చిట్టెమ్మనెళ్లిపొమ్మన్నావా? బ్యాగదీ సర్దుకుంటోంది" అనడిగింది.

"నేను వెళ్లిపొమ్మనలేదు. తనే వెళ్లిపోతోంది" అంది సింధు మామూలుగా.

"నా వల్ల కాదుగదా!" అందావిడ ఖంగారుగా.

"మీవల్లే! మీరుంటే తన ఆటలు సాగనివ్యరనీ, చాటుమాటుగా చేసే పన్లు పసిగడ్తారనీ భయపడి వెళ్ళిపోతోంది. వెళ్ళనీయండి. వేరేవని పిల్లని చూస్కుందాం" అంది సింధు. ఇంకావిడేం మాట్లాడలేదు.

ఇంకోనెల జీతమెక్కువిచ్చే పంపించింది సింధు చిట్టెమ్మని.

ఆ రాత్రి జడలో మల్లెపూలు పెట్టుకుని, తెల్లచీరలో వచ్చిన సింధుని కన్నార్పకుండా చూస్తూ వుండిపోయాడు అరుణ్.

"ఏమిటలా చూస్తున్నారూ?" అనడిగింది సింధు చిరునవ్వుతో. "అలా ఆకాశంలో విహరిస్తున్న దేవకన్యలెవరన్నా పొరపాట్న కాలుజారి భూమిమీద పడిపోయారేమోననిపించిందిలే" అన్నాడు.

ఆమె కురులలోని విరులూ, అగరుపొగలూ, అత్తరులూ కలిపి ఆ గదంతా మత్తయిన సుగంధం వ్యాపించింది. స్త్రీ లతలాంటిది. బలమైన వృక్షాన్ని పెనవేసుకుని శాశ్వతమవుతుంది. శాఖోపశాఖలుగా విస్తరించి వృక్షం మొదలునే మరుగుపరిచి, అంతా తనే అనే భ్రాంతి కల్పిస్తుంది. తన తాలూకు సుగంధాన్నీ అందాలనీ విరజల్లి మనసు మైమరపిస్తుంది... అనుకున్నాడు.

★ ★ ★

"రేపు పెళ్లిచూపులకే చీర కట్టుకుంటావూ?" అడిగింది కాత్యాయిని. బీరువాలోని చీరలన్నీ తీసి చూస్తూ.

వెల్లకిల్లా పడుకుని, అరచెయ్యి మొహానికడ్డం పెట్టుకున్న యమున మాట్లాడలేదు.

"నిన్నేనే, ఈ నీలిరంగు మైసూర్ సిల్కు చీర కట్టుకుంటావా?" అడిగింది. మళ్లీ జవాబు రాకపోవడంతో పోనీ ఈ పసుపురంగు వెంకటగిరి జరీచీర కట్టుకో. పసుపురంగు మంచిది శుభం కలగచేస్తుంది" అంది. దానికీ జవాబు రాకపోయేసరికీ "నేను నీతో మాట్లాడ్తున్నానా? లేక గోడతోటా?" అడిగింది కోపంగా.

"గోడకేరంగు వేయనూ? పసుపా లేక నీలమా? అన్నట్లుగా అడుగుతుంటే గోడనే అనుకున్నాను" అంది యమున విసుగ్గా.

"ఏమయిందే నీకు! ఏ రంగుచీర కట్టుకుంటావని అడిగితే కూడా తప్పేనా?" అందావిడ బాధగా.

"వాళ్ళొచ్చేది నన్ను చూడ్డానికా లేక నా చీరలు చూడ్డానికా? ఏదో ఒకటి కట్టుకుంటాను సరా!" అంది మళ్ళీ విసుగ్గా.

"కట్టుకునే చీరను బట్టి కూడా ఆడపిల్ల కందం వస్తుందమ్మా, మా తల్లివిగా లేచి ఏ చీర బావుంటుందో చూడు! ఈ మొదటిపెళ్లి చూపులే ఆఖరయి నా తల్లికి మంచి భర్త దొరకాలి" అంటూ గడ్డం పట్టుకుని ముద్దుపెట్టుకుంది కాత్యాయిని.

యమున పెదవులు విరక్తిగా నవ్వాయి. ఇవే ఆఖరవ్వాలట, ఈ వచ్చినతనే తన భర్తవ్వాలట. అమాయకంగా దీవిస్తున్న తల్లికి తెలియదుకదా! తన బిడ్డకెంత శిక్ష విధిస్తోందో! మనసులోమాట బైటపెట్టలేని తన అశక్తతమీద తనకే అసహ్యమేస్తోంది. ఏమిటిది? ఎందుకిలా జరుగుతోంది? అసలు తనెలా ఒప్పుకుందీ తతంగానికి. ఒకవేళ ఖర్మకాలి కుదిరిపోతే ఇంకేమయినా వుందా? జీవితాంతం మరొకరి భార్యగా శేఖర్‌కి దూరంగా... ఆ ఆలోచనే కాల్చేస్తోందసలు.

పండగ సరదా, సంతోషం కొంచెం కూడా ఆ ఇంట్లో కనిపించడంలేదు. కాత్యాయిని పులిహోరా పరమాన్నం చేసి పండగయిందనిపించింది. రామారావుగారు బి.పి. మాత్రేసుకుని నిద్రపోతున్నారు. శరత్ ఎవరో స్నేహితులతో బయటికెళ్ళాడు. యమున లేచి ఎంగిలి పడలేదాపూట. పండగపూటా వస్తుంటావా ఏమిటే. లేచి కాస్త కతికి పడుకో. ఒళ్ళేమన్నా

వెచ్చపడిందా?'' అంటూ వచ్చింది కాత్యాయిని.

తనకి తెలుసు. తను తినకపోతే తల్లి కూడా తినదని అయినా ఎందుకో తినాలనిపించలేదు. "నువ్వు తినేసిరా, నాకు తినాలనిలేదు'' అని గోడవైపు తిరిగిపడుకుంది.

"ఏమో ఎందుకాకల్లేదో, అదైనా చెప్పకపోతే ఎలా? బాగానే సాధిస్తున్నారందరూ కలిసి నన్ను'' అంటూ గొణుగుతూ వెళ్ళిపోయిందావిడ.

★ ★ ★

జయ భారంగా కూర్చుని ముగ్గుపెడ్తోంది వాకిట్లో. అరుగుమీద వాలుకుర్చీలో కూర్చుని- "ఇంక చాలు, వచ్చెయ్యి'' అన్నాడు శశిధర్.

"అయిపోవచ్చిందండీ!'' అంటూ ఓసారి మొత్తం ముగ్గుని తనివిదీరా చూసుకుని, అక్కడక్కడా మళ్ళీ ముగ్గుదిద్దుతోంది.

భోజనాలు చేసి వక్కపొడి నవుల్తూ బయటికొచ్చిన సుధాకర్, కావేరీ ఇది చూసి "అదేంపని జయా! గొంతుకూర్చుని ముగ్గుపెడ్తావా'' అన్నారు.

"ఒక్కనిమిషం'' అంటూ తనపని తను చెయ్యసాగింది జయ.

శశిధర్ లేచెళ్లి "ఎక్కడెక్కడ గియ్యాలో చెప్పు, నే వేస్తాను'' అంటూ ఆమె చేతిలోంచి ముగ్గు కప్పందుకున్నాడు.

"మీరా!'' అంది ఆశ్చర్యంగా జయ.

"మరేం చెయ్యను! మొండిగా, చెప్తే వినట్లేదుకదా నువ్వు'' అన్నాడు.

జయ నవ్వుతూ ఎక్కడెక్కడ వెయ్యాలో చెప్తుంటే శశిధర్ వేస్తున్నాడు. పిల్లలు "మావయ్య ముగ్గులేస్తున్నాడోచ్'' అంటూ ఎగుర్తున్నారు.

"నేచెప్పలేదూ. అతను మంచివాడేననీ'' అన్నట్లు చూశాడు సుధాకర్ కావేరివైపు.

కావేరి జయ కళ్లల్లో తృప్తినే గమనిస్తోంది.

కనుమనాడందరూ కలిసి ప్రభ ఇంట్లో భోజనాలు చేశారు. హేమలతమ్మగారు నవ్వుతూ, నవ్విస్తూ వడ్డనచేసి అందరికీ గొంతుదాకా కూరి తినిపించింది.

సాయంత్రం అందరికీ బట్టలు పెట్టారు సుధాకర్, కావేరీ. "నా తరపునుంచి మా అమ్మాయికి'' అంటూ ఓ ప్యూర్ సిల్క్‌చీర తెచ్చి కావేరికి ప్రభచేత పెట్టించింది హేమలతమ్మ.

ఆవిడభిమానానికి కావేరి కళ్ళనిండా నీళ్ళొచ్చాయి. వొంగి కాళ్ళకి నమస్కరించింది.

"గోల్డెన్ మదర్‌లా కలకాలం వర్ధిల్లు'' చెప్పిందావిడ.

రాత్రందరూ సుధాకర్ వాళ్ళవాకిట్లో చాపలేసుకుని కూర్చుని కబుర్లు చెప్పుకుంటుంటే నర్మదా, శంకర్, తులశమ్మగారూ పిల్లలూ కూడా వచ్చికూర్చున్నారు. పిల్లలు వెంటనే ఆట మొదలెట్టేశారు. వర్ధనమ్మగారూ, తులశమ్మగారూ, హేమ్‌లెట్ పిచ్చాపాటీ మాట్లాడుకుంటుంటే, జంటలు ఒకళ్ళమీదొకళ్లు జోక్స్ పేల్చుకున్నారు.

మర్నాడు అందరూ ఆలస్యంగా లేచారు. చివరికి కావేరి కూడా బారెడు పొద్దెక్కేవరకూ లేవలేకపోయింది. అత్తగారు కాఫీ తెచ్చిస్తే సిగ్గుపడిపోయింది. శశిధర్ వెళ్లిపోవడానికి తయారయ్యాడు. ఇంకో రోజుండమని సుధాకర్ బలవంతం చేసినా వినలేదు. జయ దిగులుగా చూసింది. కావేరి హడావుడి పడ్తూ వంట చేసింది. మాటిమాటికి గడియారం చూస్తోంది. పదవుతుండగా కాత్యాయినీ, రామారావుగారూ, యమునా ఆటోలోంచి దిగారు.

"హమ్మయ్యా!'' అంటూ గుండెలనిండా ఊపిరి పీల్చుకుని ఇంట్లోకి తీసుకొచ్చింది వాళ్ళని కావేరి.

"ఇంతాలస్యంగానా?'' అడిగాడు సుధాకర్ యమునని. బావగారివైపు నిర్లిప్తంగా చూసూరుకుంది. "మొహం కడుక్కో! చీర మార్చుకో, వాళ్ళొచ్చేస్తారు'' అంటూ చెల్లెల్ని తొందర చెయ్యసాగింది కావేరి.

"ఏం ఇలా బాలేనా?'' అడిగింది యమున. గులాబీరంగు పువ్వులున్న తెలుపు జార్జెట్ చీర కట్టుకుని, వొదులుగా జడేసుకుని, చిన్నబొట్టు పెట్టుకుని సింపుల్‌గా వుంది యమున.

"పోనీ మొహమన్నా కడుక్కుంటావా? అదీ లేదా?'' అడిగింది విసుగ్గా.

"సరే!" అంటూ లేచి లోపలికెళ్ళిందింక తప్పదని. హేమలతమ్మగారూ, ప్రభా వచ్చారు కాసేపటికి. సుధాకర్, శశిధర్‌తో "మనమెళ్లి పెళ్ళివారిని తీసుకొద్దాం" అన్నాడు. అతను సరేననడంతో ఇద్దరూ బయల్దేరారు.

యమున బయటికొచ్చి "జయ బాత్రూంలోంచి ఎంతకీ రావట్లేదు" అని చెప్పింది.

"కాల్ ఆఫ్‌ది నేచర్ ఏమో" అంది హేమలతమ్మ.

కావేరీ, వర్ధనమ్మా ఖంగారుగా లోపలికెళ్లారు. ప్రభ వాకిట్లోకెళ్ళి బయల్దేరుతున్న అన్నగారితో "ఒక్క నిముషముండు. జయ ఏదో ఖంగారు పెట్టేటట్టుంది" అంది.

వాళ్ళిద్దరూ లోపలికి వచ్చారు.

"ఏమ్మా నడుంనెప్పిగా వుందా?" అడుగుతోంది జయని వర్ధనమ్మ.

"అమ్మా, బాబోయ్" అని మూల్గడం తప్ప జవాబివ్వలేకపోతోంది జయ. "ముందు స్టౌ మీద కాసిని వేడినీళ్లు పడెయ్యి, నాకు కాళ్లూ చేతులూ ఆడ్డంలేదు బాబూ" అంటూ గాభరా పడసాగింది వర్ధనమ్మ.

"ఖంగారెందుకు వదినా మేమంతా లేమూ. అయినా డాక్టరిచ్చిన డేట్‌కంటే ఇంత ముందుగానా?" అనుమానం వ్యక్తం చేసింది కాత్యాయిని.

"రాంగ్ కాలిక్యులేషన్స్, ఈ కాలం పిల్లలకి" అంది హేమ్‌లెట్ ఠక్కున.

కావేరి వేడినీళ్లు తీసుకురాగానే జయని బాత్రూంలోకి తీసుకెళ్ళారు. శశిధర్ వెళ్ళి ఆటో తీసుకొచ్చాడు. జయ అరువులు ఎక్కువయ్యాయి. వర్ధనమ్మకి కళ్లు చీకట్లయి వెళ్లి దేవుడి గదిలో కూర్చుంది. "అమ్మగారికి నమస్కారం చేసిరా" చెప్పాడు శశిధర్ జయతో. జయ తల్లి దగ్గరకెళ్ళగానే "త్వరగా ప్రసవమయి గుమ్మడిపండులాంటి మనవడ్నెత్తుకురా తల్లీ" అని దీవించి మళ్ళీ దేవుడి దగ్గరే కూలబడిపోయింది.

"అత్తయ్యగారికి ఖంగారెక్కువ, నువ్వెళ్ళమ్మా హాస్పిటల్‌కి" అంది కావేరి.

చివరికి కాత్యాయినీ, శశిధర్, సుధాకర్, ప్రభా జయని తీసుకుని వెళ్ళారు. వెళ్ళేటప్పుడు "పెళ్లివారికి మర్యాదలవీ తక్కువగా కుండా చెయ్యండి, బావగారూ మీరుంటారుగా" అని ఫల్గుణరావుతో చెప్పి వెళ్ళాడు సుధాకర్.

"పూర్వమిలాగే, పిల్ల సమర్తా, గేదీనడం, ముసురువానలూ, ఇంటావిడ బయట చేరడం, దూరపుబంధువుపోయి సూతకం, కోడలికి నెప్పులూ, ఒక్కసారి వస్తాయి అనేవారు పెద్దలు" అంది హేమలతమ్మ.

కావేరికి కూడా ఖంగారుగానే వుంది. కానీ బయట పడకుండా ఇంట్లోకీ, బయటికీ తిరుగుతూ అత్తగారికి ధైర్యం చెప్పసాగింది. హేమలతమ్మ కాఫీ కలిపి వర్ధనమ్మకీ, కావేరికి, రామారావుగారికీ ఇచ్చింది. తనకేం పట్టనట్లు యమునెళ్ళి గదిలో పడుకుంది. "ఆ పెళ్లివారు రాకపోతే బావుణ్ను వచ్చినా నేను నచ్చకపోతే బావుణ్ణు, నచ్చినా ఎక్కువ కట్నమడిగితే బావుణ్ను" అనుకుంటుంటే శేఖర్ గుర్తుకొచ్చి ఏడుపొచ్చేసింది. ఒక్కసారిగా లేచి శేఖర్ ఎడ్రెస్ వెతుక్కుంటూ పరిగెత్తుకెళ్ళి "ఇదంతా ఏమిటి?" అని కాలర్ పట్టుకుని అడిగితే! అనిపించింది. "అవును, నేనెందుకలా అతన్ని ముఖాముఖీ కలవలేదు. నువ్వు చెప్పిన కబుర్లేమిటీ? చేస్తున్న పనేమిటీ? నాకంటే అందగత్తె కనిపించగానే నన్నొదిలేస్తావా? నీకిది న్యాయమేనా? అని కడిగి వదిలిపెట్టాల్సింది" అనుకుంటూ దిగ్గున లేచి కూర్చుని "వెళ్ళాలి. నేను వెంటనే వెళ్తాను. ఇప్పటికే ఆలస్యమయిపోయింది" అంటూ మంచం మీదనుంచి లేస్తుండగా కారు హారన్ వినిపించింది.

హేమలతమ్మగారు "కావేరీ! వాళ్ళొచ్చేసారు. పెళ్లివారొచ్చేశారు" అంటూ కేకలు వేసింది. యమున నిస్త్రాణగా మళ్ళీ మంచంమీద కూలబడిపోయింది.

బయట హడావుడీ, వర్ధనమ్మగారినీ, రామారావుగారినీ పరిచయాలు చెయ్యడం, శంకర్, నర్మదా గొంతులూ వినిపిస్తున్నాయి. కావేరి లోపలికి వచ్చి "త్వరగా తయారవ్వు! అబ్బాయి చాలా అందగాడు, దిష్టితగుల్తుందే

మోనన్నంతగా బావున్నాడు'' అని చెప్పి, మళ్ళీ హడావుడిగా వెళ్ళిపోయింది.

''హూ! అందగాడు, ఈ కళ్లకి శేఖర్ తప్ప మరెవరూ అందంగా కనిపించరీ జన్మలో'' అనుకుంది విరక్తిగా.

బయట కాఫీ, టిఫెన్లవుతున్నట్టున్నాయి. చప్పుడు విన్పించసాగింది. నర్మద లోపలికొచ్చి ''పద, తీసుకురమ్మంటున్నారు'' అంది, ఏడ్చి ఏడ్చి ఉబ్బినట్లున్న యమున మొహాన్ని తేరి పార చూస్తూ

''పదండి, వస్తాను'' అని నడిచింది యమున.

కాస్త మొహం కడుక్కుంటే అంటున్న నర్మద మాటలకడ్డొస్తూ ''అఖ్ఖరలేదు'' అంది. ముందు గదిలో కెళ్ళగానే ''రామ్మా రా, అంటూ'' పెద్దవాళ్ల గొంతులు కలగావుల గంగా వినిపించాయి. కావేరి ఏదో పరిచయం చేసింది. యమున తలెత్తకుండానే నమస్కారం చేసి నర్మద పక్కన కూర్చుంది చాప మీద.

''పేరేమిటమ్మా!'' అత్తగారి గొంతులా వుంది.

''యమున'' చెప్పింది.

''పాటలొచ్చా'' అడిగిందో మగగొంతు.

''రావు'' ఠక్కున చెప్పింది తలెత్తకుండానే.

''ఒక్కసారి తలెత్తి అబ్బాయిని చూడమ్మా'' అన్నారెవరో.

''అఖ్ఖరలేదు'' పక్కనించి మోచేత్తో పొడిచింది కావేరి చెల్లెల్ని.

''పోనీ మా వాడు చూడాలనుకుంటున్నాడు. తలెత్తుతావా?''

''బాగా విన్నదే ఆ కంఠం. ''ఎవరబ్బా!'' అనుకుంటూ ఆ వైపు చూసింది. ''రమేష్?'' ఇదేమిటిలా తన కథ అంతా తెలిసి కూడా పెళ్ళి సంబంధం తెచ్చాడూ అనుకుంటూ విసురుగా తలపక్కకి తిప్పింది.

అంతే!

షాక్ కొట్టినట్లు ఆగిపోయింది.

చిరునవ్వు నవ్వుతూ కాలుమీద కాలేసుకుని శేఖర్!

ఇది కలా నిజమా! అనుకుంటుంటే కళ్లు మసకలయ్యాయి. శేఖర్ రూపు అలుక్కుపోయి నట్లు కనిపించసాగింది. నెమ్మదిగా కావేరి భుజంమీదికి వాలిపోయింది.

''యమునా! ఏమయింద'' అంటూ ఖంగారు పడసాగింది కావేరి.

''ఏమీ కాలేదు, కాస్త షాకు తిందంతే'' అన్నాడు రమేష్ గ్లాసులోంచి నీళ్లు తీసి యమున ముఖంపై జల్లుతూ.

''ఏమిటిదంతా, అయోమయంగా వుంది'' అంటూ గాభరాపడ్డారు రామారావుగారూ, కావేరీ.

''కృష్ణపరమాత్ములు... మా బావగారాడించిన నాటకం'' అన్నాడు రమేష్ నవ్వుతూ.

యమున తెప్పరిల్లి లేచి కూర్చుంది.

''పడుకో అమ్మా, లేవకు మా శేఖర్ అంతా చెప్పాడు. నా మనసులో వేరే అమ్మాయుంది అని మొదటే చెప్తే ఇంత గొడవుండకపోనమ్మా. నిన్న రమేషూ మీ బావగారూ వచ్చి చెప్తే అంతా తెలిసింది'' అంటూ యమున పక్కనొచ్చి కూర్చుంది శకుంతలమ్మ.

రమేష్, యమునా, శేఖర్‌ల ప్రణయం గురించీ, మధ్యలో వచ్చిన గొడవల గురించీ కావేరీ వాళ్లకర్థమయ్యేటట్లు చెప్పుకొచ్చాడు. ''ఈయనకంతా తెలుసా! నాకు కూడా చెప్పకుండా దాచారు అంతా కలిసీ. అయినా ఫరావాలేదులెండి. మా చెల్లెలదృష్టవంతురాలు, అర్థం చేసుకునే అత్తవారు దొరికారు'' అని యమున తల నిమిరింది కావేరి తృప్తిగా.

''బావగారిని మొన్నే ఆఫీసులో కలిసి అంతా వివరించాను. నాకు తెలిస్తే ఇంతదాకా రానిచ్చేవాడ్నా అంటూ సాయంత్రం నాతో కలిసి శేఖర్ వాళ్లింటికొచ్చి మాట్లాడారు. వాళ్లూ ఒప్పుకోవడంతో ఆ పెళ్లి చూపులు రద్దు చేసి ఈ పెళ్లిచూపులేర్పాటు చేశారు. యమునని బాగా ఏడిపిస్తానన్నారుకానీ...'' అని రమేషంటుండగా ''మా అమ్మాయి హడావిడి చేసింది ప్రొద్దుటే. దాంతో అందరూ హాస్పిటల్‌కెళ్లారు. ఎలా వుందో ఏమో'' అంది వర్ధనమ్మ.

"వాట్ ఏ లవ్ స్టోరీ!" అంటూ యమున బుగ్గలు పుణికింది హేమ్‌లెట్. నును సిగ్గులతో రెప్పలు బరువుగా వాలిపోతుంటే భారంగా ఎత్తి శేఖర్‌వైపు చూసింది యమున. సమయం కోసం కాచుకునున్న వాడిలా వెంటనే కన్ను గీటాడు. దిగ్గున తలదించుకుని 'ఎవరూ చూడలేదుకదా! ఈ మనిషికసలు బుద్ధిలేదు' అనుకుంది మురిపెంగా.

ఇంతలో శశిధర్ పెద్ద స్వీట్ బాక్స్‌తో హడావిడిగా లోపలికొచ్చాడు. "ఎలా వుంది నాయనా! ప్రసవమయిందా?" అంటూ ఆదుర్దాగా ఎదురొచ్చింది వర్ధనమ్మ.

"మొగపిల్లాడు పుట్టుంటాడు. మొహం చూస్తే తెలియడంలేదూ!" అంది హేమ్‌లెట్.

"కాదు ఆడపిల్ల, ముందు స్వీట్ తీసుకోండి" అన్నాడు ఆనందంగా స్వీట్ బాక్స్ ముందు పెడ్తూ.

"వెరీగుడ్, మహాలక్ష్మి పుట్టిందన్నమాట" అంది సంతోషంగా హేమ్‌లెట్.

"ఏదో ఒక పిల్ల, ముందు నా పిల్ల కులాసాగా వుందా?" అంది వర్ధనమ్మ ఆత్రంగా.

"కులాసాగా వుందండీ, పదండి మనం హాస్పిటల్ కెళ్దాం" అన్నాడు శశిధర్.

"ఆడపిల్లలు ఆణిముత్యాలయ్యా. నా ఇద్దరాడపిల్లలూ చూడండి రత్నం, వజ్రం" అన్నాడు రామారావుగారు తృప్తిగా.

"ఆడపిల్లలేని ఇల్లు వెలితిగానే వుంటుంది. అది నాకు బాగా తెలును! ఆ వెలితి మా కోడలొచ్చి తీర్చాలి. అచ్చం ఇలాంటి కుటుంబంలోంచి వచ్చిన పిల్లే కావాలనుకున్నాము. మా అందరితో కలిసిమెలిసి వుంటే అంతేచాలు!" అంది శకుంతలమ్మ.

రామారావుగారు చేతులు జోడించి "కోటికొక్కరుంటారు మీలాంటి పుణ్యమూర్తులు" అన్నారు ఆనందంగా.

★ ★ ★

దూరంనించి 'తెర తీయరా... తిరుమలావాసా' అని మధుర గాయకుడి స్వరం అమరమై, అమృతప్రాయమై తేలివస్తోంది.

"నేనింక అడుగు కూడా వెయ్యలేను బాబూ" అంటూ మెట్లమీద మోకాళ్లు పట్టుకుని కూర్చుండిపోయింది సింధు.

అరుణ్ నవ్వుతూ చెయ్యి జాపి "వాళ్లని చూడు!" అన్నాడు. "నెత్తిలమీద మూటలు పెట్టుకుని, భుజాల మీద పిల్లల్నెక్కించుకుని ఆడా, మగా మనకర్థం కాని తెలుగులో మాట్లాడుతూ ముందుకు సాగి, నిముషంలో కనుమరుగవుతున్నారు"

"నావల్ల మాత్రం కాదు. ఈ మోకాళ్ల పర్వతం దగ్గరే మోకాళ్లు పట్టుకుని కూలబడిపోతాను" అంది.

చేతిలోని తేగని వలచి, దాన్లోంచి చందమామని తీసి ఆమె నెత్తిమీద మొత్తూ "సింధు డాక్టర్ అయిన సందర్భంలో ఎంత ఉత్సాహంగా వుండాలీ? ఎలా లేడిలా గెంతులెయ్యాలీ? అసలు దేనికైనా పట్టుదలుండాలిలే!" అన్నాడు కవ్విస్తూ. "నాకు పట్టుదల లేదంటావా? అయితే చూడు ఎలా నడుస్తానో" అంటూ లేచి చకచకా మెట్లెక్కసాగింది సింధు.

అరుణ్ వెనకనించి "నడువవే వాలు కనులదానా, వయ్యారీ హంస నడకదానా!" అంటూ పాడసాగాడు. సింధు నవ్వుతూ వెనక్కి తిరిగి అతని చేయందుకుంది.

మెట్ల మీద కూర్చుని ప్రసాదం తింటుంటే "కొండలలో నెలకొన్న కోనేటి రాయుడు వాడూ..." అంటూ శ్రావ్యంగా వినిపిస్తోంది. చుట్టూ రకరకాల మనుషులూ, రకరకాల భాషలూ. సింధు చమేలీ పూవుల దండను కొని సిగనిండా ముడుచుకుంది. ఆకుపచ్చని ఎర్రని అంచు పట్టుచీరలో అప్పుడే విరబూసిన లతలా వుంది సింధు.

"పద భోజనానికెళ్దాం" అని అరుణ్ లేస్తుంటే "ఇక్కడినుంచి కదలబుద్ధి కావట్లేదు అరుణ్, బహుశా! స్వర్గం ఇలాగే

వుంటుందేమో'' అంది.

''అందుకే దీన్ని కలియుగ వైకుంఠం అన్నది, పద'' అన్నాడు చేయి పట్టి లేపుతూ.

''థాంక్స్ ఎలాటొ'' అంది ఆ చేయి అలాగే గట్టిగా పట్టుకుని.



''నీ లీల పాడెద దే...వా'' అంటూ నాద స్వరం వాళ్లు తమ సత్తా చూపిస్తున్నారు. ప్రతివాళ్లూ చాలా హడావుడిగా తిరుగుతూ, ఎదురు పడ్డవాళ్ల చెవుల్లో ఏదో వని పురమాయిస్తున్నారు.

జయ చంటి పిల్లని శశిధర్ చేతిలో పెట్టి ''ఎత్తుకోండి! పెళ్లికూతుర్తోబాటు జ్యోతులు తేవాలి!'' అంటూ గబగబా వెళ్లిపోయింది.

ఆయిల్ క్లాత్ మీద స్వెట్టర్‌తో వున్న పాపనెత్తుకుని అది జారిపోతుంటే గుండెల కదుముకుని నానాపాట్లూ పడ్తున్నాడు శశిధర్.

''బాగానేవుంది! అబ్బురంగా పిల్లపుడ్తే దబ్బునంతో ముక్కు కుట్టమనీ, దానికి అసలే ఉక్కపోస్తుంటే ఇవన్నీ ఏమిట్రా'' అంటూ వచ్చింది దుర్గమ్మ.

''ఊరికే ఎత్తుకోకండి! హైట్ బోయిల్ అయిపోతుంది'' అంది హేమ్‌లెట్.

''ఏమయిపోతారూ?'' అంది అర్థంకాక దుర్గమ్మ. ''హైట్ అంటే ఎత్తు, బోయిల్ అంటే మరగడం, ఎత్తు మరిగిపోతుంది'' అని వివరించింది హేమ్‌లెట్.

''ఇదిగో చూడమ్మా, ఇట్టాంటి బొట్లేరు ఇంగిలీసు నాకర్థం కాకుండా మాట్లాడమోకు. నాకసలే మంచి నోరులేదు. అసలు బెజవాడ కనకదుర్గమ్మ అంటే ఏమనుకుంటున్నావ్?'' అంది గట్టిగా.

''కోరిన వరాలిచ్చే చల్లని తల్లని మేమందరం అనుకుంటాము. ముందు అక్షింతలు తీసుకుని వధూవరులని దీవించండి'' అంటూ కావేరి అందుకుంది.

''అంతే! అంతే! మా తల్లే'' అంటూ అక్షింతలందుకుంది దుర్గమ్మ.

పూలజడా, నుదుట బాసికం, బుగ్గన చుక్కా, కళ్యాణబొట్టు పెట్టుకుని మధువర్కాలలో యమున, శేఖర్ కూర్చునున్నారు. తలంబ్రాల బియ్యం తెచ్చారు. ''బావా, మనమే గెలవాలి! గబగబా పోసేసెయ్'' చెవిలో చెప్పింది శిరీష.

స్లీవ్‌లెస్ బ్లౌజూ, పట్టుచీరా కట్టుకుని, నగలన్నీ పెట్టుకుని మిలమిలా మెరిసిపోతున్న ఆ పుత్తడిబొమ్మ ఎవరా? అన్నట్లు పరిశీలనగా చూసింది యమున తలెత్తి. ''ఏమిటి అలా చూస్తున్నారు? నేను మా బావ మరదల్ని'' అని కినుక్కున నవ్వింది శిరీష.

దేవకన్యలింత అందంగా వుండేవారన్న మాట అనుకుంది యమున. సాటి స్త్రీ అయిన తనే కనులు తిప్పుకోలేకపోతోంది! కానీ శేఖర్! ఎంత నిగ్రహం చూపాడూ! మనసు మరల్చుకొని స్వచ్ఛమైన ప్రేమని పంచాడూ! అనుకోగానే అతని మీద ప్రేమరెట్టింపయి తృప్తితో గుండె పొంగింది.

శిరీష గట్టిగా చప్పట్లు కొడ్తూ ''అక్కా! ఓడిపోయావు'' అంటుంటే అప్పుడు గమనించింది శేఖర్ మొత్తం పళ్లెం ఎత్తి తన తలమీద తలంబ్రాలు గుమ్మరించేశాడని.

శిరీషని చూస్తూ ''నీ వెలుగుకి నా కళ్లు చీకట్లయాయి చెల్లెలా!'' అంది నవ్వుతూ.

చేతిలోని అక్షింతలు వధూవరుల మీద చల్లి ''కలకాలం సుఖంగా వుండండి'' అని తృప్తిగా నిట్టూర్చారు కాత్యాయినీ, రామారావు గార్లు.

★

# శరీరాలు వేరయినా బాధ ఒక్కటే!

కవలపిల్లలు రూపురేఖల్లో ఒక్కలా వుండటం, ఎంత దగ్గరివారైనా ఒక్కోసారి ఎవరెవరో తెలియక గుర్తించడానికి ఇబ్బందిపడటం సర్వసాధారణ విషయం. కానీ ఆస్ట్రేలియాలోని మెలబోర్న్‌కి చెందిన ఫామెకో, ఫీ అనే కవలయువతుల విషయంలో మరిన్ని చిత్రాలు జరిగాయి. వేర్వేరు ప్రాంతాల్లో నివశిస్తున్న ఈ యువతులకు ఒకేరకమైన శారీరక, మానసిక అనుభవాలు కలుగుతున్నట్లు చెబుతున్నారు. నర్స్‌గా పనిచేస్తున్న ఫీ నైట్‌డ్యూటీ అనంతరం అప్పుడే హాస్పటల్‌నుంచి వచ్చి కాఫీ తాగబోయేంతలో, హటాత్తుగా కడుపులో విపరీతమైన నొప్పి ప్రారంభం కావడం, దాన్ని తట్టుకోలేక కిందపడి దొర్లి కేకలు పెట్టడం, ఓ గంటకి అది సద్దుకోవటం జరిగింది. ఆ తర్వాత తన కవలసోదరి అప్పుడే మగపిల్లవాడిని ప్రసవించినట్లు ఫోను వచ్చేసింది. తరువాత విచారిస్తే సరిగ్గా ఫామెకోకి నెప్పులు ప్రారంభమయిన టైములోనే ఫీకి కూడా ప్రసవవేదన మొదలయి, ఆమె కనగానే ఈమెకి బాధ ఉపశమించిందట. ఇలా ఎన్నో చిత్రాలు జరిగాయి ఆ కవలల విషయంలో. దీనిమీద అనేక పరిశోధనలు జరుగుతున్నట్లు తెలుస్తోంది.

# చేతిరాత

## బాల్కనీ అమ్మాయి

సాయంత్రం 5 గంటలు కొట్టేసరికల్లా క్లాసు పుస్తకం ఒకటి చేతిలో పట్టుకుని మేడపైకి చేరుకున్నాడు గోపాలం. పుస్తకంలోకి చూస్తున్నట్లు నటిస్తున్నాడే తప్ప, వాస్తవానికతని దృష్టంతా ఎదురింటి బాల్కనీమీదే కేంద్రీకృతమై వుంది.

వారంక్రితం ఓరోజు... ఎప్పట్లా తను సాయంత్రంవేళ ట్రిమ్ముగా తయారై మిత్ర బృందాన్ని కలిసేందుకని బయలుదేరాడు.

"అడ్డగాడిదలా బజార్లవెంట బలాదూర్లు తిరక్కపోతే శ్రద్ధగా చదూకోరాదూ? డిగ్రీ ఇప్పటికి నాలుగుసార్లు డింకీలు కొట్టించావ్‌గదా సిగ్గన్నాలేదట్రా?... మరో నెలరోజుల్లో పరీక్షలు పెట్టుకుని ఇంకా తిరుగుతున్నావా?" గుమ్మంలోనే ఎదురైన తండ్రి తిట్లకు లంకించుకున్నాడప్పుడు.

"వాడెందుకు చదువుతాడండీ? వీడేదో చదివి అల్లుడై తనని ఉద్ధరిస్తాడని మా అన్నయ్య ఆశపెట్టుకున్నాడు. బంగారంలాంటి నా మేనకోడల్ని వీడికి కట్టబెట్టి దాని గొంతు కోయడమెందుకుగానీ మరో మంచి సంబంధం చూస్కోండని రేపే ఆయనకో ఉత్తరంముక్క రాసి పడేయండి..." వసారాలోకి వచ్చిన తల్లి అష్టోత్తరం అందుకుంది.

గత్యంతరంలేక రెండు పుస్తకాలు చేత పట్టుకుని చదువుకునేందుకు మేడ పైకెక్కాడు. అదే సమయంలో... అక్కడ ఎదురింటి బాల్కనీలో ఓ మెరుపుతీగ... అందాల భరిణె దర్శనమిచ్చిందతనికి. ఆమె రూపలావణ్యాలకి ముగ్ధుడైపోయాడు గోపాలం. ఆమె లోపలికి వెళ్ళిపోయినా ఆమె వెళ్ళినవైపే గుడ్లప్పగించి చూస్తూ నిలబడ్డాడతను.

మరో ఐదు నిమిషాల్లో ఏడాదిన్నర కుర్రాడ్ని చంకనేసుకుని మళ్ళీ బాల్కనీలోకొచ్చిందా అందాలరాశి. పిల్లవాడితో ముచ్చట్లాడుతూ మధ్యమధ్య గోపాలంవంక చూస్తూ గంటకిపైగా బాల్కనీలోనే తారట్లాడి లోనికి వెళ్ళిపోయిందామె.

అప్పటినుంచి సాయంత్రంవేళ చదువునెపంతో అతను పైకిరావడం, అదేవేళకి ఆమె కూడా బాల్కనీలోకి రావడం, కళ్ళతో ఒకరినొకరు పలకరించుకోవడం మొదలైంది. పెద్దలకి అనుమానం రాకుండా ఉండేందుకు కాబోలు ఆమె వాళ్ళన్నగారి కొడుకుని కూడా తనతో తీసుకువచ్చి ఆడిస్తుండేది. గత పదిరోజులుగా ఈ తతంగం క్రమం తప్పకుండా జరుగుతోంది.

'ఇంకెంతకాలం ఈ మౌనరాగం, మూగ ప్రేమ. ఈరోజెలాగైనాసరే మాటల్లోకి దించాలను'కున్నాడు గోపాలం.

అయితే ఖర్మమేంటోగానీ ఈరోజు ఆమె ఎంతకీ బాల్కనీలోకి రాలేదు. చీకటి పడుతున్నా ఆమె వచ్చే సూచనలు కనబడలేదు. నిరుత్సాహంగా మేడదిగి వచ్చాడు అతను. మనసంతా చిరాకుగా వుంది.

"అమ్మా అలా బయటకు వెళ్ళొస్తా" అని తల్లికి చెప్పి స్కూటర్‌ని టాంక్‌బండ్‌వైపు పరుగెత్తించాడతను.

★ ★ ★

టాంకుబండ్‌మీది త్యాగయ్య విగ్రహం వెనుక క్రీనీడలో కూర్చున్నాడు గోపాలం విషాదంగా. ప్రశాంతత వెదుక్కుంటూ అక్కడికి వచ్చినా అతని ఆలోచనలనిండా ఆ బాల్కనీ అమ్మాయే నిండివుంది.

అంతలో..విగ్రహం ముందువైపునుంచి ఏవో మాటలు వినిపించి ఆసక్తిగా చెవులు రిక్కించాడు గోపాలం.



"అప్పుడే ఏడున్నరయింది... ఇంక వెళ్లాం సుధీ" గోముగా అంది స్త్రీకంఠం.

"అబ్బ... వెళ్లువులెద్దూ" అంది పురుష కంఠం.

"అన్నయ్యా, వదిన ఎదురుచూస్తుంటారు. మరో పదినిముషాలు గడిస్తే మా అన్నయ్య గానీ వెతుక్కుంటూ వస్తే మన బండారం కాస్తా బయటపడుతుంది"

"అదిసరే! మీ పిల్లరాక్షసుడు... అదేనోయ్ మీ అన్నయ్య కొడుకు ఏమంటున్నాడూ? నీతో పాటు షికారు వస్తాననటంలేదా?"

"అరె! చెప్పడం మరిచాను. వాడ్నీమధ్య ఓ కొత్తటెక్నిక్‌తో దారిలో పెట్టేశాన్లే"

"టెక్నిక్కా...?"

"అవును... రోజూ సాయంత్రం వాడ్ని బాల్కనీలోకి తీసుకువెళ్తాను. అదే సమయాని కి మా ఎదురింటి డాబామీదికి ఓ కాలేజీ కుర్రాడొస్తాడు. బుజ్జిగాడికి వాడ్ని చూపించి అడుగో బూచాడని చెప్తాను. ఎందుకంటే అయ్యగారి ముఖం గండుబిల్లి ముఖంలా ఉంటుందిలే! ఇకిలించాడంటే అంతేసంగతు లు. అస్సలు చూళ్ళేం. బుద్ధిగా అన్నం తినక పోయినా, చెప్పినమాట వినకపోయినా ఆ బూ చాడికి ఇచ్చేస్తానని బెదిరించాన్లే. అంతే! వెధవ కిక్కురుమనడంలేదు"

గోపాలం వీపున కొరడాతో ఛళ్ళున చరిచిన ట్లయింది.

అనుమానంగా వెనక్కి తిరిగి, వాళ్ళు లేచి వెడుతుంటే చూశాడు. ఆ అమ్మాయి మరెవరోకా దు, తమ ఎదురింటి బాల్కనీ అమ్మాయే!

-చంద్రప్రతాప్

## ఫూర్ ఫెలో

కాలేజీ కుర్రాళ్లు సిటీబస్సుకోసం వెయిట్ చేస్తూ విసుగెత్తిపోతున్నారు. ఒకరిమీద ఒకరు ఏవేవో జోకులు పేల్చుకుంటూండగా చెవులకు కుండలాలూ, చేతులకి సువర్ణకంకణాలూ, మెడలో రుద్రాక్షమాలలతో వచ్చగా మెరిసిపోతూ అచ్చంగా బృహస్పతిలా వెళ్తున్న ఘనాపాఠీ ఒకరు కనిపించారు. ఆ కుర్రమూకలోంచి జగన్నాధం అనే బి.ఏ. చదూతోన్న కుర్రాడు "ఫ్రెండ్స్, చూడండి ఓ చిన్న గమ్మత్తు చేస్తాను" అన్నాడు.

అందరూ ఆసక్తిగా జగన్నాధాన్ని చూస్తున్నారు.

"నమస్కారం సార్! బావున్నారా?" అన్నాడు అతను ఎదురుగా వెళ్లి రెండు చేతులూ జోడిస్తూ.

"దీర్ఘాయుష్మాన్‌భవ! ఎవరు బాబూ నువ్వు?" అన్నారాయన.

"మీరూ... మీదీ ఊరేకదా!"

"కాదు బాబూ. నేను కాకినాడనుండి వస్తుంట"

"అలా చెప్పండి. ఎక్కడో చూసినట్టుందే అనుకున్నా! కాకినాడలో మీరుంటున్నది ఎక్కడ?"

"జగన్నాధపురం బాబూ! నీకక్కడ తెలిసిన వాళ్ళెవరైనా ఉన్నారా?"

"జగన్నాధపురంలోనే మా బాబాయి ఉన్నాడండీ. షిప్పులో పనిచేస్తున్నాడు. నేను సెలవులకి అటు వచ్చినప్పుడు మా ఇంటిముందు నుండి మీరెళ్తూండటం రోజూ చూస్తుండేవాణ్ణి. మా బాబాయి మీ గురించి గొప్పగా చెప్తుంటారు సార్!"

"మీ బాబాయెవరమ్మా!"

"ఊ... అదేనండి. సూరావధానిగారని. సామవేదంలో మంచి పండితులు"

ఆయనో క్షణం ఆలోచించి సామవేదంలో నాకు తెలీని వారెవరబ్బా అనుకొని మరి షిప్పులో పనిచేస్తున్నారంటున్నావూ?" అన్నారు.

"అదికాదు సార్! ఈ సూరావధానులుగారు మా తాతగారు. షిప్పులో పనిచేసేది వారి అబ్బాయి"

"ఓ... అలాగా" అంటూ ఆలోచిస్తోన్న అతని కళ్ళకి దూరంనుండి ఇటే చూస్తూ సైగలు చేసుకుంటూ నవ్వుకుంటూన్న విద్యార్థులు కనిపించారు.

అంతే! శాస్త్రులుగారు పేగులు లెక్కెట్టేశారు.

"ఓహో! అలా చెప్పవేం? సూరావధానులు నీకు తాతగారన్నమాట! అదే ఇందాకట్నుంచీ ఆలోచిస్తున్నాను. ఓరి భడవా! అచ్చు గుద్దినట్లు ఆ కళ్ళూ... ఆ ముక్కూ. ఆఁ... ఎదిగిపోయావనుకో. నరే! నిన్ను చూస్తే మీ తాతని చూసినట్టుందోయ్. ఇంతకీ ఏం చదూతున్నావ్?"

"బి.ఏ. సెకెండియరండీ!"

"అబ్బో... బాగా చదూతున్నావా? మీ తాతంటే నాకు చచ్చేంతహడలు. ఆయన దగ్గర నోరువిప్పి వేదమ్ముక్క చదవటానికే భయం. నేనేకాదు నాలాంటి ఘనాపాఠిలెందరో కూడా అతని దగ్గరెందుకూ పనికిరాం. రా! అలా టిఫిన్ చేద్దాం" అన్నాడు.

"అబ్బే. వద్దులెండి" అన్నాడు జగన్నాధం.

"ఫర్వాలేదోయ్" దగ్గర్లో ఉన్న కాఫీ హోటల్లో దూరారిద్దరూ.

సర్వరొచ్చాడు "ఏంటి కావాలని?"

"ఏమున్నాయి?" శాస్త్రి ప్రశ్న.

దండకం వల్లించాడు సర్వరు.

"రెండు ప్లేట్లు పెరుగ్గారె. తర్వాత పెసరట్టు పట్రా"

జగన్నాధం గొప్ప హుషారుగా ఉన్నాడు. "గురుడు గొప్ప టోకరా తిన్నాడు" అనుకున్నాడు మనసులో. పెరుగ్గారె పెసరట్టు తెచ్చి సర్వరు పెట్టగానే రెండు బోర్నవిటాకి ఆర్డరిచ్చి శాస్త్రిగారు-

"నాకు కాఫీ తాగే అలవాటులేదు" అన్నారు.

"నేనూ తాగనండి" అన్నాడు జగన్నాధం.

సర్వరు బిల్లు తెచ్చాడు ముప్ఫయ్యయిదు



రూపాయలకు.

మొహమాటంకోసం జగన్నాథం "నేనిస్తా అలాగుంచండి" అన్నాడుగాని బిల్లు మాత్రం ముట్టుకోలేదు.

శాస్త్రిగారు మొలతడుముకొని "అయ్యో! ఎంత పనయిపోయిందీ. పర్సు చేత్తో పట్టుకొని ఇంట్లో మరిచిపోయాను. పోనీబాబూ, నీ సంతోషమే కానీ" అన్నాడు. జగన్నాథం జేబులోంచి కనిపిస్తోన్న ఏభయిరూపాయల నోటుని చాలా సేపట్నించీ చూస్తోన్న శాస్త్రిగారు.

జగన్నాథం గొంతులో వెలక్కాయపడింది. చేసేదిలేక ఆ బిల్లందుకుని కౌంటర్లో డబ్బులు చెల్లించాడు.

"బాబూ! ఓ మిఠాయి కిళ్ళీ తీసుకోమ్మా. వెధవది టిఫిన్‌చేస్తే కిళ్ళీ వేసుకోవాలనిపిస్తుంది" అన్నారు బయట కిళ్ళీకొట్టు దగ్గర ఆగి.

ఒరే ముసలోడా పడిపోయానురా! ఇంకా ఎందుకురా నన్ను బాదేస్తున్నావ్' అని బయటకనలేక కొట్లో కిళ్ళీ తీసుకొని డబ్బులిచ్చేశాడు.

"అయ్యా! బస్సు వచ్చేస్తుంది వస్తా సార్" అని హడావుడి పడుతోన్న జగన్నాథంతో...

"ఇంతకీ తాతగారికేం చెప్మంటావ్?" కిళ్ళీ నములుతూ అడిగారు శాస్త్రిగారు.

"హి... హి... అడిగానని చెప్పండి" అని వెనక్కితిరిగి చూడకుండా పరుగుతీస్తోన్న జగన్నాథాన్ని చూసి 'పూర్‌ఫెలో నా వయసులో మూడోవంతు వయసులేని నువ్వు నాతో జోకులేస్తావురా. ఇకపై జాగర్తగా మెసులుకో!' అనుకున్నాడు మెల్లగా.

-పి.వి.బి.శ్రీరామమూర్తి

# గుణపాఠం

**బ్యాం**కులో పనిచేస్తున్న విశ్వంతో పనుండి పదిగంటలకల్లా బ్యాంకు దగ్గరకి వెళ్ళేడు మూర్తి. విశ్వం రాకకోసం ఎదురుచూస్తూ బ్యాంకు ముందే నించున్నాడు.

"బాబూ! ఊరికి వెళ్ళాలి. పర్సు కొట్టేశారు. జేబులో చిల్లిగవ్వలేదు. దయచేసి తలోకాస్త చిల్లర సహాయం చేస్తే ఊరెళ్ళిపోతాను" మూర్తి పక్కనే నిలబడి అడిగేరెవరో.

ఇలాంటి వాళ్ళీమధ్య ఎక్కువయిపోతున్నా



రనుకుంటూనే మూర్తి అతడివేపు పరీక్షగా చూసేడు. ఒకప్పుడు బాగా బతికినవాడే అని పించింది. ఆ వినయం, ఆ కట్టుతీరూ, మాట ల్లో ఉచ్చారణా...! ఓడలు బండ్లు బండ్లు ఓడలూ కావటం సహజమేకదా! పాపం పర్సు పోగొట్టుకున్నాట్ట! అనిపించింది.

"ఏ ఊరెళ్ళాలండీ...?" అడిగేడు మూర్తి.

"మంగళగిరి" చెప్పేడతను వినయంగా.

మూర్తి వెంటనే జేబులోంచి ఓ రెండు రూపాయలు తీసి అతడికిచ్చేడు. ఆ వ్యక్తి మూర్తి ఇచ్చిన నోటువేపు ఎలాంటి ఆసక్తి లేకుండా అదోలా చూసి జేబులో వేసుకుని అక్కణ్ణించి కదిలేడు.

విశ్వం వచ్చేడు. బ్యాంకులోకి వెళ్లి హాజరుప ట్టీలో సంతకం పెట్టి మూర్తికోసం బయటికొచ్చే డు. క్యాంటిన్‌లో కూర్చుని ఇద్దరూ మాట్లాడు కుంటున్నారు.

"బాబూ! ఊరికి వెళ్ళాలి. పర్సు కొట్టేశా రు..."

ఆ గొంతు ఇందాక విన్న గొంతే. మూర్తి ఠక్కున తలెత్తి చూశాడు. అవును. ఇందాకటి వ్యక్తే.

మూర్తికెందుకోగాని అనుమానం వచ్చింది. అతడికి తనిందాక రెండు రూపాయలు ఇచ్చి నప్పటికీ అతడి చేతిలో మరి కొంత డబ్బుంది. మంగళగిరి వెళ్ళేందుకు ఆ డబ్బు సరిపో తుంది. మరింకా అతను ఇలా యాచించటం ఏంటీ?

అతడు మూర్తిని గుర్తు పట్టినట్టు లేడు. 'అతను మాత్రం ఎంతమందినని గుర్తుంచు కుంటాడు?' అని మనసులోనే అనుకుంటూ-

"ఏ ఊరెళ్లాలి?" అడిగేడు మూర్తి- ఏమీ తెలియనట్టు.

"నంద్యాల వెళ్ళాలి సార్. దూరాభారం. పర్సు కొట్టేసేరు..."

"చాలు చాలు" అని మూర్తి చొక్కాజేబులో చెయ్యిపెడుతూ-

"మీ దగ్గర రెండు రూపాయలు ఉంటే ఇవ్వండి. మీకు అయిదు రూపాయలనోటు ఇస్తాను" అన్నాడు.

ఆ వ్యక్తి వెంటనే రెండు రూపాయలు తీసి మూర్తికిచ్చేడు.

మూర్తి ఆ నోటుజేబులో వేసుకుని- "ఇక వెళ్లండి. నా డబ్బు నాకు తిరిగొచ్చింది. అపాత్రదానం మంచిది కాదన్నారు..." అతడివేపు కోపంగా చూస్తూ అన్నాడు మూర్తి.

విశ్వం ఏమీ అర్థంకాక మూర్తికేసి అయోమయంగా చూస్తున్నాడు.

మూర్తి విశ్వం పరిస్థితి అర్థం చేసుకొని ఇందాక జరిగిందంతా విశ్వానికి చెప్పేడు.

తను చేసిన పొరపాటు ఆ వ్యక్తికి అప్పుడు తట్టింది. ఒకసారి మంగళగిరి వెళ్ళాలనటం, మరోసారి నంద్యాల పోవాలనటం...

వెనక్కు తిరిగి వెళ్లిపోబోతున్న అతణ్ణి భుజంమీద చెయ్యేసి ఆపేడు మూర్తి. అతడి కళ్లలోకి తీక్షణంగా చూసేడు.

"మీ దగ్గర్నించి ఈ రెండు రూపాయలూ తిరిగి తీసుకోటం నా ఉద్దేశం కాదు. చూట్టానికి పెద్దవార్లా ఉన్నారు. ఇలా అబద్ధాలు చెప్పి యాచించటం బాగోలేదు..."

ఆ వ్యక్తి కళ్లు సిగ్గుతో వాలిపోతున్నట్టని పించింది మూర్తికి. అక్కడ్నించి త్వరగా వెళ్లిపోవాలన్న ఆతృత కూడా ఆ వ్యక్తిలో కనిపిస్తోంది.

ఇక అతన్ని ఇబ్బంది పెట్టటం భావ్యం కాదనుకుని- "ఇంతకూ ఇప్పుడు జరిగిందాని వల్ల ఏదేనా పాఠం నేర్చుకున్నారా?" సూటిగా అడిగేడు మూర్తి.

ఆ వ్యక్తి క్షణంసేపు తటపటాయించి ఆ మీదట చిన్నగా దగ్గాడు.

"నేర్చుకున్నాను సార్. ఇంకెప్పుడూ ఓసారి తిరిగిన ఏరియాలో మళ్లీ తిరగను..." అంటూ వేగంగా వెళ్లిపోయేడు.

మూర్తి బొమ్మలా నిలబడిపోయేడు.

**-గోపరాజు నాగేశ్వరరావు**

---

## సినిమా సీక్రెట్

భాగ్యంకు సినిమాలంటే మహా ఇష్టం. టి.వి. చూసినా, రేడియో విన్నా ఆ ఆసక్తి అంతా సినిమా గురించే. వి.సి.ఆర్., స్టార్ టీ.వీలాంటి అదనపు ఖర్చులను భరించే శక్తిలేని మధ్యతరగతి మానవుడు ఆమె భర్త జోగారావ్. సినిమాలంటే పడిచచ్చే తనకూ, సినిమా పేరు చెబితే ఎలర్జీతో చచ్చే జోగారావుకీ పెళ్ళి కావడం 'దైవలీల'కాదు తన ఖర్మ అని భాగ్యం నెత్తి బాదుకుంటూ వుంటుంది.

భర్తకు ఆసక్తి లేకా, తీసుకెళ్ళే మరో తోడులేకా కొత్తగా ఆ వూరొచ్చిన భాగ్యం సినిమాలు చూడలేక కుతకుతలాడిపోతోంది. పైగా పనిమనిషి సుబ్బి మూడురోజులకో సినిమా చూసినట్టు చెబుతూవుంటుంది భాగ్యానికి.

ఓరోజు పనిలోకి వస్తూనే

"అమ్మగోరూ! నిన్న మాపటేల అనుకోకుండా మా పక్కింటి రత్తాలూ, నేను కలిసి చిరంజీవి సినిమా చూసొచ్చామండి" అంది.

"అవునా? ఎలావుందే సుబ్బీ! హీరోయిన్ ఎవరూ? ఇంతకీ ట్రాజడీనా? కామెడీనా? చిరంజీవి ఫైటింగ్‌సీన్లెన్నున్నాయేమిటీ....?" అంటూ ఒకదానిమీద ఒకటి ప్రశ్నలు గుప్పేసింది.

సుబ్బి కూడా "అదేంటడమ్మా! అలాగడుగుతారూ? అసలు ఫైటింగ్ సీన్ లేకపోతే నే పోనేపోను" అంటూ సినిమా కథ చెపుతూనే సగమే వేసిన గిన్నెలని అలా ఇలా సగంసగం పామేసి చటుక్కున మాయమయింది.

ఆ తరువాత ఉలిక్కిపడిన భాగ్యం సుబ్బినీ, తననీ కలిపి తిట్టుకుని మిగిలిన గిన్నెలు తనే తోముకుంది.

వారం రోజుల తర్వాత అనుకోకుండా పనివేళకి ఓ గంట ముందే వచ్చి తలుపు తట్టింది సుబ్బి.

"అమ్మగోరూ! నిన్న ఎంకటేశాలో కమలాసన్ సినిమా ఇడుదలైపోయింది" అంది సంబరంగా.

మొహం చాటంతయింది భాగ్యానికి. వెళ్ళడం ఎలాగాని ఆలోచించగా, ఆలోచించగా ఫ్లాష్‌లా...




'పోనీ ఈ సుబ్బినే తోడు తీసికెడితే...?' అన్న అయిడియా వెలిగింది బుర్రలో.

"ఏమే సుబ్బీ! ఆ సినిమాకెడదామా ఏంటే?" అంది.

"ఏంటండమ్మో! అదసలే కొత్తబొమ్మ. బ్యాక్‌లోగానీ టిక్కెట్లు దొరకవు. నేనెక్కడ రాగల్నూ?" అంటూ దీర్ఘాలు తీసింది సుబ్బి.

"పోదూ! బడాయి! నీ టిక్కెట్టు నేకొంటాలే" అంది వెంటనే.

ఆ క్షణంలో భర్తకానీ, ఆయనగారు రోజూ ఇంట్లో 'పొదుపు'మీద ఇచ్చే ఉపన్యాసాలు గానీ... ఏవీ గుర్తుకురాలేదు భాగ్యానికి. గబగబా వంటింట్లోకెళ్ళి సరుకులు తెప్పించమని ఇచ్చిన డబ్బులో ఓ ముప్ఫయి రూపాయలు తీసుకుని బయటకొచ్చింది.

"పదవే సుబ్బీ! ఆ వెధవ అంట్లు అలా వదిలెయ్యి. తరవాత చూసుకోవచ్చు" అంది.

ఎర్రటి ఎండలో ఆదరాబాదరా హాలుకు పరిగెడితే, 'హౌస్‌ఫుల్' బోర్డు కనిపించింది. బ్లాకులో టిక్కెట్లమ్మే కుర్రాణ్ణి చూసి అటువైపు పరిగెత్తారు ఇద్దరూ. సరిగ్గా అదే సమయంలో భాగ్యం భర్త కూడా ఆ కుర్రాడిదగ్గర బ్లాకులో టిక్కెట్లు కొంటున్నాడు. అతనికి పక్కనే వున్న అతడి మిత్రుడు సుబ్బినీ, దానిపక్కన జోగారావ్ భార్యనీ చూసి తెల్లబోయాడు. ఎందుకంటే సుబ్బి ఇంతక్రితం వాళ్లింట్లో పనిచేసింది. 'కొంపదీసి జోగారావుగాడు సుబ్బి చుట్టాన్ని ఆదర్శవివాహంగానీ చేసుకోలేదుగదా?' అని డౌటొచ్చింది. వెంటనే అడిగేశాడు కూడా.

కానీ ఇవేవీ వినే స్థితిలో లేడు జోగారావ్ సినిమా చూసి ఆనందించే మూడ్ పోయిండి భాగ్యంకు. ఇద్దరూ షాక్ తిన్నట్టు వుండిపోయారు. ఆ షాక్‌లోనే సినిమా సగం సగం చూసి ఇంటికొచ్చారు.

"పనిమనిషితో సినిమాకెళ్ళి పరువు తీస్తావా...?" అని భాగ్యంకన్న ముందుగానే అరిచాడు భర్త.

"మీరూ...? పొదుపు వుపన్యాసాలిచ్చి సినిమా సన్యాసినని మోసంచేస్తారా?" అపరకాళిలా విరుచుకుపడింది భాగ్యం.

ఆ దెబ్బకి ఆవిడకేసి వింతగా, భయంగా చూసిన జోగారావ్ 'సినిమా విషయంలో ఇకపై తన అబద్ధాలు సాగవ'ని అర్థంచేసుకున్నాడు. బ్లాక్‌లో కూడా టిక్కెట్లు కొని చూసే తన సినిమాపిచ్చి భాగ్యానికి పూర్తిగా అర్థమైపోయింతరవాత అతడికేంచెయ్యాలో తోచక తను వెళ్ళే ప్రతి సినిమాకి భాగ్యాన్ని వెంటబెట్టుకు వెళ్ళడం ప్రారంభించాడు. అంతేకాదు, మళ్ళీ ఆ ఇంట్లో ఆ మానవుడి పొదుపు వుపన్యాసాలు వినిపించలేదు.

-రాధాశివమోహన్

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 290328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

